

# గుంటూరు ఆర్యక్షత్రియ వంశ చరిత్ర మరియు గోత్రకాండము

## మైసూర్, గంజాం జిల్లా లోని శ్రీ నిమిషాంబాదేవి ఆలయ స్థలపురాణము



రాజు సుమనస్కుడు ముక్త మహర్షిని లోకరక్షణ కొరకు ప్రార్థించుట.



వెంటనే సుమనస్క మహర్షి నేటి మైసూరు, గంజాం వద్ద కావేరి నది ఒడ్డున లోకరక్షణకు యాగం తలపెట్టాడు.



యాగంను ధ్వంసం చేయుటకు జాను,సుమండలులను రాక్షసులు వచ్చిరి.



ముక్త మహర్షి రాక్షసులను సంహరించుటకు మహాశక్తిని ప్రార్థించెను.



వెంటనే యోగాగ్ని నుండి మహాశక్తి త్రిశూలం, ఢమరుకంతో ప్రత్యక్షమయ్యెను.



లోక కంటకులైన జాను, సుమండలులను తన త్రిశూలంతో సంహరించెను.



విజయహాసంతో మహాశక్తి ఆశీర్వదించెను. ముక్త మహర్షి అమ్మను కీర్తించెను.



పిమ్మట మహాశక్తి ఆ ప్రదేశములో 'శ్రీనిమిషాంబాదేవి'గా భక్తుల కోర్కెలు తీర్చుటకు మైసూరు నందు వెలసెను.



కావేరీ లోకపావనీ సంగమక్షేత్రే సృష్టే శ్రీచక్ర రాజ సహితే శ్రీ నిమిషాంబాదేవీ నమోస్తుతే

## శ్రీ నిమిషాంబా దేవి అమ్మవారు



# వివిధ ప్రాంతములలో వెలసిన
# శ్రీ నిమిషాంబాదేవి అమ్మవారు


గంజాం, మైసూర్


బెంగుళూరు


హైదరాబాద్


ఏలూరు


కడప


కర్నూలు





ఓం దుర్గే మహేశ్వరి గిరీంద్ర కుమారి గౌరి । నారాయణి త్రిపుర సుందరి సింహవాహిని ॥
ధర్మప్రవర్ధిని భవానీ రసత్రినేత్రి । త్రైలోక్యధాత్రి నిమిషాంబా నమోస్తుతే ॥

: మాతృనామం :

**ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళి:**

అర్థం : కనురెప్పపాటులోనే సృష్టి, స్థితి, లయాలను నిర్వహించే జగదంబ అధీనంలోనే కాలం నియమింపబడుతుంది. జగతిని నియమించేది కాలం. కాలాన్ని నియమించేది జగదంబిక. ఆ అఖండ కాలస్వరూపిణి తత్త్వమే **'నిమిషాంబికాదేవి'** గా అర్చనలందుకుంటుంది.

: బీజాక్షరాలు :

**ఓం హ్రీం ఐం క్లీం శ్రీ నిమిషాంబదేవియై నమః**


శ్రీ యకమా వెంకటస్వామి - శ్రీమతి యకమా నాగలక్ష్మమ్మ గార్లు



# గుంటూరు – ఆర్యక్షత్రియ వంశ చరిత్ర





ప్రథమ ముద్రణ : 2015

టైటిల్ పేజి : **శ్రీ నిమిషాంబాదేవి అమ్మవారు,** కర్నూలు.





ఈ పుస్తకమును రచించుటకు ఆద్యులు, పూజ్యులు అయిన
నా మేనమామగారైన **కీ॥శే॥ యకమా వెంకటస్వామి గారు**

*ఈ గ్రంధ ముద్రణలో సహాయపడినవారు :*
**యకమా కోటేశ్వరరావు,** SE/Civil/CC-II/SDSTPS, నెల్లూరు.
**యకమా ఫణికుమార్,** చెన్నై.
**యకమా నవీన్ కుమార్,** హైదరాబాద్.
**గౌడుగుల రవివర్మ,** గుంటూరు.
&
**యకమా నాగేశ్వరరావు,** గుంటూరు.

శ్రీశ్రీశ్రీ నిమిషాంబాదేవి వరప్రసాదిత, సుదక్షణా ముక్త మహర్షి
దంపతుల ప్రియకుమారుడగు, జ్యోతిష్మంతుని వంశస్థులగు
ఆర్యక్షత్రియ, చిత్రకారుల గోత్ర, ప్రవర, సూత్ర శాఖలు గల

# గోత్రకాండము

ప్రచురణ :

ఆర్యక్షత్రియ వంశస్థులు, గుంటూరు.



*డి.టి.పి. & టైటిల్ డిజైన్ :* **వై.యన్.ఆర్.గ్రాఫిక్స్**
డో.నెం.7-14-28/ఎ, వల్లూరివారితోట, 8వ లైను, గుంటూరు.
ఫోన్ : 0863-2242704, సెల్ : 9247818233, 70326 30900
మెయిల్ : *ynr.graphics@gmail.com*

అదనపు సమాచారము, ఫోటోలు పంపదలచినవారు
పై అడ్రస్‌కు పంపగలరు. తదుపరి ముద్రణలో చేర్చగలవారము.

# పీఠిక

***గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః***
***గురుఃసాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురువేనమః***

శ్రీ నిమిషాంబా దేవిని కుల దేవతగా ఆరాధించునటువంటి సుదక్షణా ముక్త మునీంద్రుల ప్రియ కుమారుడగు శ్రీ జ్యోతిష్మంతుల వంశస్థులగు ఆర్య క్షత్రియ చిత్రకారకుల కొరకు తెలియచేయు మహాశాసన పత్రిక. ఈ పత్రిక యందు గల సాంప్రదాయము, ఆచార వ్యవహారములు అందరూ పాటించగలరు.

పూర్వము కృతయుగ మధ్యకాలమున జానుమండలుడు, సుమండలుడు అను రాక్షస వీరులు జన్మించిరి. వీరిలో పెద్దవాడైనటువంటి జానుమండలుడు ధైర్యముచేసి మేరుపర్వతమును చేరి పంచాగ్ని మధ్య కూర్చొని బ్రహ్మదేవుని గూర్చి ఘోరముగా తపస్సుచేసి సర్వ లోకముల యందు తనకు ఎదురు లేకుండా బ్రహ్మదేవునిచే వరమును పొందెను. ఈ వరము యొక్క గర్వముతో దేవతలను, మునులను, నరులను నానా విధములుగా బాధపెట్టుచుండెను. ఈ బాధలకు తాళలేక దేవతలు జానుమండల, సుమండలుల గుర్చి ఇంద్రునకు మొరపెట్టుకొనగా ఇంద్రుడు ఆలోచించి ఈ రాక్షస వీరులను సంహరింప నాతో సాధ్యపడేది కాదని తనతో దేవతలను వెంటబెట్టుకొని బ్రహ్మలోకమునకు పోయి బ్రహ్మదేవునితో మొరపెట్టుకొనిరి. వైకుంతనాధుని వేడుకొనెదము అని చెప్పి అందరిని తీసుకొని బ్రహ్మ వైకుంతనాధుడగు శ్రీ మహావిష్ణువు వద్దకు పోయి వారి బాధలను విన్నవించుకొనిరి. అంతట శ్రీ లక్ష్మీనాధుడు తన దివ్యదృష్ఠితో అంతా పరికించి ఈ రాక్షసుల మదమణచువాడు పార్వతీనాధుడు యొక్కడేఅని విష్ణుమూర్తి బ్రహ్మ దేవేంద్రుని, దేవతలను వెంటబెట్టుకొని కైలాసమునకు పోయి కైలాసనాధుని ఎదుట తమ బాధలను గూర్చి మొరపెట్టుకొనిరి. అంతట శివుడు తన యోగమాయా ప్రభావముతో అంతటిని పరికించి జానుమండలుని సంహరించుటకు గల కారణము వేరే యున్నది. అతను కొద్ది కాలములోనే సంహరింపబడతాడు కావున మీరందరును భయపడక మీ స్వస్థలములకు పొందని శివుడు చెప్పిన పిమ్మట శ్రీ మహావిష్ణువు, బ్రహ్మదేవుడు దేవేంద్రుడు, దేవతలు మున్నగు వారు కైలాసమును వదలి వారి వారి స్వస్థలములకు పోయిరి. తదనంతరం బ్రహ్మదేవునిచే సృష్ఠించబడినటువంటి ఉత్తమ రాజర్షి సుమనస్క మహాముని అతని సతీమణి సుశీల సుఖసంతోషములతో భూలోకము నందు ఒక ఆశ్రమమున జీవించుచుండిరి. కొంత కాలమునకు వారి ఆశ్రమమునకు గౌతమముని వచ్చెను. వారి రాకకు సుమనస్క మహాముని, వారి ధర్మపత్ని సుశీల గౌతమునికి షోడశోపచారములతో మిక్కిలి గౌరవించిరి. ఆ గౌరవమునకు గౌతమముని సంతోషించి,



ఓ ముని దంపతులారా మీరు పుండరీక యాగము చేయుము, మీకు శుభములు కలుగును అని చెప్పి ఈ యజ్ఞమునకు జానుమండల సుమండులులను రాక్షస వీరుల వలన విఘ్నములు కలుగును. వారిని వధించుటకు పరమేశ్వరుడు యొక్కడే దారి చూపగలడు. కావున మీరు శివుని గూర్చి తపస్సుచేసి బలసంపన్నుడైనటువంటి కుమారుని వరముగాపొంది యజ్ఞ సంరక్షణ చేసుకొని ధర్మార్థ కామ మోక్షములను అనుభవింపుము యని గౌతమ ముని ఆ దంపతులకు చెప్పి తన ఆశ్రమమునకు వెళ్ళెను.

అంతట సుమనస్క యోగీంద్రుడును వారి భార్య సుశీల హిమాలయ పర్వతములుచేరి యేకాంత ప్రదేశమున పంచాగ్ని మధ్య కూర్చొండి పరమేశ్వరుని హృదయము నందు నిలిపి ఘోర తపస్సు చేసిరి. ఆ తపస్సునకు మెచ్చి పరమేశ్వరుడు సతీసమేతుడై దర్శనమిచ్చి ఏమి వరము కావలయునని పలుకగా ముని దంపతులు మిక్కిలి సంతోషించి స్వామి మేము చేయు పుండరీక యాగమును రక్షించుటకు రాక్షస కులాంతకుడు, మహా బల సంపన్నుడగువంటి కుమారుని ప్రసాదింపమని వేడుకొనగా సాంబమూర్తి కరుణించి తన యోగమాయా ప్రభావముతో ఒక దివ్య పురుషుని సృష్టించి అతనికి "ముక్త మహర్షి" అని నామకరణము చేసి అతనికి సకల విద్యలను ఉపదేశించెను మరియు గాయత్రి మహాస్త్రమును, పాశు పతాస్త్రమును, రౌద్రాస్త్రమును, నాగాస్త్రమును, గరుడాస్త్రమును, శక్తి బాణాస్త్రమును, పర్వతాస్త్రమును, అయింద్రాస్త్రమును, ఆగ్నేయాస్త్రమును, వాయువ్యాస్త్రమును మొదలయిన దివ్యాస్త్రములను ఉపదేశించి ఇక నుండి నీవు "ఆర్య క్షత్రియ వంశస్తుడవై సుమనస్క ముని దంపతులకు కుమారుడవై" వర్ధిల్లమని దీవించి, ఓ సుమనస్క ముని దంపతులారా! యీ కుమారుడు వేదశాస్త్రములందు, పరాక్రమమునందు వీరుడై, ధీరుడై ప్రకాశించుచుండును. రాబోవు కాలమందు ఈ ముక్తర్షికి దూర్వాసముని కుమార్తెయగు సుదక్షిణయను ముక్తి కాంతను భార్యగా పొందగలడు. ఇతని వంశమువారు రూపవంతులుగాను, సంపన్నులు, వేదపారాయణమునందు, చిత్ర విచిత్ర లేఖనమునందు విద్యా సంపన్నులుగాను, మహాఋషుల గోత్రములతో భూలోకమున విరాజిల్లగలరని ఆనతి నిచ్చెను. మరియు మీ కుమారుని వలన సర్వ సౌఖ్యములు మీకు కలుగును. ఈ ముక్తర్షికి యుద్ధకాలమునందు పార్వతీదేవి అంశయగు శ్రీ నిమిషాంబాదేవి సహాయము చేయుచూ కులదేవతగా కొలవబడును. కావున మీ కుమారుని వెంట తొడ్కొని పొమ్మని ఆశీర్వదించి శివపార్వతులు కైలాసమునకు పోయిరి. అంతట సుమనస్కముని పరమానందము చెంది తన భార్యను వెంటబెట్టుకొని అరణ్యముచేరి విశ్వకర్మచే యాగశాలను నిర్మించుకొని బ్రహ్మర్షులు, రాజర్షులు, దేవర్షులు మున్నగువారి సహాయముతో యాగం మొదలుపెట్టు సమయమున రాక్షస గురువుయగు శుక్రాచార్యుడు గమనించి జానుమండలాసురునికి ఈ విషయమును తెలిపెను. అప్పుడు జానుమండలుడు

తన మంత్రులను పిలిపించి తగిన రాక్షస వీరులను మీ వెంట పెట్టుకొనిపోయి సుమనస్కుడు చేయు యాగమును ధ్వంసముచేసి మునుల శిరస్సులను ఖండించి హోమగుండమునందు రక్తమాంసములను వేసిరండని ఆజ్ఞాపించెను. రాక్షసులు యాగశాలకుపోయి ప్రళయమును సృష్టించు సమయమున శ్రీ ముక్త మునీంద్రుల వారు కోపించి తన కులదేవతయగు శ్రీ నిమిషాంబాదేవిని ప్రార్ధించగా ఆమె వెంటనే ప్రత్యక్షమై రాక్షసులను హతమార్చెను. ఈ విషయమును కొందరు రాక్షసులు జానుమండలునికి తెలియపరచగా మిక్కిలి కోపించి కోటి రాక్షస వీరులతో ముక్తర్షిని ఎదిరించి యుద్ధము చేయదలచెను. అది గమనించి ముక్తర్షి యజ్ఞేశ్వరుని ధ్యానించగా హోమగుండమునుండి అనేక రథములు, సైన్యములురాగా వారి సహాయముతో జానుమండల, సుమండలులను, వారి సైన్యమును తన పాశుపతాస్త్రముతో సంహరించెను. దేవతలు ముక్తర్షిపై పూలవర్షమును కురిపించెను. అంతట సుమనస్కుడు యజ్ఞమును సజావుగా జరిపించి ఋషులకు సన్మానములు చేసి తన భార్యయగు సుశీలను, కుమారుని వెంట బెట్టుకొని తన నివాసమగు ప్రభావతి పట్టణమునకు పోయి కుమారుడగు ముక్తర్షికి పట్టాభిషేకము చేసి దుర్వాసముని కుమార్తెయగు ముక్తికాంతతో వివాహము జరిపి తాను తన భార్యతో కలసి తపస్సు చేసుకొనుటకు అడవికి వెళ్లెను.

పిమ్మట ముక్తికాంత, ముక్తర్షి దంపతులకు ఎనిమిది మంది కుమార్లు ఒక కుమార్తె కలిగిరి. సూర్యుని వరమున జన్మించినటువంటి పెద్ద కుమారుడగు జ్యోతిష్మంతుని గౌతముని కుమార్తెతోను తక్కిన కుమారులకు వేరు వేరు మునుల యొక్క కుమార్తెలతోను వివాహములను వైభవముగా జరిపించి తానును భార్యాసమేతుండై తపస్సు చేయుటకు పోయెను.

తరువాత ముక్తర్షి కుమారులు తమ భార్యలతో కలిసి వన విహరమునకు పోయి కొలనుయందు స్నానాలు చేయుచున్న సమయములో రోమశుండను బ్రహ్మర్షి కైలాసమునకు పోవుచూ ఆ మార్గమున వచ్చుటను ముక్తర్షి కుమారులు చూచి ఏదో పిశాచి వచ్చుచున్నదని భ్రమించి రాళ్ళను ఆ బ్రహర్షిపైన వేసిరి. అంతట ఆ ఋషి కోపించి మీరు అజ్ఞానులై వృత్తి ధర్మములను విడిచి బలహీనులగుదురని శపించగా వారు భయపడి తమ తండ్రి వద్దకు పోయి విషయమును తెలుపగా అది విని ముక్తర్షి బాధపడి శివుని గూర్చి తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై ఏమి నీ కోరిక అని అడిగెను. అంతట ముక్తర్షి మహానుభావా! పరమేశ్వరా! నా కుమారులలో కొందరు రోమశముని శాపమునకు భయపడుచున్నారని వేడుకొనెను. అంతట పరమేశ్వరుడు ఓ మునిపుంగవా! ఆ బ్రహ్మర్షి శాపమును కాదనుట ఎవ్వరి తరమూ కాదు. కావున అనుభవింపక తప్పదు అనిచెప్పి, నీ కుమారులలో కొందరు మునిశాపము లేక పరిశుద్ధముగా నున్న వారి వలన నీ వంశము భూలోకములో అభివృద్ధి కాగలదు. అంతేగాక కణ్వ – జాబాలి, భారద్వాజ – కాశ్యప – శ్రీవత్స – ఆత్రేయ – హరిత –

**Page No.**

**5**



కౌండిన్య – అంగీరస – గౌతమ – గార్గేయ – వాశిష్ఠ – శాండిల్య – దుర్వాస – మైత్రేయ గోత్రములు గలిగి భూలోకము నందు సర్వ దేవతల రూపములను చిత్రలేఖనమను విద్యచే లోకోపకారులుగా నడచుకొనగలరు అని చెప్పి శివుడు మాయమయ్యెను. ఆ తదుపరి ముక్తర్షి కుమారులలో కొందరు వేద శాస్త్రములను చదివి నీతిమంతులుగా ఆర్యక్షత్రియ వంశమునకు ఆరాధ్యులై యెల్లవేళలా శ్రీ నిమిషాంబాదేవిని స్మరించుకొనుచు శ్రీ మహా విష్ణువునకు పీతాంబరములు, శివునికి రత్న కవచమును, బ్రహ్మకు దివ్య విమానమును తయారుచేసి ఇచ్చిరి. కావున ఈ ఆర్యక్షత్రియ చిత్రకారులకు వేదశాస్త్ర పఠనము, మూడువేళలా సంధ్యావందనములు ముఖ్యం. వీరు మహాముని గోత్ర ప్రవరసూత్ర శాఖలు కలిగి హనుమధ్వజ – గరుడధ్వజ – వృషభధ్వజ – మకరధ్వజ – సింహధ్వజ మున్నగు బిరుదులతోను, ఏనుగులు, గుర్రములు, రథములు మున్నగు వాహనములు కల్గి వుందురు. కావున ఈ ముక్త మహాముని వంశమును నిరాకరించి అపచారములు, అనాచారములు చేసిన యెడల బ్రహ్మహత్యాధి పాపములు అనుభవింతురు.

కావున ఆర్యక్షత్రియ చిత్రకారులారా! జ్ఞాన సంపన్నులారా! ఈ విజ్ఞాన శాసన పద్ధతి ప్రకారము నడచుకొనగలరు.

పైన ఉదహరించిన వంశక్రమము ***"బ్రహ్మాండ పురాణములో బ్రహ్మ నారద సంవాద రూపమైన వర్ణ వైభవ ఖండము"*** నందు నిరూపించబడినది. కావున మీరు కులాచారులై శ్రీ నిమిషాంబాదేవి కరుణా కటాక్షములను పొందుచూ బంధుజన పోషకులుగా అభివృద్ధి పొందగలరు.

శ్రీశ్రీశ్రీ నిమిషాంబాదేవియే నమః
శ్రీశ్రీశ్రీ సుశీలా సమేత సుమనస్క యోగియే నమః
శ్రీశ్రీశ్రీ సుదక్షణా సమేత ముక్త మహర్షియే నమః
శ్రీశ్రీశ్రీ మున్ముక్త మహాముని కుమారధీర ధీమంత
శ్రీమంత మహాశాంత జ్యోతిస్మంతయే నమః
సర్వేజనా సుఖినోభవంతు

*(ఆర్యక్షత్రియ చిత్రకార (చిత్తారి) సంఘం, కడప వారు 1995లో ప్రచురించిరి. ఆ పుస్తకమునుండి మన వంశ పురాణమును సేకరించడమైనది)*

-- ০ O ০ --



# మనవి...

మన ఆర్య క్షత్రియుల గురించి నాకు తెలిసిన విషయములు కొన్ని పూర్వ విశేషములు పుస్తక రూపేణా తెలుసుకొని, మరికొన్ని పెద్దలద్వారా తెలుసుకొని 1850 నుండి ఉడ్ కార్వింగ్ (చెక్కపని) రంగములో, రాతి చెక్కడము పనిలో, ఇత్తడి, రాగి మొ॥ లోహములలోనూ, చిత్రలేఖనము లోనూ మరియు యుద్ధ సామాగ్రి కత్తి, డాలు, బల్లెములు, చురకత్తులు (డాగరులు) తయారు చేసి నాటి రాజస్థానములలో, జమీందారీ దివాణములలో మన వారు వారి ఆదరణ పొందినారు. ఉదా : కృష్ణా జిల్లా, కొండపల్లి సంస్థానము – కొండపల్లి ఖిల్లా నందు కమ్మరి పనులు చేయుచూ మరి కొందరు నూజివీడు జమీందారు గారు అయిన రాజా మర్రాజు వేంకట రంగయప్పారావు గారి తరమందు నూజివీడు కోటలో సంగీత వాయిద్య పరికరములు చేయుచూ ప్రశంశలు పొంది యున్నారు. మరి కొందరు నైజాము నవాబు గారి ఆస్థానములో చిత్రకళ (పేయింటింగ్) నందు, వివిధ వృత్తులందు జీవించిరి.

మన గుంటూరు పరిపాలించు నాటి రోజులలో రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గారి ఆధీనములోనున్న 'ధరణికోట'కు వెంకటాద్రి నాయుడు గారు 'రావుబహద్దూర్' లను నియమించి పాలించిరి. అలా నరసరావుపేటకు చెందిన జమీందార్లు మన పూర్వీకులను ఆదరించి, వారి కొలువులలో మన వారికి గుర్తింపు తెచ్చిరి. తరువాత కాలములో వారి రాజ్యములు పోయి దేశమునకు స్వతంత్ర్యము వచ్చినది.

గుంటూరు జిల్లాలో ఆర్యక్షత్రియులు 'తర్లుపాడు' అను గ్రామము నుండి (నేడు ప్రకాశం జిల్లాలో కలదు) చిలకలూరిపేటవద్ద గల పురుషోత్తమ పట్నమునకు వచ్చిరి. అచటి నుండి చిలకలూరిపేటలో మరియు గుంటూరుకు వలస పోయిరి. గుంటూరులో రైలుపేటలోని ఒక వీధి 'ఆర్యక్షత్రియ వీధి' గా సంబోధించిరి.

నేను, వీరభద్ర శేషయ్యను. మా తండ్రి గారు వీరభద్ర పెద్ద శివనాగయ్య గారు (పెద్దశేషయ్య గారి కుమార్డు). వీరు కర్నూలు జిల్లా, సిరివెళ్ళి తాలూకా, రుద్రవరం గ్రామస్థులు. 1954 సం॥లో మా తల్లిదండ్రులు

**Page No. 6**



మమ్ములను గుంటూరుకు తెచ్చిరి. యకమా వెంకయ్య గారి కుమారులు వెంకటస్వామి, ఆంజనేయులు గారి కుటుంబముతో కలిసి జీవించితిమి. నేను గుంటూరులో మన బంధువుల వివరములను నాకు తెలిసినంత వరకు తెలియజేయుచున్నాను.

ఈ పుస్తకములను మా మేనమామ గారు అయిన **కీ॥శే॥ శ్రీ యకమా వెంకటస్వామి, పెద నాగలక్ష్మమ్మ గార్కి** అంకితము చేయవలయునని సంకల్పము కల్గినది. శ్రీ యకమా వెంకటస్వామి గారు గుంటూరు నగరములోనే 'సీనియర్ కార్పెంటరీ మేస్రిగా' మరియు 'సెంట్రింగ్' పద్ధతిని బొంబాయి వెళ్ళి అక్కడ తెలుసుకొని గుంటూరులో మొట్టమొదటిసారిగా ఉపయోగించి ప్రఖ్యాతి గడించారు.

శ్రీ యకమా వెంకటస్వామి, పెద్దనాగలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమారుడు, శ్రీ మగతాల హనుమంతరావు, పుష్పావతమ్మగార్ల ఐదవ అల్లుడు, నాకు బావమరిది అయిన యకమా నాగేశ్వరరావు సహకారముతో ఈ పుస్తకమును రచించినాను.

ఈ పుస్తకమును రచించుటలో మన కుల పెద్దలు కీ॥శే॥ యకమా మధుసూదనరావు గారు, నందిగం సుబ్బారావు గారు, నందిగం సూర్య ప్రకాశరావు గారు, వెల్లాల పెద్ద శేషగిరిరావు గారు, యకమా కృష్ణారావు గారు (S.C.Rly.Guard), వెల్లాల రఘురామకృష్ణయ్య గారు, పైకోట వెంకటేశ్వర్లు గారు, మా అన్నలు వీరభద్ర సాంబయ్య, వీరభద్ర శంకరయ్య గార్లు మరియు గుంటూరు నివసించిన మన కుల పెద్దల సహాకారముతో మన వంశ చరిత్ర గురించి సమాచారము తెలియజేసినారు. వారికి నా కృతజ్ఞతలు.

రాబోవు తరముల వారికి **"మనమేమిటి? మన కుల ఆచార వృత్తుల సమాచారము"** గురించి తెలియజేయుటకై ఈ పుస్తకము వ్రాయడమైనది. ఇందులో ఏమైన తప్పులున్న యెడల మలి ముద్రణలో సరిచేయగలవాడను. ఇది కేవలం నా వ్యక్తిగత సమాచారము. ఎటువంటి ఆపేక్షకు తావివ్వక ముద్రించి మన ఆర్యక్షత్రియ కుటుంబాలకు గౌరవముగా సమర్పించవలెనని నా సంకల్పము.

మమ్ములను ఈ స్థితికి తీసుకువచ్చిన మా తల్లిదండ్రులు వీరభద్ర పెద శివనాగయ్య, నారాయణమ్మ గార్లు, మా మేనమామగార్లు అయిన యకమా వెంకటస్వామి, యకమా ఆంజనేయులు గార్లు మరియు మా పెద్ద తల్లి గారు అయిన అమరావతి దాసయ్యగారి సతీమణి ఆదెమ్మ గార్కి వారి అల్లుళ్ళగు వీరభద్ర చిన శివనాగయ్య, యకమా సుబ్బరామాంజనేయులు (సుబ్బారావు) గార్లకు మరియు మన కులపెద్దల పాదపద్మములకు ఈ చిన్న జ్ఞాపిక సమర్పితము.

ఇట్లు

***వీరభద్ర శేషయ్య,*** *(S/o.) వి. పెద్ద శివనాగయ్య*
*డో.నెం. 7-14-28/ఎ, వల్లూరివారితోట, 8వ లైను,*
*డొంకరోడ్డు, గుంటూరు - 522 002.*
*సెల్ : 7732000588*



**గ్రంధకర్తలు :**
వీరభద్ర పెద శివనాగయ్యగారి తృతీయ పుత్రుడు **వీరభద్ర శేషయ్య**
యకమా వెంకటస్వామిగారి ఏకైక పుత్రిక **నాగమణి**

**Page No.**
**7**





(ఫోటో 1932) శ్రీయుతులు యకమా వెంకటస్వామి, అమరావతి దాసయ్య-ఆదెమ్మ (చిన్న నాగలక్ష్మమ్మ); యకమా వెంకయ్య-సుబ్బమ్మ, యకమా వెంకట నారాయణరావు-బాపనమ్మ (మధుసూధనరావు); వీరభద్ర పెద శివనాగయ్య-నారాయణమ్మ, నేలమీద కూర్చున్నవారు : యకమా ఆంజనేయులు, యకమా మహాలక్ష్మమ్మ, అమరావతి (యకమా) పెదనాగలక్ష్మమ్మ గార్లు



శ్రీయుతులు యకమా వెంకటస్వామి, యకమా ఆంజనేయులు, అమరావతి దాసయ్య (చిన్న నాగలక్ష్మమ్మ), యకమా వెంకయ్య, అమరావతి (యకమా) పెద నాగలక్ష్మమ్మ, యకమా సుబ్బారావు, బొంబాయి నాగభూషణం (వర్కర్), కూర్చున్నవారు : --, యకమా రంగారావు, నందిగం (యకమా) పెదకోటేశ్వరమ్మ, లక్ష్మమ్మ, పద్మావతి (పద్దులు) యకమా మహాలక్ష్మమ్మ, యకమా (మగతాల) పుష్పావతమ్మ (ఆఖరున) మొ॥వార్లు.







**యకమా వెంకయ్య – సుబ్బమ్మ గార్లు**

కుమారులు : యకమా వెంకట నారాయణ – బాపనమ్మ;
యకమా వెంకటస్వామి – నాగలక్ష్మమ్మ; యకమా ఆంజనేయులు – అనసూయమ్మ
కుమార్తెలు : చిన్ని; అమరావతి అదెమ్మ – దాసయ్య; వీరభద్ర నారాయణమ్మ – పెద్ద శివనాగయ్య



**యకమా ఫకీరయ్య – కనకరత్నమ్మ గార్లు**

కుమారులు : యకమా సుబ్బారావు-పిచ్చమ్మ, యకమా రంగారావు-తులశమ్మ,
యకమా కృష్ణమోహన్‌రావు-రాజ్యలక్ష్మి. కుమార్తెలు : సీతమ్మ-వెల్లాల రామారావు,
పెద్ద మహాలక్ష్మమ్మ-నందిగం కోటయ్య, పుష్పావతమ్మ-మగతాల హనుమంతరావు.

**Page No.**
**9**



**అమరావతి దాసయ్య – ఆదెమ్మ గార్లు**
కుమార్తెలు : పెదనాగలక్ష్మమ్మ – యకమా వెంకటస్వామి, చిననాగలక్ష్మమ్మ – వీరభద్ర చిన శివనాగయ్య,
వెంకట సుబ్బమ్మ – యకమా వెంకట సుబ్బరామాంజనేయులు (సుబ్బారావు)



**వీరభద్ర పెద శివనాగయ్య – నారాయణమ్మ గార్లు**
కుమారులు : వీరభద్ర సాంబయ్య–కామాక్షి, వీరభద్ర శంకర్రావు–పద్మావతి,
వీరభద్ర శేషయ్య–నాగమణి, వీరభద్ర నాగయ్య–శివకుమారి.
కుమార్తె : అనసూయమ్మ–యకమా ఆంజనేయులు





**యకమా వెంకట సుబ్బయ్య గారు**
కుమారుడు : యకమా దేవీ నాగ శంకరరావు–చెంచమ్మ,
కుమార్తెలు : రత్నకుమారి.



**యకమా నరసింహులు – ఈరమ్మ గార్లు**
కుమార్తెలు : రుక్మిణమ్మ – పేరూరి పాండురంగారావు; సరస్వతి – కాళహస్తి పాండురంగారావు;
సుజాత – బాబునూరి రామమూర్తి.



**యకమా వెంకట్రావు – వీరభద్రమ్మ గార్లు**

కుమారులు : యకమా ఆంజనేయులు–ఉమామహేశ్వరి, యకమా వెంకటరత్నం–శ్యామల,
యకమా ఉమామహేశ్వరరావు–మీనా. కుమార్తెలు : శశమ్మ–చిన్న సంజీవయ్య,
లక్ష్మీకుమారి–గొడుగుల మురళీవర్మ.



**యకమా పాపయ్య – మహాలక్ష్మమ్మ (ఎర్రెమ్మ) గార్లు**

కుమారులు : యకమా రామయ్య; యకమా పూర్ణచంద్రరావు–పార్వతి; యకమా హరి;
యకమా వేణుగోపాల్–లతితకుమారి. కుమార్తెలు : సీతామహాలక్ష్మి–వెల్లాల రఘురామకృష్ణయ్య,
రత్నకుమారి–మలకపాటి కోటేశ్వరరావు; నాగమణి–కేతవరపు సూర్యనారాయణ





**యకమా కృష్ణారావు – కోటేశ్వరమ్మ గార్లు**

కుమారులు : యకమా గౌరీశంకర్ – రత్నమంజరి; యకమా కోటేశ్వరరావు
కుమార్తెలు : నందిగం సీతమ్మ–కృష్ణయ్య; అద్దంకి రత్తమ్మ–రామ్మూర్తి; వెల్లాల లక్ష్మి–సుధాకర్



**యకమా సుబ్బరామాంజనేయులు (సుబ్బారావు) – సుబ్బమ్మ గార్లు**

కుమార్తె : కోటిరత్నం – చిటివేలు జనార్ధన్,
కుమారులు : యకమా వెంకట కోటేశ్వరరావు, యకమా వెంకట నాగేశ్వరరావు – ఇందిరాదేవి



**యకమా అంజయ్య – రాజమ్మ గార్లు**

కుమారులు : యకమా అప్పారావు–సుబ్బులు; యకమా వెంకట కృష్ణారావు (బుల్లెబ్బాయి)–సరస్వతి;
మురళీకృష్ణ–అనూరాధ. కుమార్తెలు : గౌరీపద్మావతి–అమరావతి కృష్ణమూర్తి; తులసీ రంగనాయకమ్మ (బుల్లెమ్మాయి)
–వెల్లాల చలపతిరావు; మహాలక్ష్మి (పాపాయమ్మ)–వెల్లాల వెంకటేశ్వర్లు; సుశీలాదేవి–పైకోటరామ్మూర్తి.



**యకమా వెంకటస్వామి – పెద నాగలక్ష్మమ్మ గార్లు**

కుమారులు : యకమా వెంకట సుబ్రమణ్యదాసు–విజయకుమారి,
యకమా నాగేశ్వరరావు–విజయలక్ష్మి. కుమార్తె : నాగమణి–వీరభద్ర శేషయ్య





**యకమా ఆంజనేయులు – అనసూయమ్మ గార్లు**

కుమారులు : యకమా వెంకట నాగేశ్వరరావు–లక్ష్మి, యకమా వెంకట నారాయణ–శివనాగమణి,
యకమా వెంకట శ్రీనివాసరావు–వాణి. కుమార్తె : పద్మావతి–వీరభద్ర శంకర్రావు



**వీరభద్ర శివనాగయ్య – చిన నాగలక్ష్మమ్మ గార్లు**

కుమార్తె : శివనాగమ్మ–అమరావతి సుబ్బారావు.
కుమారులు : వీరభద్ర శేషశాయిదాసు–అరుణ, వీరభద్ర నాగరాజు–శైలజ



**మగతాల హనుమంతరావు - పుష్పావతి గార్లు**
కుమార్తెలు : సత్యవతి-యకమా వెంకటేశ్వర్లు (రైల్వే), దుర్గాదేవి-వెల్లాల సత్యనారాయణ, శ్యామలాదేవి-పోగులగుంట్ల నాగరాజవర్మ, ఇందిరాదేవి-యకమా వెంకట నాగేశ్వరరావు, విజయలక్ష్మి-యకమా నాగేశ్వరరావు



**గొడుగుల నరసింహవర్మ - సుశీలమ్మ గార్లు (గద్వాల్)**
కుమారులు : గొడుగుల మురళీవర్మ-లక్ష్మీకుమారి, గొడుగుల మోహన్‌వర్మ-జగదాంబ, గొడుగుల నాగరాజవర్మ-లక్ష్మి, కుమార్తెలు : ప్రమీలాదేవి-కృష్ణయ్య, అలివేణి-పేరూరి గంగాధర్.



**యకమా దేవీ నాగ శంకరరావు - చెంచమ్మ గార్లు**
కుమారులు : యకమా శ్రీనివాసరావు-పద్మ, యకమా కోటేశ్వరరావు-అనిత
కుమార్తెలు : రత్నకుమారి-రఘునందన్; లక్ష్మి-టేకుమళ్ళ వెంకటేష్; పద్మ-పార్థసారధి



**యకమా వెంకట మధుసూధనరావు - సుబ్బమ్మ గార్లు**
కుమారుడు : యకమా వెంకట నారాయణరాజు-శ్యామల;
కుమార్తెలు : శివకుమారి-వీరభద్ర నాగయ్య; లక్ష్మి-సుధాకర్; పద్మావతి-వెల్లాల శ్రీనివాసరావు



**వీరభద్ర సాంబయ్య - కామాక్షమ్మ గార్లు**

కుమారుడు : వీరభద్ర సురేష్‌ఖన్నా-పార్వతి; కుమార్తెలు : శివనాగమణి-యకమా వెంకట నారాయణరావు; అమరావతి సునీత-సుబ్బారావు; రోజారాణి-చిత్తారి అమరావతి శ్రీరామచంద్రుడు.



**యకమా వెంకట సుబ్రమణ్యదాసు - విజయకుమారి గార్లు**

కుమారులు : నాగసురేష్-సుజాత; వెంకట ఫణికుమార్-బాలసుధారాణి.
కుమార్తె : అమరావతి బాలభారతి - రాజగోపాలవర్మ



**వీరభద్ర శంకరరావు - పద్మావతి గార్లు**

కుమారులు : వీరభద్ర శివమోహన్‌రావు-నిర్మలాదేవి; వీరభద్ర కిరణ్‌కుమార్-రేణుకా నాగరాణి;
కుమార్తె : రమాశాంతి-చిత్తారి మాచరౌతు రామమోహన్‌వర్మ



**యకమా వెంకట నాగేశ్వరరావు - అనంతలక్ష్మి గార్లు**

కుమారుడు : వెంకట నవీన్ కుమార్ - అర్చన
కుమార్తె : రమాదేవి - చిత్తారి మగతాల శ్రీనివాస్‌వర్మ



(1974) వీరభద్ర పెద శివనాగయ్య గారి కనిష్ఠ పుత్రుడు నాగయ్య వివాహము సందర్భముగా పెదమక్కెన గ్రామములో తీసిన ఫోటో
వరాటి నర్సయ్య, నందిగం సూరయ్య, అమరావతి వరదరాజులు, వీరభద్ర చిన శివనాగయ్య, వీరభద్ర సాంబయ్య, యకమా ఆంజనేయులు,
వెల్లాల లక్ష్మీనరసయ్య, యకమా ఆంజనేయులు, యకమా శంకరరావు. కూర్చున్నవారు : నందిగం కోటయ్య, యకమా వెంకటస్వామి,
నందిగం రామకోటయ్య, కామరౌతు చిన చెంచయ్య మొ॥వారు



శ్రీయుతులు వీరభద్ర శివనాగయ్య, యకమా వెంకటస్వామి,
యకమా ఆంజనేయులు, యకమా సుబ్బరామాంజనేయులు (సుబ్బారావు) గార్లు (1977)



గుంటూరు, డొంకరోడ్డు, వల్లూరివారితోట, 8వలైనులో సెంట్రింగ్ షెడ్డునందు
తన తమ్ముడుతో యకమా వెంకటస్వామి గారు (1984)



1993లో కాళీ గార్డెన్స్‌లో కార్తీక వనసమారాధన సందర్భముగా తీసిన ఫోటో






1971లో 'విశాఖ ఉక్కు–ఆంధ్రుల హక్కు' ఉద్యమంలో పాల్గొన్న ఆనాటి గుంటూరు సిటి
కార్పెంటరీ వర్కర్స్ యూనియన్ సంఘ నాయకులు & సభ్యులు



1976 ఆగష్టు 14వ తేదిన దేవ్ & దేవ్ మెడికల్స్ హోల్‌సేల్ మెడికల్స్
ప్రారంభోత్సవ సందర్భముగా తీసిన ఫోటో



1993లో కాశీ గార్డెన్స్‌లో కార్తీక వనసమారాధన సందర్భముగా తీసిన ఫోటో - (కూర్చున్నవారు) యకమా కృష్ణారావు, వీరభద్ర శివనాగయ్య, నందిగం సూరయ్య, యకమా సుబ్బారావు, యకమా మధుసూధనరావు, నందిగం సుబ్బయ్య, యకమా రంగారావు, నందిగం గోపాల్, యకమా పూర్ణచంద్రరావు, నామేపల్లి అశోక్, యకమా వెంకట్రామయ్య, యకమా శ్రీనివాసరావు (నిలుచున్నవారు) వీరభద్ర శేషయ్య, వెల్లాల శ్రీను, పైకోట వెంకటేశ్వర్లు, వెల్లాల వెంకటేశ్వరరావు, వీరభద్ర శంకరరావు, యకమా గౌరీశంకర్, కామరౌతు సర్వేశ్వరరావు, యకమా నారాయణరావు, వెల్లాల వెంకటేశ్వర్లు, పోగులగుంట బుజ్జి, శివనాగు, వెల్లాల శ్రీను, వీరభద్రనాగయ్య, యకమా రత్నబాబు, నామేపల్లి వెంకటేశ్వరరావు, వెల్లాల శ్రీనివాసరావు, యకమా కోటేశ్వరావు, యకమా శ్రీనివాసరావు.





1993లో కాశీ గార్డెన్స్‌లో కార్తీక వనసమారాధన సందర్భముగా తీసిన ఫోటో
కూర్చున్నవారు : శ్రీయుతులు వీరభద్ర శంకర్రావు, వీరభద్ర శివనాగయ్య, నందిగం సూరయ్య, యకమా సుబ్బారావు, యకమా మధుసూధనరావు, నందిగం సుబ్బయ్య గార్లు. నిల్చునవారు : శ్రీయుతులు కామరుషి సర్వేశ్వరావు, వెల్లాల వెంకటేశ్వర్లు, వెల్లాల శేషగిరిరావు, వీరభద్ర నాగయ్య, యకమా రత్నబాబు, వెల్లాల శ్రీనివాసరావు, వెల్లాల వెంకటేశ్వరరావు, యకమా కోటేశ్వరరావు గార్లు



ఆళ్ళగడ్డ మునిస్వామి గారు గుంటూరు – వీరభద్ర శంకర్రావుగారి ఇంటికి విచ్చేసిన సందర్భముగా (1995–96 నాటి ఫోటో)

**Page No.**
**17**



# బొమ్మల 'గురువు'

22-9-14
Eenadu



చిత్తారి మాచరౌతు సుబ్రమణ్యం వర్మ

- దేవతా మూర్తుల వాహనాల తయారీలో దిట్ట
- ఉత్తమ ఉపాధ్యాయుడిగా పురస్కారం
- విశ్రాంత జీవితంలోనూ కళపై తీరని మక్కువ
- ఆదర్శం సుబ్రహ్మణ్యం శర్మ

**1969**లో బేతంచర్ల శేషారెడ్డి ఉన్నత పాఠశాలలో ఎస్జీటీఉపాధ్యాయుడిగా ఉద్యోగ ప్రస్థానాన్ని ప్రారంభించారు. బొమ్మలు గీయడం, తయారు చేయడమంటే అమితాసక్తి. చిత్రకారుడిగా రాణించడానికి డ్రాయింగ్‌లో లోయర్, హైయర్‌లో ఉత్తీర్ణత సాధించారు. 1970 డిసెంబరు 30న నందికొట్కూరు ఉన్నత పాఠశాలకు డ్రాయింగ్ మాస్టారుగా నియమితులయ్యారు. స్నేహితుల ప్రోత్సాహంతో పీయూసీ,బీఏ, బీఈడీ పూర్తి చేశారు.

### ప్రవృత్తికి ప్రేరణ

బనగానపల్లె నవాబు సంస్థానంలో చిత్రకారుడిగా పని చేస్తూ చిత్రశాలను స్థాపించిన వెంకటసుబ్బయ్య వర్మ కుమారుడు సుబ్బరాయుడు సుబ్రహ్మణ్యం వర్మకు స్వయాన మేనమామ. ఆయన డ్రాయింగ్ మాస్టారుగా ఉంటూ ఆలయాలకు అందమైన బొమ్మలు తయారు చేసే వారు. ఆ సమయంలో సుబ్రహ్మణ్యం శర్మ చేదోడు వాదోడుగా ఉండేవారు. చిత్రలేఖనంలోని మెలకువలు నేర్చుకొన్నారు. ఆయన ప్రేరణతో చిత్రకారుడిగా రాణించారు.

పేరుసోములలో చెన్నకేశవ ఆలయంలో ఏర్పాటు చేసిన దేవతా మూర్తుల వాహనాలు

విద్యాబోధన చేస్తూనే అబ్బిన కళలో రాణించారు. వీలైనప్పుడల్లా అద్భుతమైన బొమ్మలు చెక్కుతూ అందరి చేత ప్రశంసలు అందుకున్నారు. అమరజీవి జెక్కన్నను మరిపించారు. అతనే సంజామల మండలం నొస్సం గ్రామానికి చెందిన చిత్తారి మాచరౌతు సుబ్రహ్మణ్యం వర్మ. మేనమామ సుబ్బరాయుడు వర్మ చిత్రలేఖనం ఉపాధ్యాయుడిగా(డ్రాయింగ్ మాస్టారు) పని చేశారు. అతని నుంచి నేర్చుకున్న మెలకువలతో తన కళకు మరింత పదును పెట్టి ప్రత్యేకతను చాటుకున్నారు.
–న్యూస్‌టుడే, నొస్సం(ఉయ్యాలవాడ)

### ప్రతిభకు ఇవే కొలమానాలు

● 1974 నుంచి దేవతామూర్తుల బొమ్మలు వేయడం ప్రారంభించారు. లద్దగిరి ఉన్నత పాఠశాలలో చిత్రలేఖనం ఉపాధ్యాయుడిగా కొనసాగుతూ సొంత ఖర్చులతో విద్యార్థులకు బోధనా అంశాలకు దోహదపడే బొమ్మలను గోడలపై వేశారు. లద్దగిరిలో శ్రీకృష్ణ, రామదాసు ఆలయాల విగ్రహాలకు రంగులు వేసి ప్రత్యేక అందాన్ని తీసుకొచ్చారు.

● 1975 నుంచి 1987 వరకు గోరంట్ల, గోకులపాడు, వెంకటగిరి, కృష్ణదొడ్డి, కనుమాడ, మరుకలచెరువు, పేరుసోముల గ్రామాల్లోని మాధవస్వామి, వెంకటేశ్వర స్వామి, ఆంజనేయస్వామి, సీతారాముల ఆలయాల్లోని దేవతా మూర్తులకు వాహనాలను తయారు చేశారు. వీటిలో శేషవాహనం , నరసింహ, హంస, అశ్వవాహనంవంటివి తయారు చేసి ఆలయాలకు అందజేశారు.

● 1998లో కానాల ఉన్నత పాఠశాలలో సాంఘికశాస్త్ర ఉపాధ్యాయుడిగా కొనసాగుతున్న సమయంలో జిల్లా ఉత్తమ ఉపాధ్యాయుడిగా ఎంపికయ్యారు. అప్పటి జడ్పీ ఛైర్మెన్ పీపీ నాగిరెడ్డి చేతుల మీదుగా పురస్కారం అందుకున్నారు.



ఉత్తమ ఉపాధ్యాయుడిగా పురస్కారం అందుకుంటూ..

### ప్రతి ఫలాన్ని ఆశించలేదు

**– సుబ్రహ్మణ్యం శర్మ, విశ్రాంత ఉపాధ్యాయుడు**



ఉపాధ్యాయుడిగా కొనసాగుతున్న సమయంలో వీలు దొరికనప్పుడల్లా దేవతామూర్తులకు వాహనాలు తయారు చేసేవాణ్ని. ప్రధానంగా సెలవుల్లో ప్రవృత్తికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చా. ఆరోజుల్లో ఆరు అడుగుల విగ్రహం తయారు చేయడానికి రూ.500 ఖర్చు అయ్యేది. ఇప్పట్లో అయితే రూ.10 వేల ఖర్చు అవుతుంది. ఎలాంటి ప్రతిఫలాన్ని ఆశించకుండా బొమ్మలను తయారు చేసి అలంకరించేవాడిని. ఆ సేవలను ప్రజలు గుర్తించి ప్రశంసించేవారు. అదే నాకు ఆత్మతృప్తిని మిగిల్చింది.

–న్యూస్‌టుడే, కర్నూలు గ్రామీణ



గుంటూరులో కార్పెంటరీ వర్కర్స్ యూనియన్‌కు భవనము ఏర్పాటుచేసి
ప్రారంభోత్సవము చేస్తున్న
**గౌరవ అధ్యక్షులు శ్రీ వీరభద్ర శంకర్రావు గారు**



18వ శతాబ్దానికి చెందిన **నందిగం నాగేశం & కామరౌతు వెంకటేశం** అను గొప్ప చిత్రకారులు వేసిన పురాణ గాధల లెదర్ పేయింటింగ్ పుస్తకము నందలి చిత్రం. వీరి పేయింటింగ్స్ ఫ్రెంచి చక్రవర్తి 16వ లూయీ కుమార్తెకు బహుమతిగా భారతదేశం నుండి ఫ్రాన్స్ చేరి, ఫ్రెంచి రివల్యూషన్ తరువాత జర్మనీలోని హంబర్గ్ మ్యూజియంనకు చేరినది.

*(ఇంటర్నెట్‌ద్వారా విషయ సేకరణ)*





**నూజివీడు వాస్తవ్యులు శ్రీ వరాటి వెంకట నరసయ్య గారు.**
వీరు బొబ్బిలి వీణలు తయారు చేయుటలో నేర్పరులు. ఏనుగు దంతములతో వివిధ కళాకృతులు చేసి నూజివీడు జమీందారులను మెప్పించిన ఘనులు.





**గంజీఫా ప్లేయింగ్ కార్డ్స్**

# ప్రస్థానం :

**ఆంధ్రప్రదేశ్, గుంటూరు పట్టణ ఆర్యక్షత్రియ సూర్యవంశ రాజుల కుల వర్గ విశేషాంశములు :**

ఆర్యా, మన సూర్య వంశ రాజుల (సోమ వంశీయులని కూడా వ్యవహరించెదరు) ఆరాధ్య దేవత **"శ్రీ నిమిషాంబాదేవి అమ్మవారు".** మొదటి నుండి ఈమెను మన కులదేవతగా పూజించు చున్నారు. నేడు ఈ అమ్మవారి ఆలయములు ఆంధ్రదేశములో హైదరాబాద్, కర్నూలు, నంద్యాల, కడప, విజయవాడ, ఏలూరు, ఖమ్మం నందునూ, కర్ణాటక రాష్ట్రము నందు బెంగుళూరు, బళ్ళారి మరియు శ్రీరంగపట్టణమునకు మూడు కిలోమీటర్ల దూరమున గల **"గంజాం"** అను పల్లెలో తుంగభద్ర నదీపాయ ఒడ్డున ఈ అమ్మవారు వెలసినది. ఈ ఆలయమునకు నిత్యము వేలాది భక్తులతో, పూజలతో అలరారుచున్నది. భక్తుల కోర్కెలు నెరవేర్చుకుంటున్న మన ఇలవేల్పుగా ప్రసిద్ధి గాంచినది. ముందుగా ఆంధ్ర రాష్ట్రములో విశేష ప్రఖ్యాతిగాంచిన గుంటూరు పట్టణములో మన సూర్య వంశస్థులు గత 100 సం॥ల క్రితము నుండి మన కులస్తులను వివిధ పేర్లతో **ఆర్య క్షత్రియులు, జీనిగర్** (జీనిగర్ అనగా మహారాష్ట్ర భాష మరాఠీలో చిత్రమైన పనిచేయువారు అని అర్థము) సంబోధించు చున్నారు. వీరు పూనా నుండి కర్ణాటక రాష్ట్రము మీదుగా వలసవచ్చి కాలక్రమేణ ఆంధ్రదేశములో ప్రవేశించిరి. వీరిని బొమ్మలవారు అని కూడి కొన్ని ప్రాంతములలో పిలిచెడివారు. వీరు చిత్రలేఖనము లోనూ, వడ్రంగి నగిషీపని, దేవుని వాహనములు, బంగారు ఆభరణముల తయారీలోనూ మరియు ఇత్తడితో, వెండితో దేవతామూర్తులను తయారుచేసి ప్రసిద్ధి గాంచిరి.

మొదటగా వీరు పూర్వపు గుంటూరు జిల్లా యందుగల 1840–50 ప్రాంతములలో "తర్లుపాడు" అను గ్రామములో (నేడు ప్రకాశం జిల్లాలో కలదు) నివసించి క్రమేణా వీరు తమ కులవృత్తులను జీవనాధారం చేసుకొని తర్లుపాడు రంగనాధస్వామి ఆలయంలో రథములు, వాహనములు; మార్కాపురం నందుగల చెన్నకేశవ దేవస్థానము మరియు మాచర్ల చెన్నకేశవస్వామి దేవస్థానముల రాజగోపురమును నిర్మించి పేరు గాంచిరి. తదుపరి గుంటూరు జిల్లాలో, చిలకలూరిపేట వద్దగల పురుషోత్తమ పట్టణమునకు వలస వచ్చిరి. అక్కడ కొంత కాలము నివసించి చిలకలూరిపేట యందు స్థిరపడిరి. చదలవాడ గ్రామము



నందలి రంగనాయకస్వామి ఆలయము, దుర్గి, కారంపూడి గ్రామములలోని దేవాలయములందు దేవతా విగ్రహములను తయారుచేసిరి. తరువాత కర్నూలుజిల్లాలో ఆర్లగడ్డ తాలూకా, అహోబిళం నరసింహస్వామి దేవస్థానములో చెక్కతో సొరకాయలు, గుమ్మడికాయలు, బుర్రలు అలంకారమునకు, రాతి దేవతా విగ్రహములు, ఇత్తడితో గాలిగోపురపు కలిశములు, ధ్వజస్థంభములు, మకర తోరణములు తయారు చేసేవారు.

గత 100 సంవత్సరముల నుండి గుంటూరు, రైలుపేట నందు (సరస్వతీ పిక్చర్ ప్యాలెస్ ఎదురు సందు) ఒక వీధిని 'ఆర్యక్షత్రియవీధి' అని పేరుపెట్టబడెను. ఒకప్పుడు ఈ వీధిలో 20 కుటుంబాలకు పైగా వివిధ చేతివృత్తులు, చెక్కుడు పనులు, దేవతా విగ్రహాల పనులు, బొమ్మలు, చెక్కలో శిల్పములను మలచుట వాటికి అందముగా రంగులు వేయుట మొదలుగు పనులు చేసిరి. ఆ రోజులలో చాలా ప్రఖ్యాతి గాంచిరి. తరువాత కాలములో గృహ నిర్మాణ పనులలో కార్పెంటరీ పని చేసెడివారు.

నాటి వారిలో ప్రధములు, యకమావారు, వెల్లాలవారు, వీరభద్రవారు, నందిగంవారు, పైకోటవారు, వ్యాసరౌతువారు, అమరావతివారు, పాణ్యంవారు, కామరుషివారు, ఉద్దంటివారు, కాళహస్తివారు, కనిగిరివారు, నామేపల్లివారు, మాచర్ల వారు, వరాటి వారు, కామరౌతువారు, కామరాజువారు మొ॥వారు.

నాటి కాలములో వలస వచ్చిన వారిలో ప్రధములు "యకమా" అను ఇంటి పేరు గలవారు. **వారిలో ప్రధములు యకమా వెంకటస్వామి, వారి సతీమణి సీతామహాలక్ష్మమ్మ గార్లు.** (వీరి సోదరులు యకమా వెంకట అప్పయ్యగారు, యకమా వెంకటస్వామి, యకమా ఫకీర్ నాయకుడు. వీరిలో యకమా వెంకటస్వామి గారికే వివాహము జరిగినది.) వీరే గుంటూరులో ఆర్యక్షత్రియ వంశ స్థాపకులు. వీరి నల్గురు కుమారులు వెంకటప్పయ్య, కోటయ్య, వెంకటయ్య, ఫకీరయ్య. ఒక కుమార్తె మంగమ్మ.

**(1) యకమా వెంకటప్పయ్య గారు వీరి ధర్మపత్ని భూశమ్మ గారు.** వారి కుమారులు యకమా వెంకట్రామయ్య–సీతారావమ్మ, యకమా వరదయ్య–సుబ్బమ్మ, యకమా అంజయ్య–రాజమ్మ, యకమా రాఘవయ్య–నరసమ్మ.

**(2) యకమా కోటయ్య గారు వీరి ధర్మపత్ని రత్నమ్మ గారు.** వారి కుమారులు యకమా వెంకట సుబ్బయ్య–సుబ్బమ్మ, యకమా నరసింహం–వీరమ్మ,

యకమా వెంకట్రావు–వీరభద్రమ్మ, యకమా పాపయ్య–ఎర్రెమ్మ, యకమా కృష్ణారావు–పెద్దకోటేశ్వరమ్మ, యకమా సుబ్బారావు–వెంకట సుబ్బమ్మ. కుమార్తెలు : కోటమ్మ–నందిగం రోశయ్య, చిన్నమహాలక్ష్మమ్మ–నందిగం రామకోటయ్య.

**(3) యకమా వెంకయ్య గారు వీరి ధర్మపత్ని సుబ్బమ్మ గారు.** వారి కుమారులు యకమా నారాయణరావు–బాపనమ్మ, యకమా వెంకటస్వామి–పెదనాగలక్ష్మమ్మ, యకమా ఆంజనేయులు–అనసూయమ్మ, కుమార్తెలు : ఆదెమ్మ–అమరావతి దాసయ్య, నారాయణమ్మ–వీరభద్ర పెద్ద శివనాగయ్య, మహాలక్ష్మమ్మ – వెల్లాల రామారావు.

**(4) యకమా ఫకీరయ్య గారు వీరి ధర్మపత్ని కనకరత్నమ్మ గారు.** వారి కుమారులు యకమా సుబ్బారావు–పిచ్చమ్మ, యకమా రంగారావు–తులశమ్మ, యకమా కృష్ణమోహన్‌రావు–రాజ్యలక్ష్మి. కుమార్తెలు : సీతమ్మ–వెల్లాల శ్రీరాములు, పెద్ద మహాలక్ష్మమ్మ–నందిగం కోటయ్య, పుష్పావతమ్మ–మగతాల హనుమంతరావు.

వీరు చిలకలూరిపేటకు దగ్గరలో పురుషోత్తమపట్టణము నుండి గుంటూరుకు సుమారు 1925–30 ప్రాంతములో వలస వచ్చారు.

పై వారిలో యకమా కోటయ్య గారు వారి ధర్మపత్ని రత్నమ్మ గారు వారి కుమారులైన యకమా సుబ్బయ్య గారు, యకమా నరసింహం గారు, యకమా వెంకట్రావు గారు, యకమా పాపయ్య గారు, యకమా కృష్ణారావు గారు, యకమా సుబ్బారావు గారు చిలకలూరిపేటలో స్థిరనివాసమేర్పరచుకొనిరి.

తదుపరి యకమా వెంకటప్పయ్య గారు, యకమా వెంకయ్య గారు, యకమా ఫకీరయ్యగారు గుంటూరులో రైలుపేట, 1వ లైనులో (నేడు సరస్వతి థియేటర్ ఎదురు లైను) అర్యక్షత్రియ వీధి అను పేరుతో ఇండ్ల స్థలములు కొని, గృహములు నిర్మించుకొని స్థిరపడ్డారు. నేటికి (2015) వీరి మనుమలు అక్కడనే ఉన్నారు.

తదుపరి గుంటూరులో వీరు వృత్తిరీత్యా రాతి విగ్రహములు, ఇత్తడి విగ్రహములు చెక్క విగ్రహములు, కావిడిపెట్టెలు, బొమ్మల పెట్టెలు తయారుచేయుచూ క్రమేణా చింతపిక్కెలు నీటి యందు నానబెట్టి దానిలో రంపపుపొట్టు, తుమ్మ జిగురు, పేడను మిళితముచేసి పాత గుడ్డ ముక్కలతో అతికించి బుట్ట బొమ్మలు, బొల్లి ఆవు బొమ్మలు మొదలుగునవి తయారుచేసెడివారు. తిరునాళ్ళు, ఉత్సవ సమయములందు వీరు చేసిన బొమ్మలతో నాటి రోజులలో దేవాలయముల దగ్గర, ఊరి పొలిమేర్ల వద్ద గల పోలేరమ్మ గుడి ప్రాంగణములందు ఊరి ప్రజలంతా కలసి జాతర, ఊరేగింపులు, కొలుపులు జరిపేడివారట.

**Page No. 20**



ఆ సమయములో వీరు తయారు చేసిన బుట్ట బొమ్మలు (ఆంజనేయస్వామి, గరుత్మంతుడు) అలంకరించి మేళ తాళములతో డప్పు వాయిద్యములతో, కోలాటములు చేయుచూ ఊరేగింపుగా కాగడా దీపపు వెలుగులలో ఈ తిరునాళ్ళు కొలుపులు జరిగెడివట. ఆలయ ధర్మకర్తలు, జమీందారులు వీటిని ఎక్కువగా ప్రోత్సహించెడివారు. వారిలో ముఖ్యులు మన నరసరావుపేట జమీందారు గారు. వీరు మన కళలను చాలా ఇష్టపడి గౌరవించి సన్మానించెడివారు.

**(1) యకమా వెంకటప్పయ్య గారు వీరి ధర్మపత్ని భూశమ్మ గారు :** వీరికి నలుగురు సంతానము. మొదటి వారు **యకమా వెంకట్రామయ్య, వీరి ధర్మపత్ని సీతారావమ్మ.** వీరికి ఒక మగ సంతానము. పేరు యకమా కోటేశ్వరరావు. ఐదుగురు ఆడ సంతానము. అతి పెద్ద కుటుంబము. వీరంతా కులవృత్తియైన బొమ్మల పనులు, దేవుని వాహనములు చేసే మగవారికి ఆడవారు కూడా తమ వంతు సహకారమును అందించుచూ రైలుపేట, ఆర్యక్షత్రియ వీధిలో నివసించెడివారు. యకమా కోటేశ్వరరావు గారు. వీరు సంగీత వాయిద్య నిపుణులు. సంగీత వాయిద్యములైన హార్మోనియం, ఫిడేలు, మృదంగములు, డోలక్‌లు తయారు చేసెడివారు. గుంటూరు, కొత్తపేట ఆంజనేయస్వామి గుడి వద్ద (నాజ్ సెంటర్) నందు స్వంతముగా వ్యాపారము నిర్వహించెడివారు. సంగీత వాయిద్యములను చక్కగా రిపేరు చేసెడివారు. వీరు గుంటూరు, సాంబశివపేటకు చెందిన నందిగం కోటయ్య గారి ద్వితీయ కుమార్తె పార్వతమ్మతో వివాహము జరిగినది. వీరికి ముగ్గురు మగ, ఇద్దరు ఆడ సంతానము. మధ్య వయస్సు నందే వీరి భార్య కాలం చేశారు. తదుపరి వీరి సంతానమును యకమా సీతారావమ్మగారు, పాణ్యం రంగనాయకమ్మ వారి సోదరీమణులు వీరిని పెంచి పెద్ద చేశారు.

వీరి సంతానములో ప్రథముడైన యకమా నాగరాజు గారు తన తండ్రి గారివద్ద, తన మేనత్త మహాలక్ష్మమ్మగారి కుమారుడు లక్ష్మీప్రసన్న కోటేశ్వరరావు గారి వద్ద సంగీత పరికరములు తయారుచేసెడివారు. వాటిని రిపేరుకూడా చేసెడివారు. వీరు తమ మేనత్త మామగారు అయిన వెంకటలక్ష్మమ్మ, వెల్లాల సుబ్రమణ్యంగారి మూడవ కుమార్తె లీలావతితో వివాహము జరిగినది. వీరికి ఫణీంద్రకుమార్, పార్వతి అను సంతానము కలరు. ఫణీంద్రకుమార్‌కు నందిగం దత్తు గారి కుమార్తె లావణ్యతో వివాహము. వీరికి ఒక కుమారుడు కార్తీక్. **(ప్రస్తుతం కార్తీక్‌తో 7వ తరం నడుస్తోంది)** యకమా నాగరాజు, లీల ఏకైక కుమార్తె పార్వతికి వీరభద్ర సాంబయ్య, కామాక్షమ్మ గార్ల ఏకైక కుమారుడు వీరభద్ర సురేష్ ఖన్నాతో

వివాహము. వీరికి ఒక కుమారుడు సాయితేజ. కుమార్తె మానస శ్రీజ. యకమా నాగరాజు గారు రైలుపేట, ఆర్యక్షత్రియవీధిలో స్థిర నివాసము.

ద్వితీయ కుమారుడైన యకమా పండరీనాథ్. వీరు స్టేట్ బ్యాంక్‌లో క్లర్క్‌గా ఉద్యోగం చేయుచున్నారు. వెల్లాల లక్ష్మీప్రసన్న కోటేశ్వరరావు గారి రెండవ కుమార్తె పేరు పద్మావతితో పండరీనాథ్ వివాహము జరిగినది. వీరికి ఒక కుమారుడు సాయి, కుమార్తె త్రివేణి కలరు. వీరు వెంగళరావు నగర్, ఎక్స్‌టెన్షన్‌లో నివసించుచున్నారు.

తృతీయ కుమారుడైన యకమా సుబ్రమణ్యం. వీరు తమ తండ్రి వలె వాయిద్య పరికరములు మరియు ఫోటోఫ్రేమ్స్ కళాత్మకముగా అద్దాల డిజైన్లతో ఆకర్షణీయముగా తయారు చేయుటలో మెళకువ గలవారు. నాజ్ సెంటర్‌లో వీరి స్వంత దుకాణము కలదు. వీరు నూజివీడుకు చెందిన నామేపల్లి చినరామారావు గారి కుమార్తె సావిత్రితో వివాహము జరిగినది. వీరికి ఇద్దరు కుమార్తెలు కలరు. వీరు కాకుమానువారితోట యందు స్థిర నివాసము.

యకమా కోటేశ్వరరావు గారి ప్రథమ కుమార్తె నాగమణి. ఈమెను తన బావమరిదియైన నందిగం రాధాకృష్ణ గారితో వివాహము. వీరు గుంటూరు, సాంబశివపేట నందు నివాసము. వీరు మెడికల్ వ్యాపారములో ఉన్నారు. వీరికి ఒక్కరే మగ సంతానము పేరు నందిగం వినయ్ కుమార్.

ద్వితీయ కుమార్తె దేవమణి. ఈమెను శ్రీనగర్‌కు చెందిన వెల్లాల లక్ష్మీనరసయ్యగారు, సత్యనారాయణమ్మ గార్ల ప్రథమ పుత్రుడు వెంకటేశ్వరరావుతో వివాహము. వీరికి ఇరువురు కుమార్తెలు విజయలక్ష్మి, లక్ష్మీకుమారి.

వీరి ప్రథమ కుమార్తె విజయలక్ష్మిని గుంటూరు వల్లూరివారితోట నివాసియైన కామరుషి అప్పారావు, మీనాదేవి గార్ల రెండవ కుమారుడు హరితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

📚 యకమా కోటేశ్వరరావు గారి ఐదుగురు సోదరీమణులు **మహాలక్ష్మమ్మ, మీనాక్షమ్మ, పాండురంగనాయకమ్మ, భ్రమరాంబ, వెంకటలక్ష్మమ్మ.**

**వీరిలో ప్రథములైన మహాలక్ష్మమ్మ గారిని నెల్లూరు జిల్లా, కావలికి చెందిన వెల్లాల లక్ష్మయ్య గారితో వివాహము.** వీరు దేవాలయములకు సంబంధించి గాలిగోపురములు, చెక్కతో దేవుని రథములు, పంచలోహాలతో దేవతామూర్తుల విగ్రహ మూర్తులను చేయుటలో నేర్పరులు. వీరికి ఐదుగురు కుమారులు. ఇరువురు కుమార్తెలు.

**Page No. 21**



యకమా కోటేశ్వరరావు గారి ద్వితీయ సోదరి **మీనాక్షమ్మగారికి నెల్లూరు జిల్లా కావలికి చెందిన వెల్లాల నరసింహారావు గారితో వివాహము.** వీరు దేవతా మూర్తుల విగ్రహములు, గాలిగోపుర నిర్మాణములు, సిమెంట్ విగ్రహములు చేయుట యందు సిద్ధహస్తులు. వీరికి ఇరువురు కుమారులు వెల్లాల చిన్నశేషగిరిరావు గారు, వీరు ప్రైవేట్ నర్సింగ్ హోం నందు పనిచేసి, కావలి నందు నివాసము. వీరు కురిచేడుకు చెందిన మాచర్ల వారి అమ్మాయితో వివాహము.

రెండవ కుమారుడు వెల్లాల చెంచురామయ్య గారు. వీరు పంచాయితీ రాజ్ డిపార్ట్‌మెంట్ నందు పనిచేసి రిటైర్ అయ్యి కావలి యందు నివాసము.

యకమా కోటేశ్వరరావు గారి తృతీయ సోదరి **పాండురంగ నాయకమ్మ. వీరు పాణ్యం చంద్రశేఖరరావు గారితో వివాహము.** వివాహమైన కొలది కాలమునకే చంద్రశేఖరరావు గారు కాలం చేశారు.

**యకమా కోటేశ్వరరావు గారి నాల్గవ సోదరి భ్రమరాంబ.** ఈమె పుట్టకతోనే మూగది. వివాహము లేదు. అన్నగారి వద్దనే జీవితము సాగించినది.

యకమా కోటేశ్వరరావు గారి ఐదవ సోదరి **వెంకటలక్ష్మమ్మ గారు. వీరికి నెల్లూరుకు చెందిన వెల్లాల సుబ్రమణ్యంగారితో వివాహము.** తదుపరి గుంటూరు లోనే కొత్తపేట యందు కిరాణా వ్యాపారము నిర్వర్తించిరి. వీరికి ముగ్గురు కుమార్తెలు. వీరి మొదటి కుమార్తె రాజకుమారి. వీరు హైదరాబాద్‌కు చెందిన లక్ష్మినారాయణ గారితో వివాహము. వీరికి ముగ్గురు కుమార్తెలు.

వెల్లాల సుబ్రమణ్యం, వెంకట లక్ష్మమ్మగార్ల ద్వితీయ కుమార్తె మీనాదేవి. వీరు గుంటూరుకు చెందిన కామరుషి అప్పారావు గారితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు.

వెల్లాల సుబ్రమణ్యం, వెంకట లక్ష్మమ్మగార్ల తృతీయ కుమార్తె లీలావతి. ఈమెను గుంటూరు రైలుపేటకు చెందిన యకమా నాగరాజు గారితో వివాహము. వీరికి కుమారుడు, కుమార్తె కలరు.

📚 **(1) యకమా వెంకటప్పయ్య గారు వీరి ధర్మపత్ని భూశమ్మ గార్ల ద్వితీయ కుమారుడు యకమా వదరదయ్య గారు :** వీరు పాణ్యం రామకోటయ్య గారి సోదరి సుబ్బమ్మగారితో వివాహము. వీరు గుంటూరులో ఎలిమెంటరీ స్కూల్ టీచరుగా పనిచేసియున్నారు. గుంటూరు నాయుడుపేట, 2వ లైనులో వీరి స్థిర నివాసము. వీరికి ముగ్గురు కుమారులు. ముగ్గురు కుమార్తెలు.

ప్రథమ కుమారుడైన యకమా కృష్ణారావు గారు నెల్లూరుకు చెందిన కాళ్ళహస్తి గురవయ్య గారి కుమార్తె లక్ష్మీనరసమ్మతో వివాహము. వీరికి ఒక్కడే కుమారుడు. చిన్న వయస్సు నందే మరణించినాడు. వీరు వడ్రంగి పని యందు నేర్పరులు.

యకమా వరదయ్యగారి ద్వితీయ కుమారుడు యకమా సాంబయ్య. వీరు వడ్రంగం పని చేయుచూ నాయుడుపేట యందే నివాసము. నెల్లూరుకు చెందినవీరు కూడా కాళహస్తి గురవయ్యగారి కుమార్తె ఆదెమ్మ గారితో వివాహము. వీరు గుంటూరు నందే ప్రముఖ వడ్రంగి మేస్త్రిగా కీర్తి గాంచిరి. వీరికి ఇరువురు కుమారులు. ఇరువురు కుమార్తెలు.

ప్రథమ కుమారుడు యకమా మురళి. నెల్లూరుకి చెందిన వెంకటగిరి వారి అమ్మాయితో వివాహము.

రెండవ కుమారుడు సత్యనారాయణ. వీరు నెల్లూరుకి చెందిన కామేశ్వరి గారితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు. మణికుమార్, శివకుమార్. మణికుమార్ నెల్లూరుకు చెందిన హారికతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు. రెండవ కుమారుడు శివకుమార్. గుంటూరుకు చెందిన కాళహస్తి సురేష్‌గారి రెండవ కుమార్తె ఉమామహేశ్వరితో వివాహము. వీరికి ఒక కుమారుడు సోహన్. **(7వ తరం)**

యకమా సాంబయ్య గారి ప్రథమ పుత్రిక రాజ్యం. ఈమెను సాంబయ్యగారి తన స్వంత బావమరిదితో వివాహము.

యకమా సాంబయ్య గారి రెండవ కుమార్తె సరళాదేవి. ఈమెను నూజీవీడుకు చెందిన కాళహస్తి నాగేశ్వరరావు గారితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు.

యకమా వరదయ్య గారి తృతీయ కుమారుడు పూర్ణచంద్రరావు గారు. వీరు తమ అక్కా బావగారైన కాళహస్తి ఆదెయ్య–విశాలక్షమ్మగార్ల ప్రథమ కుమార్తె వెంకటలక్ష్మితో వివాహము. వీరికి ఇరువురు కుమార్తెలు. ఒక కుమారుడు. వీరు బెంగుళూరుకు చెందిన అగరువత్తుల వ్యాపార సంస్థకు మార్కెటింగ్ ఏజెంట్‌గా చేస్తున్నారు. వీరి కుమారుడు మహేష్. హైదరాబాద్ నందు ప్రైవేట్‌గా జాబ్ చేయుచున్నారు.

**యకమా వరదయ్యగారి ప్రథమ కుమార్తె విశాలాక్షమ్మ గారు. వీరు కురిచేడు గ్రామమునకు చెందిన కాళహస్తి ఆదెయ్య గారితో వివాహము.** వీరు

Page No.
22



గుంటూరు, ప్రకాశం జిల్లాల యందు పలు దేవస్థానములకు గాలిగోపురములు, సిమెంట్ విగ్రహములు, మకర తోరణములు నిర్మాణములు చేసి ప్రసిద్ధి గాంచిరి వీరికి ముగ్గురు కుమారులు. నలుగురు కుమార్తెలు.

**మొదటి కుమారుడు కాళహస్తి శివ వెంకట దుర్గా ప్రసాద్ గారు.** వీరు గుంటూరు జిల్లాలో హైస్కూల్ టీచర్‌గా ఉద్యోగము చేయుచున్నాము. వీరు రాష్ట్ర ఉపాధ్యాయ సంఘములో కీలకమైన బాధ్యతలు నిర్వహిస్తున్నారు. వీరు గుంటూరుకు చెందిన కనిగిరి అప్పయ్య గారి మొదటి కుమార్తె లక్ష్మీ సౌభాగ్యవల్లితో వివాహము. వీరు గుంటూరు, నగరాలు నందు నివాసము. వీరు సిండికేట్ బ్యాంక్, బ్రాడీపేట నందు ఆఫీసర్‌గా పనిచేయుచున్నారు. వీరు ఇరువురు మగ సంతానము. ఒక కుమార్తె. వీరి ప్రథమ కుమారుడు కాళహస్తి సునీల్. వీరు శిరికొండవారి అమ్మాయి జ్యోతి సంయుక్తతో వివాహము. వీరు హైదరాబాద్ నందు కంప్యూటర్ ఇంజనీర్‌గా జాబ్ చేయుచున్నాడు. రెండవ కుమారుడు కిరణ్ కుమార్. కంప్యూటర్ ఇంజనీర్‌గా అమెరికాలో పనిచేసి చిన్న వయస్సునందే మరణించారు. దుర్గా ప్రసాద్ గారి ఏకైక పుత్రిక శిరీషను కర్నూలు నివాసి మాచరౌతు వంశీకృష్ణ వర్మతో వివాహము. వీరు ఢిల్లీలో కంప్యూటర్ ఇంజనీరుగా ఉద్యోగము చేయుచున్నారు.

కాళహస్తి ఆదెయ్య గారి రెండవ కుమారుడు శ్రీనివాసరావు. మచిలీ పట్నంకు చెందిన నామేపల్లి వారి అమ్మాయి దుర్గతో వివాహము. వీరికి ఇరువురు కుమారులు. మచిలీపట్నం (బందరు) నందే వీరి స్థిర నివాసము.

కాళహస్తి ఆదెయ్య గారి మూడవ కుమారుడు సురేష్ కుమార్. వీరు నందిగం వారి అమ్మాయి శ్రీదేవితో వివాహము. వీరు గుంటూరు, కొరిటెపాడు నందే స్థిర నివాసము. వీరు కార్పెంటరీ వర్క్స్ చేయుచున్నారు. వీరికి ఇరువురు కుమార్తెలు. పెద్ద కుమార్తె శైలజను నూజివీడుకు చెందిన వరాటి ఆంజనేయులు, రాజ్యలక్ష్మి (రాజ్యం) గారి కుమారుడు బాలాజీతో వివాహము. వీరు హైదరాబాద్ నందు నివాసము. చిన్న కుమార్తె ఉమామహేశ్వరిని గుంటూరుకు చెందిన యకమా సత్యనారాయణగారి రెండవ కుమారుడు శివకుమార్‌తో వివాహము. ఇతను లెక్చరర్‌గా పనిచయుచున్నాడు. వీరికి ఒక కుమారుడు.

కాళహస్తి ఆదెయ్య, విశాలక్షమ్మ గార్ల ప్రథమ కుమార్తె వెంకలక్ష్మి. ఈమెను యకమా వరదయ్యగారి మూడవ కుమారుడు పూర్ణచంద్రరావుతో వివాహము.

కాళహస్తి ఆదెయ్యగారి రెండవ కుమార్తె నాగమణి. ఈమెను గుంటూరుకు చెందిన నందిగం సుబ్బయ్యగారి ప్రథమ కుమారుడు శ్రీనివాసరావుతో వివాహము.

వీరికి ఒక కుమార్తె. పేరు పార్వతి. ఈమెను మలకపాటి ప్రభాకరరావు గారి కుమారుడు సతీష్‌తో వివాహము.

కాళహస్తి ఆదెయ్యగారి మూడవ కుమార్తె శ్రీదేవి. ఈమెను నెల్లూరుకు చెందిన వెల్లాల శ్రీనివాసరావుగారితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు. ప్రభుత్వ రంగములో ఉద్యోగము చేయుచున్నారు.

కాళహస్తి ఆదెయ్యగారి నాల్గవ కుమార్తె సుశీల. ఈమెను విజయవాడకు చెందిన కామరుషి మోహన్‌రావు గారితో వివాహము. వీరికి ఇద్దరు సంతానము.

యకమా వదరయ్యగారి రెండవ కుమార్తె విజయలక్ష్మి. వీరు గుంటూరుకు చెందిన డా॥ బి.రాధాకృష్ణమూర్తి గారితో వివాహము. వీరు చిన్న వయస్సు నందే మరణించిరి. ఈమె చెల్లెలైన సాంబ్రాజ్యం గారితో (యకమా వరదయ్యగారి మూడవ కుమార్తె) రాధాకృష్ణమూర్తిగారికి ద్వితీయ వివాహము జరిగినది. వీరు డబుల్ ఎం.ఎ. చదివి, ఫిరంగిపురం బిషప్ గారి స్కూల్ నందు 40 సం॥లు ఉద్యోగము చేసి రిటైర్డ్ అయ్యారు. వీరు రేడియో సింగర్ మరియు స్పోర్ట్ ఉమెన్‌గా నేషనల్ గేమ్స్‌లో సెలక్ట్ అయ్యి ఆంధ్రప్రదేశ్ తరుపున వాలీబాల్, త్రోబాల్ ఆటలలో పాల్గొన్నారు. వీరు గుంటూరు లేడీస్ క్లబ్ నందు జాయింట్ సెక్రటరీగా గత 20 సం॥లుగా పనిచేస్తున్నారు. వీరికి ఒక కుమార్తె, కుమారుడు కలరు. కుమార్తె పేరు మాధవి. గుంటూరుకు చెందిన మాచర్ల చంద్రమౌళిగారి కుమారుడు డాక్టర్ యుగంధర్ కుమార్ గారితో వివాహము జరిగినది. సాంబ్రాజ్యం గారి కుమారుడు డా॥ రాజేష్. వీరు యన్.ఆర్.ఐ. హాస్పటల్, మంగళగిరి నందు ఉద్యోగము. వీరికి డా॥ అపర్ణతో వివాహము జరిగినది. వీరు సుదర్శిని నేత్ర వైద్యశాలనందు డాక్టర్‌గా పనిచేయుచున్నారు. డా॥ రాజేష్ గుంటూరు, లక్ష్మీపురం నందు ఫిజియోథెరపి క్లినిక్ నడుపుతున్నారు.

**(1) యకమా వెంకటప్పయ్య గారు వీరి ధర్మపత్ని భూశమ్మ గార్ల తృతీయ కుమారుడు యకమా అంజయ్య గారు.** వీరు నెల్లూరుకు చెందిన ఆకుల అల్లూరు వీరాస్వామిగారి సోదరి రాజమ్మ గారితో వివాహము. వీరు గుంటూరు, ఆర్.అగ్రహారం నందు ఫోటోఫ్రేమ్స్, అద్దాల షాపును నడిపిరి. వీరు 1950–70 వరకు గుంటూరు చుట్టు ప్రక్కల జరిగే తిరనాళ్ళకు (మంగళగిరి, కోటప్పకొండ, సింగరాయకొండ) ఎడ్లబండి కట్టుకొని వెళ్ళి ఆ తిరునాళ్ళలో దేవుని పటాలు, ఫోటో ఫ్రేముల వ్యాపారం చేసెడివారు. వీరికి ముగ్గురు కుమారులు. నలుగురు కుమార్తెలు కలరు.

**Page No. 23**



యకమా అంజయ్యగారి ప్రధమ కుమారుడు అప్పారావు గారు. వీరు తన మేనమామ గారైన వీరాస్వామిగారి కుమార్తె సుబ్బమ్మ గారితో వివాహము. వీరు విజయవాడ కనకదుర్గమ్మ కొండవద్ద అమ్మవారి ఫోటోఫ్రేమ్స్, అమ్మవారి బొమ్మలు అమ్మేవారు. వీరికి ఐదుగురు కుమారులు. ఇరువురు కుమార్తెలు. ప్రధముడు ప్రసాద్‌కు అమరావతి కృష్ణమూర్తి, గౌరీపద్మావతిల కుమార్తె గిరిజతో వివాహము. వీరు నెల్లూరు నందే వడ్రంగిపని చేయుచున్నారు. రెండవవారు సీతాపతిరావు గారు. వీరు కూడా వరిగొండ వారి అమ్మాయితో వివాహము. వివాహమైన కొలది కాలమునకే మరణించారు. మూడవవారు కోటేశ్వరరావు. వీరు కడప జిల్లాకు చెందిన మైదుకూరుకు చెందిన అమ్మాయితో వివాహము. అక్కడే వారు వడ్రంగి పని చేయుచున్నారు. నాలుగవ కుమారుడు శంకర్, ఐదవ కుమారుడు హరి ఖమ్మం (తెలంగాణా) నందు నివాసము. అచటనే వారి వివాహము జరిగినది.

యకమా అంజయ్య గారి ద్వితీయ కుమారుడు వెంకట కృష్ణారావు గారు. వీరు యస్.సి.రైల్వే నందు గార్డుగా హైదరాబాద్ నందు ఉద్యోగము చేసి రిటైర్డ్ అయి గుంటూరు, శ్రీనివాసరావుపేటలో నివాసము. వీరికి హైదరాబాద్ వారి అమ్మాయి సరస్వతితో వివాహము. వీరికి ముగ్గురు కుమార్తెలు. కుమార్తెల పెండ్లిళ్ళ అనంతరము తల్లి అకాల మరణము. తదుపరి బెంగుళూరుకు చెందిన తిమ్మయరాజుగారి కుమార్తె మంజులతో ద్వితీయ వివాహము. వీరికి ఒక కుమారుడు సంతోష్ కుమార్. వీరి ప్రధమ భార్య సంతానము పెద్దమ్మాయి పద్మజను నెల్లూరుకు చెందిన వెల్లాల వారి అబ్బాయితో వివాహము. రెండవ అమ్మాయి శైలజను గుంటూరుకు చెందిన వెల్లాల చలపతిరావు గారి కుమారుడు మోహన్‌రావు (రాజు) తో వివాహము. మూడవ అమ్మాయి నీరజను నెల్లూరుకు చెందిన గుండా వారి అబ్బాయితో వివాహము.

యకమా అంజయ్య గారి తృతీయ కుమారుడు మురళీ గారు. వీరు నెల్లూరుకు చెందిన వరిగొండవారి అమ్మాయి అనురాధతో వివాహము. వీరు గుంటూరు నందు వడ్రంగము పని చేయుచూ అరబ్ దేశాలలో ఉద్యోగము చేసి పిదప గుంటూరు వచ్చి చిన్న వయసునందే అకాల మరణం చెందారు. వీరికి ఒక కుమార్తె, కుమారుడు కలరు.

యకమా అంజయ్య గారి ప్రధమ కుమార్తె గౌరీ పద్మావతి. ఈమెను గుంటూరు శ్రీనివాసరావుపేటకు చెందిన అమరావతి కృష్ణమూర్తి గారితో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు. మొదటి వారు సుబ్బారావు గారు. వీరు గుంటూరుకు

చెందిన వెల్లాల పెద సుబ్రమణ్యం గారి ప్రథమ కుమార్తె ఝాన్సీ లతతో వివాహము. వీరికి ఒక్కతే కుమార్తె పేరు సత్యపావని. ఈమెను గుంటూరుకు చెందిన వెల్లాల రాజేంద్రప్రసాద్‌గారు వివాహమాడిరి. వీరి రెండవ కుమారుడు శేఖర్‌కు యకమా అప్పారావు గారి కుమార్తెతో వివాహము. మూడవ కుమారుడు వెంకటేశ్వరరావు (వెంకు)కు ఏలూరుకు చెందిన అమ్మాయితో వివాహము.

యకమా అంజయ్యగారి రెండవ కుమార్తె రంగనాయకమ్మ (బుల్లెమ్మాయి). ఈమెను కురిచేడుకు చెందిన వెల్లాల వెంకట సుబ్బయ్య గారి ప్రథమ కుమారుడు చలపతిరావు గారితో వివాహము. వీరు సిమెంట్ విగ్రహములు, రాతి చెక్కుడు పనులు చేసెడి వారు. వీరు మధ్య వయస్సునందే మరణించిరి. వీరికి ముగ్గురు కుమారులు.

యకమా అంజయ్యగారి తృతీయ కుమార్తె మహాలక్ష్మి (పాపాయమ్మ). వీరు కురిచేడుకు చెందిన వెల్లాల వెంకటేశ్వర్లు గారితో వివాహము. అనంతరము వీరు గుంటూరు నందే స్థిరపడి ఫోటో స్టూడియో నిర్వహించిరి. కొంత కాలం తరువాత నెల్లూరు తరలి వెళ్ళిరి. వీరికి ఇద్దరు కుమార్తెలు. ఒక కుమారుడు. వీరి ప్రథమ కుమార్తె లలితను చిలకలూరిపేటకు చెందిన యకమా పాపయ్య గారి రెండవ కుమారుడు వేణుగోపాల్‌తో వివాహము. వీరు గుంటూరు నందే స్థిరపడి వడ్రంగి పనిలో పేరుగాంచిరి. వీరికి ఒక కుమారుడు ఫణికుమార్, కుమార్తె హారిక. ఈమెకు పాపాయమ్మగారి కుమారుడు రాజుతో వివాహము. నెల్లూరు నందు నివాసము. వీరికి ఒక కుమార్తె, కుమారుడు కలరు. యకమా ఫణికుమార్ గుంటూరునందు రెడ్డి ల్యాబ్స్‌నందు ఉద్యోగము చేయుచున్నారు. ఇతనికి కర్నూలుకు చెందిన అమరావతి పురుషోత్తమవర్మ గారి కుమార్తె ఆశాలతతో వివాహము. వెల్లాల వెంకటేశ్వర్లు, పాపాయమ్మల రెండవ కుమార్తె రాజీను విజయవాడ వాస్తవ్యులు కామరుషి సుబ్బారావు, గౌరీమనోహర్‌ల పుత్రుడు రాజశేఖర్‌తో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

యకమా అంజయ్యగారి నాల్గవ కుమార్తె సుశీల. ఈమెను నెల్లూరుకు చెందిన పైకోట రామమూర్తి గారితో వివాహము. వీరు నెల్లూరు నందు వడ్రంగం పనిలో పేరు గాంచిరి. వీరికి ముగ్గురు కుమారులు. వీరి నివాసము నెల్లూరు.

**(1) యకమా వెంకటప్పయ్య గారు వీరి ధర్మపత్ని బూశమ్మ గార్ల నాల్గవ కుమారుడు యకమా రాఘవయ్య గారు.** వీరు కురిచేడుకు చెందిన వెల్లాల వెంకట సుబ్బయ్యగారి సోదరి నరసమ్మతో వివాహము. వీరు పౌరాణిక

**Page No. 24**



నాటకములకు హార్మోనియం వాయించుటలో మంచి నేర్పరి. వీరు హార్మోనియములు, డోలు, ఫిడేలు, తబల వంటి వాయిద్యములు తయారు చేయుటలో ప్రవీణులు. వీరు నాజ్ సెంటర్‌లో ఫోటోఫ్రేమ్స్, అద్దాలషాపు నిర్వహించారు. వీరికి ఇద్దరు కుమారులు యకమా వెంకటేశ్వర్లు, యకమా వెంకట్రామయ్య. ఒక కుమార్తె లక్ష్మీ కోటేశ్వరమ్మ. రాఘవయ్య గారు బదరీనాథ్ యాత్ర పూర్తిచేసుకొని తిరుగు ప్రయాణమున కాలం చేశారు.

యకమా రాఘవయ్యగారి ప్రథమ సంతానము లక్ష్మీ కోటేశ్వరమ్మ. ఈమెను కృష్ణా జిల్లా, విజయవాడకు చెందిన కామరౌతు సుబ్బారావు గారితో వివాహము. వీరు విజయవాడనందు పేయింటింగ్ వర్క్ షాపు నిర్వహించెడివారు. వీరికి ముగ్గురు కుమారులు. కుమారులలో ప్రథముడైన కామరౌతు సర్వేశ్వరరావుకు కర్నూలుకు చెందిన చిత్తారి రామయ్యగారి అమ్మాయి శ్రీదేవితో వివాహము. వీరికి సంతానము లేదు. వీరు గుంటూరు నందే ప్రైవేటుగా జాబ్ చేయుచూ ఇటీవలి కాలమునందు మరణించిరి. కామరౌతు సుబ్బారావుగారి ద్వితీయ కుమారుడు నాగేశ్వరరావు. వీరు నూజివీడుకు చెందిన వరాటి వెంకట సుబ్బారావుగారి కుమార్తె లక్ష్మితో వివాహము. కామరౌతు నాగేశ్వరరావు గారు యన్.ఆర్.యస్.ఎ.డిపార్ట్‌మెంట్ నందు ఉద్యోగము చేయుచున్నారు. హైదరాబాద్ నందు స్థిర నివాసము. వీరికి ఒక కుమారుడు జ్ఞానేంద్ర, కుమార్తె ప్రత్యూష. కామరౌతు సుబ్బారావుగారి మూడవ కుమారుడు లోకేశ్వరరావు. వీరు గుంటూరు నందు నివసిస్తున్నారు. వీరు వరిగొండకు చెందిన విజయతో వివాహము. వీరికి ఒక కుమారుడు జ్ఞానేష్.

యకమా రాఘవయ్యగారి ప్రథమ కుమారుడు యకమా వెంకటేశ్వర్లు గారు. గుంటూరుకు చెందిన మగతాల హనుమంతరావు గారి ప్రథమ కుమార్తె సత్యవతితో వివాహము. వీరు రైల్వే నందు గుంతకల్‌లో ఛీఫ్ కంట్రోలర్‌గా పనిచేసి గుంటూరులో స్థిరపడ్డారు. వీరికి ఇద్దరు కుమారులు. ఒక కుమార్తె. వెంకటేశ్వర్లు గారి ప్రథమ కుమారుడు యకమా రాఘవేంద్రరావు. వృత్తిరీత్యా అడ్వకేట్. వీరు రాయచూరుకు చెందిన చిత్తారి శివకుమార్ గారి అమ్మాయి కృష్ణవేణితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు హర్షితసాయి, శ్రీనిక. వీరు గుంటూరు రైలుపేట, ఆర్యక్షత్రియవీధి నందు నివాసము. వెంకటేశ్వర్లు గారి ద్వితీయ కుమారుడు బాలకృష్ణ. ఇతడు తమ తాతగారైన మగతాల హనుమంతరావుగారి ఇంటి నందు అదే వృత్తి నిర్వహించు చున్నాడు. (మగతాల హనుమంతరావు గారు బార్బర్ చైర్స్ చేయుటలో ఆంధ్రప్రదేశ్ మరియు ఇతర రాష్ట్రములలో కూడా ప్రఖ్యాతి గాంచారు) యకమా

బాలకృష్ణకు కడపకు చెందిన నరసింహారావు గారి అమ్మాయి సుగుణతో వివాహము. వీరికి ఒక్కడే కుమారుడు కీర్తన్ వర్మ. యకమా వెంకటేశ్వర్లు గారి ఏకైక కుమార్తె బిందుమాధవిని కడప వాస్తవ్యులు చిత్తారి కాళంగి పెద్ద నరసింహులుగారి ఆరవ కుమారుడు హరగోపాల్‌తో వివాహము. బిందుమాధవి కడప నందు లాకాలేజిలో లెక్చరర్‌గా పనిచేయుచున్నారు. హరగోపాల్ ఆటోమొబైల్ స్టోర్ నిర్వహిస్తున్నారు. వీరికి ఇద్దరు కుమార్తెలు హరిచందన, హరిసాహితి, ఒక కుమారుడు విఘ్నేష్.

యకమా రాఘవయ్యగారి ద్వితీయ కుమారుడు యకమా వెంకట్రామయ్య గారు. వీరు మార్కాపురంనకు చెందిన రామకోటయ్యగారి కుమార్తె శకుంతలతో వివాహము. వీరు గుంటూరులో పట్నం బజారు నందు ఫర్టిలైజర్స్ ఎరువుల వ్యాపారం. వీరికి ఇద్దరు మగ సంతానము, ఒక కుమార్తె. కుమారులలో ప్రథముడైన గిరీష్ రఘునాథ్. అనంతపురంనకు చెందిన శ్రీదేవితో వివాహము. ఇతడు తిరుపతిలో కార్పెంటరీ పని చేయుచున్నారు. వీరికి ఇద్దరు కుమార్తెలు జ్వాలా మహాలక్ష్మి, లిఖిత. రెండవ కుమారుడు యకమా బాలకిషోర్. వీరికి కడపకు చెందిన బాబునూరి రామూర్తి గారి కుమార్తె ధరణీప్రియతో వివాహము. వీరికి ఒక కుమార్తె కుముదవల్లి, కుమారుడు మాధవ వర్మ. బాలకిషోర్ గారు గుంటూరు నందు కంప్యూటరైజ్డ్ ఉడ్ కార్వింగ్ వర్క్ నందు ప్రవీణులు. ఇతడు చెక్కతో శిల్పములు చెక్కుటయందు నేర్పరి. వీరు పలు దేవాలయములందు దేవతా మూర్తులను చేసి ప్రఖ్యాతి గాంచారు. యకమా వెంకట్రామయ్యగారి ఏకైక కుమార్తె పావనిని నెల్లూరుకి చెందిన పైకోట రామమూర్తి, సుశీల గార్ల మూడవ కుమారుడు నాగరాజుతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు భానుప్రకాష్, సాయి.

*యకమా వెంకటస్వామి వారి సతీమణి సీతామహాలక్ష్మమ్మ గార్ల ప్రథమ కుమారుడు యకమా వెంకటప్పయ్య వీరి ధర్మపత్ని భూశమ్మగార్ల సంతాన వివరములు ఇంత వరకు తెలియజేయడమైనది.*

**(2) యకమా వెంకటస్వామి వారి సతీమణి సీతామహాలక్ష్మమ్మ గార్లు ద్వితీయ కుమారుడు యకమా కోటయ్యగారు, వీరి ధర్మపత్ని రత్నమ్మ గారు.** యకమా కోటయ్య గారు తర్లుపాడు నుండి పురుషోత్తమపట్నం మరియు అచట నుండి చిలకలూరిపేటకు వలస వచ్చి అక్కడే స్థిరపడ్డారు. వీరు దేవాలయ గాలిగోపురములు, ఇత్తడితో మకర తోరణములు మరియు కొయ్యతో రథములు, దేవతా మూర్తులు చేయుచుండెడివారు. వీరికి ఆరుగురు మగ సంతానము, ముగ్గురు ఆడ సంతానము.

**Page No.**
**25**



యకమా కోటయ్య, రత్నమ్మ గార్ల ప్రథమ సంతానము యకమా వెంకట సుబ్బయ్య వీరి ధర్మపత్ని సుబ్బమ్మగార్లు. యకమా వెంకట సుబ్బయ్య గారు తండ్రి వలెనే దేవతామూర్తుల విగ్రహములు, దేవుని బుట్టబొమ్మలు, బొల్లి ఆవుల బొమ్మలు తయారు చేయుటలో నేర్పరి. వీరికి ఒక కుమారుడు యకమా దేవీ నాగ శంకరరావు గారు, కుమార్తె రత్నమ్మ కలరు.

కుమారుడు యకమా దేవీ నాగ శంకరరావు గారు. వీరు నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాళెంనకు చెందిన కామరాజు పెద చెంచెయ్యగారి కుమార్తె చెంచమ్మతో వివాహము. వీరు చిలకలూరిపేట యందు పోస్టల్ డిపార్ట్‌మెంట్‌లో పోస్ట్ మాస్టర్‌గా పనిచేసి ఇటీవల మరణించిరి. వీరికి ముగ్గురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు.

యకమా దేవీ నాగ శంకరరావు గారి ప్రథమ కుమార్తె బుల్లెమ్మాయిని హైదరాబాద్‌కు చెందిన రఘునందన్ గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

యకమా దేవీ నాగ శంకరరావు గారి ద్వితీయ కుమార్తె లక్ష్మి కుమారి. ఈమెను నెల్లూరుకు చెందిన టేకుమళ్ళవారి అబ్బాయి వెంకటేష్‌తో వివాహము. వెంకటేష్‌గారు హైదరాబాద్‌నందు ఉద్యోగము మరియు నివాసము. వీరికి ఒక కుమారుడు ఒక కుమార్తె.

యకమా దేవీ నాగ శంకరరావు గారి తృతీయ కుమార్తె పద్మ. ఈమెకు అనంతపురం జిల్లా మడకశిర వాస్తవ్యులు చిత్తారి పార్ధసారధిగారితో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు.

యకమా దేవీ నాగ శంకరరావు గారి ప్రథమ కుమారుడు శ్రీనివాసరావు. వీరు గుంటూరుకు చెందిన మాచర్ల వెంకట సుబ్బయ్యగారి రెండవ కుమార్తె పద్మజతో వివాహము. యకమా శ్రీనివాసరావుగారు చీరాల స్టేట్ బ్యాంక్‌లో ఉద్యోగము చేయుచూ అకాల మరణం చెందిరి. వీరికి ఒక్కడే కుమారుడు. తదుపరి యకమా శ్రీనివాసరావు గారి సతీమణి పద్మజ స్టేట్ బ్యాంకు, గుంటూరు బ్రాంచి నందు ఉద్యోగము నిర్వహించుచున్నారు.

యకమా దేవీ నాగ శంకరరావు గారి రెండవ కుమారుడు యకమా కోటేశ్వరరావు గారు. వీరు వృత్తిరీత్యా శ్రీశైలం థర్మల్ ప్లాంట్‌నందు సీనియర్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా పని చేయుచున్నారు. వీరు బెంగుళూరుకు చెందిన వసంత గారి రెండవ కుమార్తె అనితతో వివాహము. కోటేశ్వరరావు గారికి ఇద్దరు కుమారులు.

యకమా కోటేశ్వరరావుగారు ప్రస్తుతము నెల్లూరు జిల్లా కృష్ణపట్నం థర్మల్ ప్రాజెక్టు నందు ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించుచున్నారు.

యకమా వెంకట సుబ్బయ్య వీరి ధర్మపత్ని సుబ్బమ్మగార్ల ఏకైక కుమార్తె రత్నమ్మగారు. వీరిని విజయవాడకు చెందిన నామేపల్లి నరసింహారావు గారితో వివాహము. వీరి వంశాకురము నామేపల్లి నరసింహారావుగారి మనుమడు భాస్కరరావు గారు. వీరు డ్రామా డ్రస్ కంపెనీ కలదు. వీరు విజయవాడ, అరండల్‌పేట నందు ఒక నిమిషాంబాదేవి ఆలయము నందు నిత్యపూజలు నిర్వహిస్తున్నారు.

**యకమా కోటయ్య గారు వీరి ధర్మపత్ని రత్నమ్మ గార్ల రెండవ కుమారుడు యకమా నరసింహం గారు.** వీరు నూజివీడుకు చెందిన గాజర్లవారి అమ్మాయి వీరమ్మతో వివాహము. వీరికి ముగ్గురు కుమార్తెలు.

**వీరి ప్రధమ కుమార్తె రుక్మిణమ్మ.** ఈమెను బందరుకు చెందిన పేరూరి పాండురంగారావుగారితో వివాహము. వీరు వివాహానంతరము తమ మామగారైన యకమా నరసింహంగారి ప్రోత్సహముతో చిలకలూరిపేటనందే నివాసము. వీరికి ఒక కుమార్తె, ఇద్దరు కుమారులు,

వీరి ప్రధమ కుమార్తె రత్నమాల. ఈమెను నెల్లూరు జిల్లా వరిగొండకు చెందిన చెన్నూరు నారాయణరావుగారితో వివాహము. వీరు నెల్లూరు నందే కార్పెంటరీ పని తదుపరి బార్బర్ చైర్స్ చేసెడివారు. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. వీరి ప్రధమ కుమారుడు దొరస్వామి. వీరు గుంటూరుకు చెందిన తన మేనమామగారైన పేరురి గోపాల్‌గారి ప్రధమ పుత్రిక రూపాదేవితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు.

చెన్నూరి నారాయణరావు, రత్నమాల గార్ల ద్వితీయ కుమారుడు శ్రీనివాసరావు. వీరికి చాగల్లు (కనిగిరివద్ద) వారి అమ్మాయితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె కలరు. వీరు తమ తండ్రిగారివలెనే కార్పెంటరీ వర్క్ చేయుచున్నారు.

చెన్నూరి నారాయణరావు, రత్నమాల గార్ల ఏకైక కుమార్తె ఉమాదేవిని నెల్లూరుకు చెందిన చిత్తూరి బాబునూరి రామమూర్తి, సుజాత గార్ల పెద్ద కుమారుడు నాగరాజుతో వివాహము. వీరికి ఒక కుమారుడు.

పేరూరి పాండురంగరావు, రుక్మిణమ్మ గార్ల ప్రధమ కుమారుడు పేరూరి గోపాలరావు. వీరు నంద్యాలకు చెందిన మగతాల హనుమంతరావు గారి సోదరుడు

Page No.
26



రామదాసు, రంగమ్మ గార్ల ప్రధమ కుమార్తె కమలతో వివాహము. వీరు గుంటూరు నందే కార్పెంటరీ పనులు, బార్బర్ చైర్స్ పనులు చేయుచున్నారు. వీరికి ఇద్దరు కుమార్తెలు. ఒక కుమారుడు. వీరి ప్రధమ కుమార్తె రూపాదేవి. ఈమెకు దొరస్వామితో వివాహము. వీరి రెండవ కుమార్తె శ్రీలక్ష్మి. ఈమెను నంద్యాల టౌన్‌కు చెందిన మాచరౌతు లక్ష్మీనారాయణ (సబ్‌రిజిష్టార్) – సరోజనమ్మ గార్ల ఏకైక కుమారుడు శివప్రసాద్‌గారితో వివాహము. వీరు గుంటూరు నందే రియల్ ఎస్టేట్ వ్యాపారం. వీరికి ఇద్దరు కుమారులు. పేరూరి గోపాలరావు, కమల గార్ల ఏకైక కుమారుడు రఘునందన్. ఈమెను నంద్యాల టౌన్‌కు చెందిన మాచరౌతు లక్ష్మీనారాయణ (సబ్‌రిజిష్టార్) – సరోజనమ్మ గార్ల ఏకైక కుమార్తె భవానితో వివాహము. వీరు గుంటూరులో రియల్ ఎస్టేట్ వ్యాపారం. వీరికి ఇద్దరు కుమారులు సందీప్, సూర్యతేజ.

పేరూరి పాండురంగరావు, రుక్మిణమ్మ గార్ల ద్వితీయ కుమారుడు పేరూరి గంగాధర్‌రావు. వీరు బందరుకు చెందిన ముత్యాలమ్మగారికి దత్తతు వెళ్ళినారు. తదుపరి కర్నూలు జిల్లా గద్వాలకు చెందిన గొడుగుల మురళిగారి సోదరి అలివేణితో వివాహము. వీరికి ఒక కుమారుడు కార్తీక్.

**యకమా నరసింహం–వీరమ్మ గార్ల ద్వితీయ కుమార్తె సరస్వతి.** ఈమెను నూజివీడుకు చెందిన కాళహస్తి పాండురంగారావుగారితో వివాహము. వీరు చిలకలూరిపేట నందు స్థిర నివాసము. వీరికి ఒక కుమారుడు, ఆర్గురు కుమార్తెలు.

కుమారుడు కాళహస్తి వెంకటేశ్వరరావుకు నెల్లురుకు చెందిన నందిగం గోవిందరాజులు గారి కుమార్తె గౌరితో వివాహము. వీరు తాతగారి ఇంటియందే ఉంటూ వడ్రంగిపని చేయుచూ చుట్టూ ప్రక్కల గల పల్లెలందు భవన నిర్మాణములు చేయూచూ, వ్యాపార రంగంలో స్థిరపడ్డారు. వీరికి ముగ్గురు కుమారులు నవీన్, నరేష్, రాజేష్. అందరికీ వివాహములైనవి.

కాళహస్తి పాండురంగారావు సరస్వతిగార్ల ప్రధమ కుమార్తె శ్యామలను గుంటూరుకు చెందిన యకమా వెంకట్రావు గారి తృతీయ కుమారుడు వెంకటరత్నం గారితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. పెద్ద కుమారుడు నరేంద్ర వారి భార్య శ్రావణి. వీరికి ఒక కుమారుడు ధనుష్, కుమార్తె మౌనిక కలరు. చిన్న కుమారుడు భాస్కర్ వారి భార్య గీత. వీరికి ఒక కుమారుడు మంజునాథ్, కుమార్తె భువనకృతి. వీరు అపార్ట్‌మెంట్స్‌లో ఉడ్‌వర్క్ పనులు చేయుచూ

గుంటూరులోనే స్థిరపడ్డారు. యకమా వెంకటరత్నంగారి కుమార్తె కళ్యాణి. ఈమెను వెల్లాల ప్రసన్న కోటేశ్వరరావుగారి ప్రథమ కుమారుడు వెంకట నాగ వెంకటేశ్వరరావు గారితో వివాహము. వీరికి ఒక కుమార్తె హరిప్రియ, కుమారుడు తరుణ్.

కాళహస్తి పాండురంగారావు సరస్వతిగార్ల ద్వితీయ కుమార్తె విజయని నెల్లూరుకు చెందిన వరాటి వెంకయ్య గారి కుమారుడు సుబ్బారావుతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె.

కాళహస్తి పాండురంగారావు సరస్వతిగార్ల మూడవ కుమార్తె కృష్ణవేణిని హైదరాబాద్‌కు చెందిన గొడుగుల సురేష్ గారితో వివాహము. వీరు డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ నడుపుతున్నారు.

కాళహస్తి పాండురంగారావు సరస్వతిగార్ల నాల్గవ కుమార్తె రాధారాణి. ఈమెను నెల్లూరుకు చెందిన వెంకటేశ్వరరావు గారితో వివాహము.

కాళహస్తి పాండురంగారావు సరస్వతిగార్ల ఐదవ కుమార్తె మాధవీలతను గుంటూరుకు చెందిన నందిగం సూర్యప్రకాశరావు గారి కుమారుడు వెంకట రమణతో వివాహము. వీరు ఎలక్ట్రికల్ పనులు చేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు అఖిల్.

కాళహస్తి పాండురంగారావు, సరస్వతిగార్ల ఆరవ కుమార్తె ఇందిరను ఒంగోలుకు చెందిన యల్లాల వేణుగోపాల్‌తో వివాహము. వీరికి ఒక కుమారుడు నాగార్జునరాజు. ఒక కుమార్తె రుక్మిణిని గుంటూరు వాస్తవ్యులు గొడుగుల మురళి వర్మ, కుమారి గార్ల మూడవ కుమారుడు రవికాంత్‌వర్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె హన్సిక.

**యకమా నరసింహం–ఈరమ్మ గార్ల తృతీయ కుమార్తె సుజాత.** ఈమెకు కడపకు చెందిన బాపనూరి రామమూర్తి గారితో వివాహము. వీరు నెల్లూరులో పంచాయితీరాజ్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం చేసి రిటైర్డ్ అయ్యారు. ఇటీవలనే భార్యాభర్తలిరువురూ మరణించారు. వీరికి ఇద్దరు కుమారులు. పెద్ద కుమారుడు నాగరాజు నెల్లూరుకు చెందిన చెన్నూరి నారాయణగారి కుమార్తెతో వివాహము. బాపనూరి రామమూర్తి రెండవ కుమారుడు బెంగుళూరులో నివాసము.

**యకమా కోటయ్య గారు, రత్నమ్మ గార్ల మూడవ కుమారుడు యకమా వెంకట్రావు గారు. వీరు నూజివీడుకు చెందిన గాజర్లవారి అమ్మాయి వీరభద్రమ్మ గారితో వివాహము.** వెంకట్రావుగారు గుంటూరులో వడ్రంగిపని చేసెడివారు.

Page No. 27



వీరి పౌరాణిక నాటకములాడెడివారు. వీరికి నలుగురు కుమారులు ఆంజనేయులు, కోటేశ్వరరావు, వెంకటరత్నం, ఉమామహేశ్వరరావు. ఇద్దరు కుమార్తెలు శశమ్మ, లక్ష్మీకుమారి.

**వీరి ప్రథమ కుమారుడు యకమా ఆంజనేయులు గారు.** గుంటూరు, సాంబశివపేటకు చెందిన నందిగం కోటయ్యగారి నాల్గవ కుమార్తె ఉమామహేశ్వరి (మయుడు)తో వివాహము. వడ్రంగం పని వీరి వృత్తి. వీరికి సంతానము లేదు.

**యకమా వెంకట్రావు గారి రెండవ కుమారుడు కోటేశ్వరరావు గారు.** చిలకలూరిపేట నందు నివాసము. వీరికి ముగ్గురు కుమారులు.

**యకమా వెంకట్రావు గారి మూడవ కుమారుడు వెంకటరత్నం గారు.** చిలకలూరిపేటకు చెందిన కాళహస్తి పాండురంగారావు గారి ప్రథమ కుమార్తె శ్యామలతో వివాహము. వీరు వడ్రంగిపని చేసెడివారు. వీరికి ఇరువురు మగ సంతానము నరేంద్ర, భాస్కర్. ఒక కుమార్తె కళ్యాణి.

యకమా వెంకటరత్నంగారి కుమార్తె కళ్యాణిని గుంటూరుకు చెందిన వెల్లాల లక్ష్మీ ప్రసన్న కోటేశ్వరరావుగారి ప్రథమ కుమారుడు వెంకటేశ్వర్లుతో వివాహము. వీరు గుంటూరులో ఎలక్ట్రికల్ షాపు నిర్వహిస్తున్నారు. వీరికి ఒక కుమార్తె హరిప్రియ. కుమారుడు తరుణ్.

యకమా నరేంద్రకు గుంటూరుకు చెందిన ఉద్దంటి సీతారామయ్య గారి ప్రథమ కుమార్తె శ్రావణితో వివాహము. వీరికి ఒక కుమార్తె మౌనిక. కుమారుడు ధనుష్. యకమా భాస్కర్‌కు నంద్యాలకు చెందిన గీతతో వివాహము. వీరికి ఒక కుమార్తె భువన. కుమారుడు మంజునాథ్. వీరు తండ్రిగారివలెనే కార్పెంటరీ పని చేయుచూ గుంటూరు నందే స్థిర నివాసము.

**యకమా వెంకట్రావుగారి నాల్గవ కుమారుడు ఉమామహేశ్వరరావు గారు.** వీరు గుంటూరు యూనియన్ బ్యాంకు నందు ఉద్యోగము. వెల్లాల లక్ష్మయ్య పెద మహాలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమార్తె మీనాకుమారితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు లీలాశివకుమార్, మోహన్‌వర్మ. వీరు ప్రైవేట్‌గా ఉద్యోగములు చేయుచున్నారు. యకమా లీలాశివకుమార్‌కు ఇద్దరు కుమారులు. మోహన్‌వర్మకు ముగ్గురు కుమారులు. గుంటూరు స్థిర నివాసము. ఒక కుమార్తె శ్రీదేవి. ఈమెను ప్రకాశం జిల్లా కంభంకు చెందిన కామరాజు పెద్ద సంజీవయ్యగారి కుమారుడు సతీష్‌తో వివాహము. వీరికి ఒక కుమార్తె, ఇద్దరు కుమారులు.

**యకమా వెంకట్రావు గారి ప్రథమ కుమార్తె శశమ్మ. ఈమెను ప్రకాశం జిల్లా కంభంకు చెందిన కామరాజు చిన సంజీవయ్య గారితో వివాహము.** వీరు బంగారపు పని చేసెడివారు. ప్రస్తుతం హైదరాబాద్ స్థిర నివాసం. ఇటీవలనే మరణించిరి. వీరికి ముగ్గురు కుమారులు. ముగ్గురు కుమార్తెలు.

వీరి ప్రథమ కుమారుడు కామరాజు అనిల్. హైదరాబాద్‌లో డాక్టర్‌గా పనిచేస్తున్నారు. హైదరాబాద్‌కు చెందిన హనుమంతరాజు గారి అమ్మాయితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు అభినయ, అలంక్రిత. రెండవ కుమారుడు అశోక్ కుమార్. మూడవ కుమారుడు పవన్ కుమార్. ఇతను తమ స్వంత అక్క, బావగార్లు అయిన అరుణ, యకమా వెంకట కోటేశ్వరరావు గారి ఏకైక పుత్రిక సూర్య ఉషతో వివాహము. పవన్ కుమార్ పే & అకౌంట్స్ డిపార్ట్‌మెంట్‌లో ప్రభుత్వ ఉద్యోగము చేయుచున్నారు. హైదరాబాద్ స్థిర నివాసము. వీరికి ఒక కుమార్తె ఆరాధ్య.

కామరాజు చిన సంజీవయ్య గారి ప్రథమ కుమార్తె అయిన అనంతలక్ష్మిని గుంటూరుకు చెందిన యకమా ఆంజనేయులు గారి ప్రథమ కుమారుడు యకమా వెంకట నాగేశ్వరరావుతో వివాహము. వీరు గుంటూరులో ఇండియన్ బ్యాంక్ నందు ఉద్యోగముచేసి రిటైర్ అయ్యారు. వీరికి ఒక కుమారుడు, ఒక కుమార్తె. వీరి కుమారుడు యకమా నవీన్ కుమార్. యాక్సిస్ బ్యాంక్ హైదరాబాద్ బ్రాంచిలో ఆఫీసరుగా పనిచేస్తున్నారు. వీరు కర్నూలుకు చెందిన చిత్తారి సత్యన్నారాయణగారి కుమార్తె అర్చనతో వివాహము. వీరికి ఒక కుమారుడు గౌతమ్ ఆదిత్య. యకమా వెంకట నాగేశ్వరరావు గారి కుమార్తె రమాదేవి. వీరు కర్నాటక, సిరిగుప్పకు చెందిన చిత్తారి అమరావతి శ్రీనివాసరావు వర్మతో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు విజయసింహవర్మ, సుజిత్ వర్మ, విద్యాసాగర్ వర్మ. బెంగుళూరు నందే స్థిర నివాసము.

కామరాజు చిన సంజీవయ్య గారి ద్వితీయ కుమార్తె అరుణ కుమారి. వీరు చిలకలూరిపేటకు చెందిన యకమా సుబ్బారావు, వెంకట సుబ్బమ్మగారి ప్రథమ కుమారుడు కోటేశ్వరరావుతో వివాహము. వీరికి ఒక కుమార్తె సూర్య ఉష.

కామరాజు చిన సంజీవయ్య గారి తృతీయ కుమార్తె (అనిత) చిన్నిని నంద్యాల వాస్తవ్యులతో వివాహము.

**యకమా వెంకట్రావు గారి ద్వితీయ కుమార్తె లక్ష్మీకుమారి. కర్నూలు జిల్లా, గద్వాల్‌కు చెందిన గౌడుగుల నరసింహవర్మ–సుశీలమ్మగార్ల ప్రథమ కుమారుడు**

Page No. 28



**మురళివర్మతో వివాహము.** వీరు పెయింటింగ్ ఆర్టిస్ట్‌గా పనిచేశారు. వీరికి ముగ్గురు కుమారులు మదన్ కుమార్ వర్మ, వంశీకృష్ణ వర్మ, రవికాంత్ వర్మ.

గౌడుగుల మరళీగారి ప్రథమ కుమారుడు మదన్ కుమార్ వర్మ సత్తెనపల్లి వాస్తవ్యులు చెందిన కూకట్ల రామకోటేశ్వరరావుగారి కుమార్తె కళ్యాణితో వివాహము. వీరికి ఒక కుమారుడు కార్తికేయవర్మ. ద్వితీయ కుమారుడు వంశీకృష్ణవర్మ. వీరు హైదరాబాద్‌కు చెందిన అమరావతి సురేష్–కృష్ణకుమారి గార్ల కుమార్తె స్వాతితో వివాహము. వీరికి ఒక కుమార్తె శ్రీజ, కుమారుడు విఘ్నేష్‌వర్మ. తృతీయ కుమారుడు రవికాంత్ వర్మకు ఒంగోలుకు చెందిన వెల్లాల వేణుగోపాలరావు, ఇందిర గార్ల ఏకైక కుమార్తె రుక్మిణితో వివాహము. వీరికి కుమార్తె హన్సిక.

**యకమా కోటయ్య – రత్నమ్మ గారి నాల్గవ కుమారుడు యకమా పాపయ్య గారు. వీరు వెల్లాల చిన్న నరసింహ–మాశమ్మ గార్ల ప్రథమ కుమార్తె వెంకట మహాలక్ష్మమ్మ (ఎర్రెమ్మ) గారితో వివాహము.** వీరు చిలకలూరిపేట ఐ.యల్.టి.డి. కంపెనీ యందు ఉద్యోగము నిర్వహించిరి. వీరికి నల్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు.

యకమా పాపయ్యగారి ప్రథమ కుమారుడు రామయ్య. వీరికి వివాహము లేదు. ఇటీవలనే మరణించిరి. రెండవ కుమారుడు యకమా పూర్ణచంద్రరావు. వీరు గుంటూరు నందు ఐ.యల్.టి.డి. నందు ఉద్యోగము చేసి రిటైర్డ్ అయినారు. వీరు భీమవరంకు చెందిన దామా శేషగిరిరావు గారి ప్రథమ కుమార్తె పార్వతితో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు.

వీరి ప్రథమ కుమారుడు యకమా శ్రీనివాసరావు. వీరు ఏలూరుకు చెందిన మలకపాటి కోటేశ్వరావు–రత్నమ్మ గారి కుమార్తె అనూరాధతో వివాహము. వీరికి ఒక్కడే కుమారుడు హర్ష. శ్రీనివాసరావు ఐ.యల్.టి.డి,లో పనిచేస్తున్నారు. అనూరాధ ఏలూరు నందు గవర్నమెంట్ స్కూల్ హెడ్‌మాస్టర్‌గా పనిచేస్తున్నారు. యకమా పూర్ణచంద్రరావుగారి రెండవ కుమారుడు యకమా రాజేష్ కుమార్. వీరు డిగ్రీ పాస్ అయి ప్రైయివేట్ జాబ్ చేసుకొనుచున్నారు. యకమా పూర్ణచంద్రరావు గారి మూడవ కుమారుడు యకమా కిరణ్ కుమార్. వీరు సొంతముగా మెడికల్ ల్యాబ్‌ను నిర్వహిస్తున్నారు. వీరు నూజివీడుకు చెందిన వరాటి వారి అమ్మాయి జయంతితో వివాహము.

యకమా పాపయ్య గారి మూడవ కుమారుడు హరికుమార్. వీరికి వివాహము లేదు. చిలకలూరిపేట నందు నివాసము.

యకమా పాపయ్య గారి నాల్గవ కుమారుడు వేణుగోపాల్. వీరు గుంటూరుకు చెందిన వెల్లాల వెంకటేశ్వర్లు–పాపాయమ్మ గార్ల ద్వితీయ కుమార్తె లలితతో వివాహము. వీరు గుంటూరు నందే వడ్రంగి పని చేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు యకమా వెంకట ఫణికుమార్. కుమార్తె హారిక.

వీరి కుమారుడు యకమా వెంకట ఫణి కుమార్. వీరు అమెరికన్ పాథాలజీ కంపెనీ నందు గుంటూరులో పనిచేయుచున్నారు. వీరు కర్నూలుకు చెందిన అమరావతి పురుషోత్తమవర్మ–సులోచనమ్మ గార్ల కుమార్తె ఆశాలతతో వివాహము. కుమార్తె హారికను తన స్వంత బావమరిది వెల్లాల రాజుతో వివాహము. వీరు ఇంటీయర్ డిజైనర్గా పనిచేయుచున్నారు. వీరికి ఒక పాప గౌతమి, ఒక బాబు పృధ్వీ నరసింహ. నెల్లూరు స్థిర నివాసము.

యకమా పాపయ్య గారి ముగ్గురు కుమార్తెలలో ప్రథమ కుమార్తె సీతామహాలక్ష్మి. ఈమెను రైలుపేటకు చెందిన వెల్లాల రఘురామకృష్ణయ్య గారితో వివాహము. వీరు తమ తండ్రిగారివలె చెక్కుడుపని, దేవతా విగ్రహములు చేయుటలో నిపుణులు. వీరు బుట్టబొమ్మలు, బొల్లిఆవులు, దేవతా విగ్రహములు, ధ్వజస్తంభములు మరమ్మతులు, రంగులు వేయుటలో ప్రసిద్ధులు. వీరికి ఇద్దరు కుమారులు వెల్లాల వెంకట రమణ కుమార్, కిషోర్ కుమార్. ఒక కుమార్తె పద్మ.

యకమా పాపయ్య గారి రెండవ కుమార్తె రత్నమ్మ. వీరు ఏలూరుకు చెందిన మలకపాటి కోటేశ్వరరావు గారితో వివాహము. వీరు ఏలూరు నందు జూట్ మిల్ నందు ఉద్యోగము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె. కుమారుడు మలకపాటి ప్రసాద్కు హైదరాబాద్ అమ్మయితో వివాహము. వీరు బెంగుళూరులో సాఫ్ట్వేర్ ఇంజనీర్గా పనిచేస్తున్నారు. కుమార్తె అనూరాధ.

యకమా పాపయ్య గారి మూడవ కుమార్తె నాగమణి. వీరు విజయవాడకు చెందిన కేతవరపు పాపయ్య గారి జ్యేష్ఠ కుమారుడు సూర్యనారాయణ గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు ప్రవీణ్, కుమార్తె ప్రణీత. విజయవాడ వీరి స్థిర నివాసము.

**యకమా కోటయ్య గారు వీరి ధర్మపత్ని రత్నమ్మ గార్ల ఐదవ కుమారుడు యకమా కృష్ణారావు గారు. గుంటూరు సాంబశివపేటకు చెందిన నందిగం రోశయ్య–కోటమ్మ గార్ల ప్రథమ పుత్రిక పెద్దకోటేశ్వరమ్మ గారితో వివాహము.** వీరు చెక్క మీద చెక్కుడు పనులు, డిజైన్ పనులు చేయుటలో నిపుణులు. అనేక మందికి





ఈ విద్య నేర్పిరి. వీరికి ఇద్దరు కుమారులు. ముగ్గురు కుమార్తెలు. గుంటూరు వీరి స్థిర నివాసము.

యకమా కృష్ణారావు గారి ప్రథమ కుమారుడు యకమా గౌరీశంకర్. వీరు అమరావతి సుబ్రమణ్యంగారి దత్త పుత్రిక మంజరితో వివాహము. వీరికి ఒక కుమారుడు వెంకటేష్, కుమార్తె పద్మజ. వీరు గుంటూరు, విద్యానగర్ నందు నివాసము. వీరు పలు అపార్ట్మెంట్లకు ఉడ్వర్క్, అల్యూమినియం వర్క్, సన్గ్లాస్ వర్క్ చేయు నందు నిపుణులు. కుమారుడు వెంకటేష్కు భీమవరం వాస్తవ్యులు నందిగం శ్రీనివాసరావు గారి ద్వితీయ కుమార్తె మౌనికతో వివాహము.

యకమా కృష్ణారావు గారి ద్వితీయ కుమారుడు యకమా కోటేశ్వరరావు వీరు వడ్రంగి పని యందు నిపుణులు. వీరు గుంటూరుకు చెందిన అమరావతి పెద్ద సుబ్రమణ్యంగారి ద్వితీయ కుమార్తె విజయదుర్గతో వివాహము. వీరికి ఒక కుమారుడు. ఒక కుమార్తె.

యకమా కృష్ణారావు గారి ప్రథమ పుత్రిక సీతమ్మ. వీరు నెల్లూరుకు చెందిన నందిగం కృష్ణయ్య గారితో వివాహము. వీరు వాయిద్య పరికరములు తయారు చేసెడివారు. వీరికి ఇద్దరు కుమారులు. ఒక కుమార్తె అన్నపూర్ణ.

యకమా కృష్ణారావు గారి ద్వితీయ పుత్రిక రత్నమ్మ. వీరు నెల్లూరు జిల్లా వరిగొండకు చెందిన రామమూర్తి గారితో వివాహము. వీరు బియ్యం వ్యాపారం చేసెడివారు. వీరికి ఇద్దరు కుమారులు. ఒక కుమార్తె.

యకమా కృష్ణారావు గారి తృతీయ కుమార్తె లక్ష్మి. వీరు నెల్లూరుకు చెందిన వెల్లాల సుధాకర్ గారితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు. ఇద్దరు కుమార్తెలు లావణ్య, పద్మ.

**యకమా కోటయ్య గారు వీరి ధర్మపత్ని రత్నమ్మ గార్ల ఆరవ కుమారుడు యకమా సుబ్బరామాంజనేయులు గారు (సుబ్బారావు) వీరు గుంటూరు, సాంబశివపేటకు చెందిన అమరావతి దాసయ్య, ఆదెమ్మ గార్ల మూడవ కుమార్తె వెంకట సుబ్బమ్మ గారితో వివాహము.** యకమా సుబ్బరామాంజనేయులు గారు (సుబ్బారావు) చిలకలూరిపేట నందు ఐ.యల్.టి.డి. కంపెనీ నందు ఉద్యోగము. వీరికి ఒక కుమార్తె. ఇద్దరు కుమారులు.

వీరి ఏకైక కుమార్తె కోటిరత్నం గారిని జమ్ములమడుగుకు చెందిన చిట్టివేలి ఆంజనేయులు గారి ప్రథమ కుమారుడు జనార్ధన్రావు గారితో వివాహము. వీరు

సింగరేణి కాలరీస్, రామగుండం నందు ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా పనిచేసి రిటైర్ అయినారు. వీరికి ముగ్గురు కుమారులు. హైదరాబాద్ నందు స్థిర నివాసము.

చిట్టివేలు జనార్ధన్ గారి ప్రథమ కుమారుడు వెంకట నాగ కమల్ కుమార్. వీరు టాటా సంస్థ నందు ఉద్యోగము చేయుచున్నారు. కమల్ కుమార్ హైదరాబాద్‌కు చెందిన అమరావతి రామకృష్ణారావు గారి ఏకైక కుమార్తె విష్ణుప్రియతో వివాహము. సెంట్రల్ పబ్లిక్ స్కూల్ నందు టీచర్‌గా ఉద్యోగము చేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు వివేక్. హైదరాబాద్ నందు స్థిర నివాసము.

చిట్టివేలి జనార్ధన్ గారి ద్వితీయ కుమారుడు కళ్యాణ్ భరత్ కుమార్. వీరు నూజివీడులో ఫైనాన్స్ వ్యాపారం చేయుచున్నారు. వీరు నూజివీడుకు చెందిన వెల్లాల వెంకయ్య గారి కనిష్ఠ పుత్రిక సాయిసుధతో వివాహము. వీరు గవర్నమెంట్ స్కూల్ నందు టీచరుగా పనిచేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు మనీష్ వర్మ.

చిట్టివేలి జనార్ధన్ గారి తృతీయ కుమారుడు కపిల్ కుమార్. వీరు హైదరాబాద్ నందు ఉద్యోగము చేయుచున్నారు. వీరు నెల్లూరుకు చెందిన మగతాల లక్ష్మీనారాయణ గారి కుమార్తె నీలిమతో వివాహము.

యకమా సుబ్బరామాంజనేయులు గారి ప్రథమ పుత్రుడు వెంకట కోటేశ్వరరావు గారు. వీరు చిలకలూరిపేట, మున్సిపల్ ఆఫీసు నందు ఉద్యోగము. వీరు ప్రకాశం జిల్లా కంభంకు చెందిన కామరౌతు చిన్న సంజీవయ్య గారి రెండవ కుమార్తె అరుణ కుమారితో వివాహము. వీరి ఏకైక కుమార్తె సూర్యఉష. ఈమెను చిన్న సంజీవయ్య గారి మూడవ కుమారుడు పవన్ కుమార్‌తో వివాహము. వీరికి ఒక కుమార్తె ఆరాధ్య.

యకమా సుబ్బరామాంజనేయులు గారి ద్వితీయ పుత్రుడు వెంకట నాగేశ్వరరావు (నాగరాజు). వీరు సెంట్రల్ గవర్నమెంట్ సంస్థ టుబాకో బోర్డు నందు ఉద్యోగము. గుంటూరు స్థిర నివాసము. వీరు గుంటూరు సాలిపేటకు చెందిన మగతాల హనుమంతరావు–పుష్పావతమ్మ గార్ల నాల్గవ కుమార్తె ఇందిరాదేవితో వివాహము. వీరు గవర్నమంట్ హైస్కూల్ నందు టీచరుగా ఉద్యోగము. వీరికి ఇద్దరు కుమారులు యకమా భవానీ శంకర్, యకమా భానుప్రకాష్.

**యకమా కోటయ్య గారు వీరి ధర్మపత్ని రత్నమ్మ గార్ల ప్రథమ కుమార్తె కోటమ్మ. వీరికి ప్రకాశం జిల్లా పల్లామిల్లా (గడియపూడి) అను గ్రామమునకు**

Page No.
30



**చెందిన నందిగం రోశయ్య గారితో వివాహము.** రోశయ్య గారు గుంటూరు నందే నివాసము. వీరు వడ్రంగి పని, దేవాలయ వాహనముల పని, దేవతా విగ్రహముల చెక్కుడు పని (శీర్ణముల పని) యందు నిపుణులు. వీరికి నల్గురు ఆడ సంతానము.

వీరి ప్రథమ కుమార్తె పెద్దకోటేశ్వరమ్మను గుంటూరుకు చెందిన యకమా కృష్ణారావు గారితో వివాహము.

రెండవ కుమార్తె లక్ష్మమ్మ. వీరు గుంటూరుకు చెందిన కనిగిరి అప్పయ్య గారితో వివాహము. వీరు పోస్టల్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగము. లక్ష్మమ్మ గారు చిన్న వయస్సు నందే మరణించిరి. వీరికి ఒక కుమారుడు కనిగిరి హరనాథ్.

మూడవ కుమార్తె పద్మావతి. వీరు తమ బావగారైన కనిగిరి అప్పయ్య గారితో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు దుర్గామల్లేశ్వరరరావు, కామేశ్వరరావు. భవానీ శంకర్. మగ్గురు కుమార్తెలు లక్ష్మి సౌభాగ్యవల్లి, వెంకట రమణ, కోటిరత్నం.

నాల్గవ కుమార్తె రాముడు. ఈమెను కర్నూలు జిల్లా, నొస్సం గ్రామము నకు చెందిన అమరావతి రామకృష్ణతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు గోపినాథ్, రఘు. ఇద్దరు కుమార్తెలు రమాదేవి, హరిప్రియ.

**యకమా కోటయ్య గారు వీరి ధర్మపత్ని రత్నమ్మ గార్ల రెండవ కుమార్తె చిన్న మహాలక్ష్మమ్మ. వీరిని గుంటూరు, సాంబశివపేట వాస్తవ్యులు నందిగం రామకోటయ్యగారితో వివాహము.** వీరికి సంతానము లేదు. వీరు వడ్రంగి పని చేసెడివారు. చిన్నమహాలక్ష్మమ్మ గారి అక్క కుమార్తె గారైన పద్మావతి గారి సంతానమును చేరదీసి వివాహములు చేసి వారి వద్దనే తమ శేష జీవితము గడిపిరి.

*యకమా వెంకటస్వామి వారి సతీమణి సీతామహాలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమారుడు యకమా కోటయ్య వీరి ధర్మపత్ని రత్నమ్మ గార్ల సంతాన వివరములు ఇంత వరకు తెలియజేయడమైనది.*

**(3) యకమా వెంకటస్వామి వారి సతీమణి సీతామహాలక్ష్మమ్మ గార్లు తృతీయ కుమారుడు యకమా వెంకయ్య. వీరి ధర్మపత్ని సుబ్బమ్మ గార్లు.** (సుబ్బమ్మగారు పాణెంవారి ఆడపడుచు, స్వస్థలము నరసరావుపేట. వీరి తల్లిదండ్రులు నరసరావుపేట జమీలో పనిచేసిరి. సుబ్బమ్మగారికి ఒక్కడే సోదరుడు ఏడుకొండలు. వీరు చిన్న వయస్సు నందే ఉత్తర భారతమున నైనిటాల్ వరకు వెళ్ళి అనేక వ్యాపారములు చేసి చివరకు అక్కాబావగార్లైన వెంకయ్య, సుబ్బమ్మల వద్ద శేషజీవితము

గడిపిరి. వీరికి వివాహము లేదు.) యకమా వెంకయ్య గారు తర్లుపాడు నుండి పురుషోత్తమపట్నం మరియు అచట నుండి గుంటూరు, రైలుపేటకు వలస వచ్చి ఆర్యక్షత్రియ వీధి స్థాపించి అక్కడే స్థిరపడ్డారు. వీరు దేవాలయ గాలిగోపురములు, ఇత్తడితో మకర తోరణములు మరియు కొయ్యతో రథములు, దేవతా మూర్తులు, ధ్వజ స్తంభములు, బొల్లి ఆవులు, కావిడి పెట్టెలు, బొమ్మల పెట్టెలు చేయుచుండెడివారు. వీరికి ముగ్గురు కుమారులు నారాయణరావు, వెంకటస్వామి, ఆంజనేయులు. ముగ్గురు కుమార్తెలు మహాలక్ష్మమ్మ, ఆదెమ్మ, నారాయణమ్మ.

**యకమా వెంకయ్యగారి పెద్ద కుమారుడు యకమా నారాయణరావు గారు.** వీరు తండ్రి గారి వద్దనే వడ్రంగి పని నేర్చుకొని తదుపరి గ్రామ్‌ఫోన్ పెట్టెలు తయారు చేసెడివారు. ఈ గ్రామఫోన్‌కు సంబంధించిన మెకానికల్ మిషన్లు బొంబే నుండి తెప్పించి అసెంబుల్‌చేసి తాను తయారు చేసిన గ్రామ్‌ఫోన్ కొయ్య పెట్టెకు అమర్చి వాటిని గుంటూరులో అమ్మెడివారు. వీరు కొండపల్లి ఖిల్లాలో పనిచేయు మలకపాటివారి గోపయ్య గారి రెండవ కుమార్తె బాపనమ్మ గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు మధుసూధనరావు, ఒక కుమార్తె సత్యనారాయణమ్మ. నారాయణరావుగారు చిన్న వయస్సునందే మరణించినారు. నారాయణరావుగారి సంతానాన్ని వారి తమ్ములైన యకమా వెంకటస్వామి, ఆంజనేయులుగార్లు పెంచి పెద్ద చేశారు.

**యకమా నారాయణరావు గారి కుమారుడైన యకమా వెంకట మధుసూధనరావు** గారు తెనాలి నందు ఏనిమల్ హస్బెండరీ కోర్సునందు పాసై వెటర్నరీ కాంపౌండర్‌గా ఉద్యోగము గవర్నమెంట్ ఉద్యోగము చేశారు. వీరు నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డిపాలెంకు చెందిన కామరాజు చిన్న చెంచయ్యగారి కుమార్తె సుబ్బమ్మ గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు, ముగ్గురు కుమార్తెలు.

**యకమా వెంకట మధుసూధనరావుగారి కుమారుడు యకమా వెంకట నారాయణరాజు.** వీరు స్టేట్ బ్యాంక్ ఆఫీసరుగా ఉద్యోగము చేయుచున్నారు. వీరు నెల్లూరుకు చెందిన టేకుమళ్ళవారి శ్యామలతో వివాహము. వీరికి ఒక కుమార్తె.

**యకమా వెంకట మధుసూధనరావుగారి ప్రథమ కుమార్తె శివకుమారి**ని గుంటూరు, వల్లూరువారితోటకు చెందిన వీరభద్ర శివనాగయ్యగారి నాల్గవ కుమారుడు నాగయ్యతో వివాహము. వీరికి ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు.

**యకమా వెంకట మధుసూధనరావుగారి ద్వితీయ కుమార్తె సుధాలక్ష్మి (లక్ష్మి)**ని కడపకు చెందిన చిత్తూరు చినభద్రయ్య గారి కుమారుడు సుధాకర్‌తో

**Page No.**
**31**



వివాహము. వీరు ఆటోమోబైల్ రంగము నందు వ్యాపారం చేయుచున్నారు శ్రీలక్ష్మి కడప నందు గవర్నమెంట్ టీచరుగా పనిచేస్తున్నారు. వీరికి ఒక కుమార్తె సాయి. కుమారుడు గంగా.

**యకమా వెంకట మధుసూధనరావుగారి తృతీయ కుమార్తె పద్మావతి**ని గుంటూరు, శ్రీనగర్‌కు చెందిన వెల్లాల లక్ష్మీనరసయ్య, సత్యనారాయణమ్మ గార్ల రెండవ కుమారుడు శ్రీనివాసరావుతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు. లక్ష్మీకాంత్, లక్ష్మీకిరణ్ కుమార్. పెద్ద కుమారుడు లక్ష్మీకాంత్ నెల్లూరుకు చెందిన సాయిసుప్రియతో వివాహము. ఇతడు గూడూరు నందు ఉద్యోగము చేయుచున్నాడు.

**యకమా నారాయణరావు గారి కుమార్తె సత్యనారాయణమ్మ. వీరిని నెల్లూరుకు చెందిన వెల్లాల లక్ష్మీనరసయ్య గారితో వివాహము.** వివాహము తదుపరి వీరు గుంటూరు నందే కార్పెంటరీ మేస్త్రిగా స్థిర నివాసము. వీరికి ఒక కుమార్తె, ముగ్గురు కుమారులు.

కుమార్తె రాజ్యలక్ష్మిను కృష్ణా జిల్లా నూజివీడుకు చెందిన వరాటి గోపయ్య–శేషారత్నంల మూడవ కుమారుడు వరాటి ఆంజనేయులు గారితో వివాహము. వరాటి ఆంజనేయులు గారు సొంత టాక్సీని నడిపేవారు. వీరికి ఇద్దరు కుమారులు. వరాటి బాలాకుమార్, వరాటి బాలాజీ.

వరాటి బాలకుమార్ నూజివీడుకు చెందిన కాళహస్తి నాగేశ్వరరావు గారి కుమార్తె అనితతో వివాహము. వీరికి ఒక కుమార్తె.

వరాటి బాలాజీకి గుంటూరు, కొరిటెపాడు వాస్తవ్యులు కాళహస్తి సురేష్, శ్రీదేవి గారి ప్రథమ కుమార్తె శైలజతో వివాహము. వీరికి ఒక కుమారుడు. బాలాజీ హైదరాబాద్ నందు ఉద్యోగము. వీరికి ఒక కుమార్తె, కుమారుడు.

**వెల్లాల సత్యనారాయణమ్మ, లక్ష్మీనరసయ్య గార్ల ప్రథమ పుత్రుడు వెంకటేశ్వరరావు గారు.** వీరు గుంటూరు నందే వడ్రంగి పనిచేయుచూ తదుపరి రైలుపేట ఆర్యక్షత్రియవీధి కాపురస్తులు యకమా కోటేశ్వరరావు గారి రెండవ కుమార్తె దేవమణితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు విజయలక్ష్మి, వెంకటలక్ష్మి.

వెల్లాల వెంకటేశ్వరరావు, దేవమణి గారి ప్రథమ పుత్రిక విజయలక్ష్మిని గుంటూరు వాస్తవ్యులు కామఋషి అప్పారావుగారి రెండవ కుమారుడు హరినాగ వెంకట సుబ్రమణ్యం గారితో వివాహము. వీరు నరసరావుపేట గవర్నమెంట్ హైస్కూల్ నందు మాస్టర్‌గా జాబ్ చేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు జ్ఞాన వెంకట ఫణీంద్ర కుమార్, కుమార్తె మేఘన.

వెల్లాల వెంకటేశ్వరరావు, దేవమణి గార్ల రెండవ కుమార్తె లక్ష్మికుమారిని నరసరావుపేట, రావిపాడు వాస్తవ్యులు మద్దినేని లక్ష్మీనారాయణ, బుల్లెమ్మాయి గార్ల కుమారుడు ప్రవీణ్‌కుమార్‌తో వివాహము.

**వెల్లాల సత్యనారాయణమ్మ, లక్ష్మీనరసయ్య గారి ద్వితీయ కుమారుడు వెల్లాల శ్రీనివాసరావు గారు.** వీరు గుంటూరు, వల్లూరివారితోటకు చెందిన యకమా వెంకట మధుసూదనరావు గారి తృతీయ కుమార్తె పద్మావతితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు శ్రీకాంత్, కిరణ్‌కుమార్.

**వెల్లాల సత్యనారాయణమ్మ, లక్ష్మీనరసయ్య గారి తృతీయ కుమారుడు వెల్లాల సుధాకర్ గారు.** వీరు సెంట్రల్ గవర్నమెంట్ జాబ్ చేయుచూ జమ్మూనందు ఉద్యోగము చేయుచున్నారు. వీరు కడపకు చెందిన చిత్తారి నారాయణ, లక్ష్మీదేవమ్మ గార్ల కుమార్తె అనూరాధతో వివాహము. వీరికి ఇరువురు కుమారులు.

**యకమా వెంకయ్య, సుబ్బమ్మ గార్లకు ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. వీరి సంస్థానములో ముఖ్యులు యకమా వెంకటస్వామి గారు.** వీరు చిన్నతనము నందే తండ్రిగారి వృద్ధాప్యము, అన్నగారు నారాయణగారి మరణము వలన కుటుంబ భారమంతయు వీరే నిర్వర్తించిరి. కార్పెంటరీ వర్క్‌లో మంచి ప్రావీణ్యము సంపాదించి, తమ అక్క అమరావతి ఆదిలక్ష్మమ్మ (అదెమ్మ), దాసయ్య గార్ల ప్రథమ పుత్రిక పెద్ద నాగలక్ష్మమ్మతో వివాహము.

వీరు గుంటూరు నగరము నందు మూసపనిని (సెంట్రింగ్ వర్క్) ప్రప్రథముగా మొదలుపెట్టిరి. వీరు బొంబాయి వెళ్ళి అక్కడి పనులలో మెళకువలు నేర్చుకొని వచ్చిరి. వీరు హైదరాబాద్, బలార్షా, శ్రీశైల దేవస్థానము నందు పనులు చేసిరి. 1935 నుండి 1980 వరకు ఈ రంగమందు ప్రసిద్ధిగాంచిరి. వీరి వద్ద రోజువారీ వేతనములతో వడ్రండి మేస్త్రీలు, హెల్పర్లు, పేయింటర్లు, పాలీష్‌పనివారు సుమారుగా 60 మందికి రోజు పని కల్పించెడివారు. వీరు గుంటూరు నగరము నందు ఉమెన్స్ కాలేజి, మెడికల్ కాలేజి, అమరావతి రోడ్డు నందు గలన మెన్స్ హాస్టల్స్‌కు కార్పెంటరీ వర్క్ చేసిరి. గుంటూరు నగరములో అనేక బంగళాలు, గవర్నమెంట్ హాస్పిటల్, వెంకటేశ్వర కళ్యాణ మండపము, విజ్ఞాన మందిరము మరియు పలు హాస్పిటల్స్‌కు సెంట్రింగ్‌ను సమకూర్చిరి తదుపరి గుంటూరు నందు 1 టౌన్ – 2 టౌన్‌ను కలిపే ప్రధాన రహదారి అయిన ఓవర్ బ్రిడ్జిని మండవ లక్ష్మయ్య గారు కాంట్రాక్ట్ చేయగా వారి దగ్గర సెంట్రింగ్ పనిని వెంకటస్వామిగారు, రాడ్ బెండింగ్ పనిని ఆకుల సత్యన్నారాయణ గారు కలసి ఈ బృహత్ కార్యక్రమమును



నిర్వహించిరి. 60 సంవత్సరములు ఏకధాటిగా జిల్లాలో ప్రసిద్ధి గాంచిరి. తదుపరి నాగార్జునసాగర్ లెఫ్ట్ & రైట్ కెనాల్స్‌కు మధ్యలోగల 'చప్టా'లు (చిన్న వంతెనలు) కాంట్రాక్ట్ చేశారు. ఎంతో మందిని కార్పెంటరీ, సెంట్రింగ్ పని నందు నిష్ణాతులుగా తయారు చేశారు. ప్రస్తుతము ఉన్న సీనియర్ మేస్త్రీలలో చాలామంది ఈయన శిష్యులే. నాటి రోజులలో గుంటూరు నందు మన వంశస్తులవి 60 కుటుంబాలు ఉండెడివి. వీరు గుంటూరు సిటీ కార్పెంటరీ యూనియన్ స్థాపకులలో ఒకరు. ఈయన ఒక మంచి మేస్త్రీగా, నిరాడంబరునిగా గుంటూరు నందు చిరస్థాయిగా నిలిచారు.

**యకమా వెంకటస్వామి గారికి ఇద్దరు కుమారులు యకమా వెంకట సుబ్రమణ్యదాసు, యకమా నాగేశ్వరరావు. ఒక కుమార్తె నాగమణి.**

**యకమా వెంకటస్వామి గారి ప్రథమ కుమారుడైన వెంకట సుబ్రమణ్య దాసు** పాలిటెక్నిక్ కోర్సు (యల్.ఎం.ఇ.) పాసై కొలది కాలం మాత్రమే నాగార్జున సాగర్ నందు సివిల్ ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంట్ నందు జాబ్ చేసి తదుపరి గుంటూరు నందు పెస్టిసైడ్స్ వ్యాపారం నిర్వహించారు. వీరు కర్నూలు, జిల్లా, నొస్సంకు చెందిన అమరావతి గోవిందప్ప,లక్ష్మిందేవి గార్ల నాల్గవ కుమార్తె విజయమ్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు. ఒక కుమార్తె. యకమా వెంకట సుబ్రమణ్యదాసు 29 సం॥ల వయస్సు నందే మోటార్ సైకిల్ యాక్సిడెంట్‌లో దివంగతులైరి. చిన్నవయస్సులో కుమారుని మరణం వలన వెంకటస్వామిగారు చాలా దిగులు చెందారు. తదుపరి వెంకటస్వామిగారు తన చివరి రోజుల వరకు పెద్ద కుమారుని సంసార బాధ్యతలు, చదువులు అన్నీ వీరే బాధ్యత వహించారు.

**యకమా వెంకట సుబ్రమణ్యదాసుగారి ప్రథమ కుమారుడు యకమా నాగ సురేష్, ద్వితీయ కుమారుడు యకమా ఫణి కుమార్, కుమార్తె బాలభారతి.**

యకమా నాగసురేష్ గారు నూజివీడుకు చెందిన నాంపల్లి చిన్నసత్యం గారి (ఐస్ కంపెని) రెండవ కుమార్తె సుజాతతో వివాహము. వీరికి ఒక కుమారుడు యకమా సూర్యదేవ్ వర్మ.

యకమా వెంకట సుబ్రమణ్యదాస్ గారి రెండవ కుమారుడు ఫణి కుమార్. వీరు ఐ.టి.ఐ. పాసై బెంగుళూరు, వైజాగ్ నందు పనిచేశారు. వీరు తన మేనత్త – మామ గారైన వీరభద్ర నాగమణి, శేషయ్య గార్ల ద్వితీయ కుమార్తె బాలసుధారాణితో వివాహము. వీరికి ఒక కుమారుడు సాయికృష్ణ జయంత్ వర్మ. ఫణి కుమార్ ప్రస్తుతం చెన్నై నందు సామ్‌సాంగ్ కంపెనీలో పనిచేయుచున్నారు.

యకమా వెంకట సుబ్రమణ్యదాస్ గారి కుమార్తె బాలభారతి. ఈమెను కర్నూలుజిల్లా, నొస్సం గ్రామానికి చెందిన అమరావతి మనోహర్, సావిత్రి గార్ల కుమారుడు రాజగోపాల్‌వర్మ గారితో వివాహము. వీరు రాజస్తాన్-ఢిల్లీ బోర్డర్స్‌లో మైన్స్‌నందు పనిచేయుచున్నారు. బాలభారతి అక్కడి స్కూల్ నందు టీచర్‌గా పని చేయుచున్నది. వీరికి ఒక కుమారుడు రమేష్, ఒక కుమార్తె సాయి జాగృతి.

**యకమా వెంకటస్వామి, పెద నాగలక్ష్మమ్మ గార్ల ఏకైక కుమార్తె నాగమణి. వీరిని గుంటూరుకు చెందిన వీరభద్ర పెద శివనాగయ్య గారి తృతీయ కుమారుడు శేషయ్యతో వివాహము.** వీరు గుంటూరు నందే హోల్‌సేల్ మెడికల్ వ్యాపారము నిర్వహించారు. వీరభద్ర శేషయ్యగారి భార్య నాగమణి. వీరికి ఇరువురు కుమార్తెలు వెంకట నాగ మాలతి, బాలసుధారాణి.

వీరభద్ర శేషయ్యగారి ప్రథమ పుత్రిక వెంకట నాగ మాలతిని కృష్ణా జిల్లా, నూజీవీడుకు చెందిన వరాటి వెంకట సుబ్రమణ్యం-భారతి గార్ల ద్వితీయ కుమారుడు ఉమామహేశ్వరతో వివాహము. వీరు బెంగుళూరు 'టెక్ మహేంద్ర' సంస్థ యందు ఉద్యోగము. వెంకట నాగ మాలతి బెంగుళూరు నందు లెక్చరర్‌గా పనిచేయు చున్నారు. వీరికి ఒక కుమార్తె వరాటి గోపిక. వీరి స్థిర నివాసము బెంగుళూరు.

వీరభద్ర శేషయ్య గారి ద్వితీయ కుమార్తె బాలసుధారాణిని గుంటూరుకు చెందిన యకమా వెంకట సుబ్రమణ్యదాసుగారి ద్వితీయ కుమారుడు ఫణి కుమార్‌తో వివాహము. వీరు చెన్నై 'సామ్‌సంగ్' నందు ఉద్యోగము. వీరికి ఒక కుమారుడు యకమా సాయికృష్ణ జయంత్ వర్మ. ప్రస్తుతం చెన్నై నివాసం.

**యకమా వెంకటస్వామి, పెద నాగలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమారుడు నాగేశ్వరరావు.** వీరు గుంటూరు, వల్లూరివారితోట యందు స్థిర నివాసము. గుంటూరు నందు గ్రాఫిక్ యాడ్ డిజైనర్‌గా పనిచేయుచున్నారు. **వీరు గుంటూరు, సాలిపేటకు చెందిన మగతాల హనుమంతరావు, పుష్పావతమ్మ గార్ల కనిష్ఠ పుత్రిక విజయలక్ష్మి గార్లతో వివాహము.** వీరికి ఒక కుమారుడు రాజా ప్రశాంత్, కుమార్తె యామిని ప్రశాంతి.

**యకమా వెంకయ్య, సుబ్బమ్మ గార్లకు ద్వితీయ కుమారుడు ఆంజనేయులు గారు.** వీరు తమ అక్కా బావగారైన వీరభద్ర నారాయణమ్మ, పెద శివనాగయ్య గారి కుమార్తె అనసూయమ్మ గారితో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు వెంకట నాగేశ్వరరావు, వెంకట నారాయణరావు, వెంకట శ్రీనివాసరావు, కుమార్తె





పద్మావతి. యకమా ఆంజనేయులు గారు తమ తండ్రిగారి నివాసమైన రైలుపేట ఆర్యక్షత్రియవీధి నందుగల తన స్వగృహములోనే కార్పెంటరీ పని చేయుచూ ఎంతో మందికి కార్పెంటరీ పని నేర్పి ప్రయోజకులను చేసిరి.

**వీరి కుమారులలో ప్రథముడైన వెంకట నాగేశ్వరరావు ఇండియన్ బ్యాంక్ నందు ఉద్యోగము.** వీరు ప్రకాశం జిల్లా, కంభంకు చెందిన కామరాజు చిన సంజీవయ్య-శశమ్మ గార్ల ప్రథమ కుమార్తె అనంతలక్ష్మిగారితో వివాహము. వీరికి ఒక కుమారుడు నవీన్ కుమార్, కుమార్తె రమాదేవి. నవీన్ కుమార్ యాక్సిస్ బ్యాంక్ నందు హైదరాబాద్‌లో ఉద్యోగము. వీరు కర్నూలుకు చెందిన చిత్తారి కందుకూరి సత్యనారాయణ రాజు (రిటైర్డ్-డిప్యూటీ తహసిల్దార్) వారి కుమార్తె అర్చనతో వివాహము. వీరు హైదరాబాద్ నందు లెక్చరర్‌గా పనిచేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు గౌతమ్ ఆదిత్య వర్మ. యకమా నవీన్ కుమార్ హైదరాబాద్ నందే స్థిర నివాసము.

యకమా వెంకట నాగేశ్వరరావుగారి కుమార్తె రమాదేవిని కర్ణాటక రాష్ట్రము నందు సిరికుప్ప గ్రామమునకు చెందిన మగతాల శ్రీనివాసరావు గారితో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు విజయసింహవర్మ, సుజిత్ వర్మ, విద్యాసాగర్ వర్మ.

**యకమా ఆంజనేయులు గారి ద్వితీయ కుమారుడు యకమా వెంకట నారాయణరావు.** వీరు గుంటూరు నందు మెడికల్ షాపు నిర్వహించారు. వీరు తమ మేనమామగారైన వీరభద్ర సాంబయ్య, కామాక్షమ్మ గార్ల ప్రథమ పుత్రిక శివనాగమణితో వివాహము. వీరికి ఒక కుమారుడు వెంకట భార్గవ్ అవినాష్. వీరు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రెవెన్యూ డెవలప్‌మెంట్ కన్సల్‌టెంట్‌గా పనిచేయు చున్నారు. కుమార్తె నాగ భవ్య (జ్యోతి). వెంకట నారాయణ రావు గారు చిన్న వయస్సు నందే మరణించిరి. వీరి కుమార్తె డా॥ భవ్యను కృష్ణా జిల్లా, సానా రుద్రవరంకు చెందిన మారుబోయిన వెంకట సత్యనారాయణ, విమలాదేవి గార్ల ఏకైక కుమారుడు డా॥ సుధీర్‌తో వివాహము. వీరు కలిదిండి నందు డెంటల్ క్లినిక్‌ను నిర్వహిస్తున్నారు.

**యకమా ఆంజనేయులు గారి తృతీయ కుమారుడు యకమా వెంకట శ్రీనివాసరావు.** వీరు గుంటూరు నందు ప్రముఖ ఆసుపత్రి యందు ఎకౌంటెంట్‌గా పనిచేయుచున్నారు. వీరు కర్నూలు జిల్లా, నొస్సం గ్రామమునకు చెందిన చిత్తారి అమరావతి చిన రంగయ్యగారి ద్వితీయ కుమార్తె వాణితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు రవితేజ, ఆనంద్ కుమార్ వర్మ.

**యకమా ఆంజనేయులు, అనసూయమ్మ గార్ల కుమార్తె పద్మావతి. వీరు వీరభద్ర పెద శివనాగయ్య, నారాయణమ్మ గార్ల ద్వితీయ కుమారుడు శంకర్రావుతో వివాహము.** వీరు తమ మేనమామ గారి వద్ద పని నేర్చుకొని తదుపరి సొంతముగా గుంటూరు నగరంలో కార్పెంటరీ పనులు విశేషముగా చేసిరి. కార్పెంటరీ యూనియన్ బిల్డింగ్ స్థాపనకు విశేషముగా కృషి చేసిరి. వీరికి ఇరువురు కుమారులు శివ మోహన్ రావు, కిరణ్ కుమార్. కుమార్తె నాగ శాంతి.

వీరభద్ర శంకర్రావు, పద్మావతి గార్ల పెద్ద కుమారుడు శివమోహన్ రావుకు కర్నూలు జిల్లా, రుద్రవరం గ్రామ వాస్తవ్యులు మాచరౌతు నాగేంద్రం, శశికళావతమ్మల పెద్ద కుమార్తె నిర్మలాదేవితో వివాహము. వీరికి ఒక కుమారుడు మధుసాయి మనోజ్, కుమార్తె తన్మయి.

వీరభద్ర శంకర్రావు, పద్మావతి గార్ల రెండవ కుమారుడు కిరణ్ కుమార్‌కు నూజివీడు వాస్తవ్యులు వరాటి రాధాకృష్ణ, మణిమాల గార్ల ప్రథమ పుత్రిక రేణుకాదేవితో వివాహము.

వీరభద్ర శంకర్రావు, పద్మావతి గార్ల ఏకైక కుమార్తె నాగశాంతిని నొస్సం వాస్తవ్యులు మాచరౌతు సుబ్రమణ్యం, రాజ్యలక్ష్మి గార్ల రెండవ కుమారుడు రామ్మోహన్ వర్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె సుమప్రియ.

**యకమా వెంకయ్య గారు వీరి ధర్మపత్ని సుబ్బమ్మ గారి పెద్ద కుమార్తె ఆదెమ్మ గారు.** వీరు కర్నూలు జిల్లా, నొస్సం గ్రామమునకు చెందిన అమరావతి దాసయ్య గారితో వివాహము. తదుపరి గుంటూరు, సాంబశివపేటకు వచ్చి కార్పెంటరీ పనిలో పేరు గాంచిరి. వీరికి ముగ్గురు కుమార్తెలు పెదనాగలక్ష్మమ్మ, చిన నాగలక్ష్మమ్మ, వెంకట సుబ్బమ్మ గార్లు.

**అమరావతి దాసయ్య గారి ప్రథమ పుత్రిక పెద నాగలక్ష్మమ్మ గారిని గుంటూరు, రైలుపేట, ఆర్యక్షత్రియ వీధికి చెందిన యకమా వెంకయ్య గారి ద్వితీయ కుమారుడు వెంకటస్వామి గారితో వివాహము.** వెంకటస్వామిగారు గుంటూరు నగరమందు పెక్కు భవన నిర్మాణములు, ఉమెన్స్ కాలేజి, మెడికల్ కాలేజి, గుంటూరు ఓవర్ బ్రిడ్జి మొదలగు పెద్ద పెద్ద పనులు నిర్వహించి జిల్లాలో అగ్రగామి కాంట్రాక్టర్‌గా ప్రఖ్యాతి గాంచిరి. వీరికి ఇద్దరు కుమారులు వెంకట సుబ్రమణ్యదాసు, నాగేశ్వరరావు. కుమార్తె నాగమణి.

**అమరావతి దాసయ్య గారి ద్వితీయ పుత్రిక చిన నాగలక్ష్మమ్మ గారిని కర్నూలు జిల్లా, రుద్రవరం గ్రామమునకు చెందిన వీరభద్ర చిన శేషయ్య గారి**

Page No. 34



**కుమారుడు చిన శివనాగయ్య గారితో వివాహము.** వివాహానంతరము తన మామాగారైన దాసయ్య గారింటికి, గుంటూరుకు ఇల్లరికం వచ్చి ఇక్కడనే కార్పెంటరీ పనులు చేయుచూ, ఎందరికో కార్పెంటరీ విద్య నేర్పిరి. వీరభద్ర చిన శివనాగయ్య గారు గుంటూరు సిటి కార్పెంటరీ యూనియన్‌కు శాశ్విత ట్రెజరర్‌గా సేవ లందించారు. వీరికి ఒక కుమార్తె శివనాగమ్మ. ఇద్దరు కుమారులు శేషసాయిదాస్, నాగరాజు.

**వీరభద్ర చిన శివనాగయ్య గారి కుమార్తె శివనాగమ్మను గుంటూరు, శ్రీనివాసరావుతోట కాపుస్తుడు అమరావతి సుబ్రమణ్యంగారి ఏకైక కుమారుడు సుబ్బారావుతో వివాహము.** వీరు ఇండియన్ బ్యాంకు నందు ఉద్యోగము. వీరికి ఒక కుమార్తె శైలజ. ఇద్దరు కుమారులు నాగ సంజీవ్ కుమార్, వెంకట శ్రీనివాస రాజు (రాజా).

**అమరావతి సుబ్బారావు–శివనాగమ్మ గార్ల పుత్రిక శైలజను తన సొంత తమ్ముడైన శివనాగయ్యగారి రెండవ కుమారుడు నాగరాజుతో వివాహము.** వీరు యల్.ఐ.సి. ఏజంట్‌గా పనిచేయుచున్నారు.

అమరావతి సుబ్బారావు గారి ప్రథమ పుత్రుడు నాగ సంజీవ్ కుమార్‌కు గద్వాల్ పట్టణానికి చెందిన శ్రీవీణతో వివాహము. వీరికి ఒక కుమార్తె వైష్ణవి. కుమారుడు విష్ణువర్మ. అమరావతి సుబ్బారావు గారి రెండవ కుమారుడు వెంకట శ్రీనివాస రాజు (రాజా). వీరు చెన్నైలో మెడికల్ కన్సల్‌టెంట్‌గా పని చేయుచున్నారు. వీరికి నాయుడుపేటకు చెందిన స్వాతితో వివాహము. వీరికి ఒక కుమార్తె సాత్విక.

**వీరభద్ర చిన శివనాగయ్య, చిన నాగలక్ష్మమ్మ గార్ల ప్రథమ కుమారుడు శేషసాయిదాసు గారు.** శేషసాయిదాసుగారు గుంటూరులో ప్రఖ్యాతి గాంచిన లలిత హాస్పిటల్ నందు ఎకౌంట్స్ డిపార్ట్‌నందు జాబ్ నిర్వహిస్తున్నారు. వీరు కర్నూలు జిల్లాకు చెందిన అమరావతి సోమసుందర్, రాజమ్మ గార్ల ప్రథమ పుత్రిక అరుణ కుమారితో వివాహము. వీరి కుమార్తె సింధుర. ఈమె యం.బి.బి.యస్. చదివి వరంగల్‌కు చెందిన వాడపల్లి రమేష్‌బాబు, వెంకట రమణ గార్ల ప్రథమ కుమారుడు బాలాజీతో వివాహము. వీరు హైదరాబాద్‌లో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్నారు.

**వీరభద్ర చిన శివనాగయ్య, చిన నాగలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమారుడు నాగరాజు.** వీరు గుంటూరు నగరము నందు యల్.ఐ.సి. ఏజంట్‌గా ప్రఖ్యాతి గాంచారు. వీరు తమ అక్క,బావగార్ల కుమార్తె శైలజతో వివాహము. గుంటూరు వీరి స్థిర నివాసము.

**అమరావతి దాసయ్య గారి తృతీయ కుమార్తె వెంకట సుబ్బమ్మగారు. వీరు చిలకలూరిపేటకు చెందిన యకమా కోటయ్య–రత్నమ్మ గార్ల ఆరవ కుమారుడు సుబ్బరామాంజనేయులు గారితో వివాహము.** వీరు ఐ.యల్.టి.డి., చిలకలూరిపేట యందు ఉద్యోగము. వీరికి ఒక కుమార్తె కోటిరత్నం. ఇద్దరు కుమారులు వెంకట కోటేశ్వరరావు, వెంకట నాగేశ్వరరావు.

**యకమా వెంకయ్య, సుబ్బమ్మగార్ల ద్వితీయ కుమార్తె నారాయణమ్మ గారు. వీరు కర్నూలు జిల్లా రుద్రవరంకు చెందిన వీరభద్ర పెద్ద శేషయ్య, సుబ్బమ్మ గార్ల ఏకైక కుమారుడు పెద్ద శివనాగయ్యగారితో వివాహము.** వీరు రుద్రవరం గ్రామములో బంగారుపని చేసెడివారు. తదుపరి బావమరుదులైన యకమా వెంకటస్వామి, ఆంజనేయుగార్ల ప్రోత్సాహముతో కుటుంబముతో సహా గుంటూరు తరలి వచ్చిరి. వీరికి ఒక కుమార్తె అనసూయమ్మ. నల్గురు కుమారులు సాంబయ్య, శంకర్రావు, శేషయ్య, నాగయ్య.

**వీరభద్ర నారాయణమ్మ, పెద్ద శివనాగయ్య గార్ల కుమార్తె అనసూయమ్మను గుంటూరు, రైలుపేట, ఆర్యక్షత్రియవీధికి చెందిన యకమా ఆంజనేయులు గారితో వివాహము.** వీరికి ఒక కుమార్తె పద్మావతి. ముగ్గురు కుమారులు వెంకట నాగేశ్వరరావు, వెంకట నారాయణరావు, వెంకట శ్రీనివాసరావు.

**వీరభద్ర నారాయణమ్మ, పెద్ద శివనాగయ్య గార్ల ప్రథమ కుమారుడు వీరభద్ర సాంబయ్య.** వీరు తమ మేనమామలు వెంకటస్వామి, ఆంజనేయులు గార్ల వద్ద కార్పెంటరీ పని నేర్చుకొని గుంటూరుకు చెందిన అమరావతి వరదరాజులు, లక్ష్మీదేవమ్మ గారి ద్వితీయ కుమార్తె కామాక్షమ్మతో వివాహము. తదుపరి సాంబయ్య గారు స్వంతముగా కార్పెంటరీ పనులు కాంట్రాక్టు చేయుచూ పేరు గాంచిరి. వీరికి ముగ్గురు కుమార్తెలు శివనాగమణి, నాగ సునీత, రోజారమణి. కుమారుడు సురేష్ ఖన్నా.

**వీరభద్ర సాంబయ్య–కామాక్షమ్మ గార్ల ప్రథమ కుమార్తె శివనాగమణిని యకమా ఆంజనేయులు, అనసూయమ్మ గార్ల ద్వితీయ పుత్రుడు వెంకట నారాయణతో వివాహము.** వీరి ఒక కుమార్తె డా॥ భవ్య (డెంటల్ సర్జన్). కుమారుడు అవినాష్ భార్గవ్.

**వీరభద్ర సాంబయ్య–కామాక్షమ్మ గార్ల ద్వితీయ కుమార్తె నాగ సునీతను గుంటూరు, శ్రీనివాసరావుపేటకు చెందిన అమరావతి వరదరాజులు, లక్ష్మీదేవమ్మ**

Page No. 35



**గార్ల కుమారుడు సుబ్బారావుతో వివాహము.** వీరికి ఒక కుమార్తె నాగ వైష్ణవి. కుమారుడు వరుణ్‌రాజ్.

**వీరభద్ర సాంబయ్య–కామాక్షమ్మ గార్ల తృతీయ కుమార్తె రోజారమణి.** వీరు అనంతపురంకు చెందిన చిత్తారి అమరావతి రామకృష్ణ, అమృత గార్ల దత్త కుమారుడు రామచంద్రుడు గారితో వివాహము. వీరు యం.ఇ.చేసి సివిల్ కాంట్రాక్టర్‌గా చేయుచున్నారు. రోజారమణి అనంతపురంలో లైబ్రేరియన్‌గా జాబ్ చేస్తున్నారు. వీరికి ఒక కుమార్తె శ్వేత. కుమారుడు కృష్ణమూర్తి. వీరి స్థిర నివాసము అనంతపురం.

**వీరభద్ర సాంబయ్య–కామాక్షమ్మ గార్ల ఏకైక కుమారుడు సురేష్‌ఖన్నా.** వీరు గుంటూరు ఒక ప్రైవేట్ స్కూల్ నందు జాబ్ చేయుచున్నారు. వీరు గుంటూరు, రైలుపేట, ఆర్యక్షత్రియవీధికి చెందిన యకమా నాగరాజు, లీలావతి గార్ల కుమార్తె పార్వతితో వివాహము. వీరికి ఒక కుమార్తె మానస శ్రీజ. కుమారుడు తేజ.

**వీరభద్ర నారాయణమ్మ, పెద్ద శివనాగయ్య గార్ల ద్వితీయ కుమారుడు వీరభద్ర శంకర్రావు.** వీరు తమ మేనమామలు వెంకటస్వామి, ఆంజనేయులు గార్ల వద్ద కార్పెంటరీ పని నేర్చుకొని తదుపరి యకమా ఆంజేయులు గారి కుమార్తె పద్మావతితో వివాహము. తదుపరి వీరు సొంతముగా పెక్కు గృహములకు షాపులకు, సినిమా హాల్స్‌నకు కార్పెంటరీ వర్క్స్ కాంట్రాక్ట్ పనులు చేయుచూ తోటి వర్కర్స్‌కు తర్ఫీదు నిచ్చి ఎంతో మందికి పని నేర్పిరి. వీరు తన మేనమామ వెంకటస్వామి గారి వలె 40 మంది మేస్త్రీలు, హెల్పర్స్‌తో రోజువారి కార్పెంటరీ పనులు నిర్వహించి జిల్లా నందు ప్రముఖ కార్పెంటరీ మేస్త్రిగా ఖ్యాతి గాంచిరి. వీరు కార్పెంటరీ వర్కర్స్ యూనియన్‌కు విశేష సేవలందించిరి. యూనియన్ భవన నిర్మాణమునకు ఆర్థికముగా సహాయము చేసినారు. వీరికి ఇద్దరు కుమారులు శివమోహన్‌రావు, కిరణ్‌కుమార్. ఒక కుమార్తె నాగ శాంతి.

**వీరభద్ర శంకర్రావు, పద్మావతి గార్ల ప్రథమ కుమారుడు శివమోహన్‌రావు గారు** తండ్రిగారివలెనే కార్పెంటరీ వృత్తి యందు స్థిరపడినారు. వీరు కర్నూలు జిల్లా రుద్రవరంకు చెందిన మాచరౌతు నారేంద్రవర్మ, శశికళమ్మగార్ల ప్రథమ కుమార్తె నిర్మలాదేవితో వివాహము. వీరికి ఒక కుమారుడు మధుసాయి మనోజ్. కుమార్తె తన్మయి.

**వీరభద్ర శంకర్రావు, పద్మావతి గార్ల ద్వితీయ కుమారుడు కిరణ్ కుమార్.** వీరు ఎ.పి.టూరిజం కార్పోరేషన్, అమరావతి యందు ఉద్యోగము. వీరు కృష్ణా

జిల్లా, నూజివీడుకు చెందిన వరాటి రాధాకృష్ణమూర్తి, మణిమాల గార్ల ప్రథమ పుత్రిక రేణుకాదేవితో వివాహము. రేణుకాదేవి గుంటూరు నందు ప్రైవేట్ స్కూల్ నందు టీచరుగా ఉద్యోగము చేయుచున్నారు.

**వీరభద్ర శంకర్రావు, పద్మావతి గార్ల కుమార్తె నాగశాంతి. వీరు కర్నూలు జిల్లా, నొస్సం గ్రామమునకు చెందిన అమరావతి సుబ్రమణ్యం, రాజ్యలక్ష్మి గార్ల ద్వితీయ కుమారుడు రామ్మమోహన్ వర్మగారితో వివాహము.** వీరు హైదరాబాద్ నందు బ్యాంక్ ఆమెరికా నందు సాఫ్ట్‌వేర్ జాబ్ చేయుచున్నారు. వీరికి ఒక కుమార్తె సుమప్రియ. హైదరాబాద్ వీరి స్థిరనివాసము.

**వీరభద్ర పెద్ద శివనాగయ్య, నారాయణమ్మ గార్ల తృతీయ పుత్రుడు వీరభద్ర శేషయ్య. వీరు గుంటూరు వాస్తవ్యులు యకమా వెంకటస్వామి, పెదనాగలక్ష్మమ్మ గార్ల ఏకైక కుమార్తె నాగమణితో వివాహము.** వీరు గుంటూరు నందు హోల్‌సేల్ & రిటైల్ మెడికల్ షాపులు నిర్వహించారు. వీరికి ఇద్దరు కుమార్తెలు వెంకట నాగ మాలతి, బాలసుధారాణి.

**వీరభద్ర శేషయ్య, నాగమణి గార్ల ప్రథమ పుత్రిక వెంకట నాగ మాలతిని కృష్ణా జిల్లా, నూజీవీడుకు చెందిన వరాటి సుబ్రమణ్యం, భారతి గార్ల ద్వితీయ కుమారుడు ఉమామహేశ్వరతో వివాహము.** వీరు టెక్ మహేంద్ర, బెంగుళూరు నందు ఉద్యోగము. వెంకట నాగ మాలతి ఒక ప్రైవేటు కళాశాల యందు లెక్చరర్‌గా ఉద్యోగము. వీరికి ఒక కుమార్తె గోపిక. బెంగుళూరు వీరి స్థిర నివాసము.

**వీరభద్ర శేషయ్య, నాగమణి గార్ల ద్వితీయ బాలసుధారాణి.** ఈమెను కీ॥శే॥ యకమా వెంకట సుబ్రమణ్యం, విజయమ్మ గార్ల ద్వితీయ కుమారుడు ఫణి కుమార్‌తో వివాహము. వీరు చైన్నై సామ్‌సంగ్ నందు ఉద్యోగము. వీరికి ఒక కుమారుడు సాయికృష్ణ జయంత్ వర్మ.

**వీరభద్ర పెద్ద శివనాగయ్య, నారాయణమ్మ గార్ల నాల్గవ పుత్రుడు వీరభద్ర నాగయ్య. వీరు గుంటూరుకు చెందిన యకమా మధుసూధనరావు, సుబ్బమ్మ గార్ల ప్రథమ కుమార్తె శివకుమారితో వివాహము.** వీరు గుంటూరు నందు మెడికల్ షాపులు నిర్వహించారు. వీరికి ఇద్దరు కుమార్తెలు శైలజ, నాగలక్ష్మి. ఒక కుమారుడు శ్రీనివాసరావు (వాసు).

వీరభద్ర నాగయ్య, శివకుమారి గార్ల ప్రథమ పుత్రిక శైలజ. వీరు కర్నూలు జిల్లా, వెలుగోడుకు చెందిన చిటివేలు నర్సింహులు, జయమ్మల ఏకైక పుత్రుడు

**Page No. 36**



మధుసూధనరావుతో వివాహము. వీరికి ఒక కుమార్తె సాహితీలక్ష్మి. కుమారుడు అక్షిత్ వర్మ.

వీరభద్ర నాగయ్య, శివకుమారి గార్ల ద్వితీయ పుత్రిక నాగలక్ష్మి. వీరు ప్రకాశం జిల్లా, మార్కాపురంకు చెందిన చిటివేలు పాండురంగారావు, సరస్వతమ్మల రెండవ కుమారుడు రంగవర్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు మహిత్‌సాయి, నిఖిత్‌వర్మ. వీరు మార్కాపురం నందు ఆర్టిస్ట్‌గా పనిచేయుచున్నారు. మార్కాపురం వీరి స్థిర నివాసము.

వీరభద్ర నాగయ్య, శివకుమారి గార్ల ఏకైక కుమారుడు శ్రీనివాసరావు (వాసు). వీరు ప్రొద్దుటూరుకు చెందిన సుజాతతో వివాహము. వీరికి ఒక కుమారుడు సాయితేజ్. నెల్లూరు వీరి నివాసము.

**యకమా వెంకయ్య, సుబ్బమ్మ గార్ల తృతీయ కుమార్తె మహాలక్ష్మమ్మ గారు.** వీరిని ప॥గో॥ జిల్లా, ఏలూరుకు చెందిన వెల్లాల రామారావు గారితో వివాహము. వివాహమైన సంవత్సరములోపునే మహాలక్ష్మమ్మ గారు దివంగతులైనారు.

*యకమా వెంకటస్వామి వారి సతీమణి సీతామహాలక్ష్మమ్మ గార్ల తృతీయ కుమారుడు యకమా వెంకయ్య, వీరి ధర్మపత్ని సుబ్బమ్మ గార్ల సంతాన వివరములు ఇంత వరకు తెలియజేయడమైనది.*

**(4) యకమా వెంకటస్వామి వారి సతీమణి సీతామహాలక్ష్మమ్మ గార్లు చతుర్ధ కుమారుడు యకమా ఫకీరయ్య గారు వీరి ధర్మపత్ని కనకరత్నమ్మ గారు.** వీరు గుంటూరు, రైలుపేట, ఆర్యక్షత్రియవీధి యందు నివాసము. వీరు దేవాలయ వాహనములు, దేవతా విగ్రహములు చేసెడివారు. కార్పెంటరీ పని చేసెడివారు. వారికి ముగ్గురు కుమారులు యకమా సుబ్బారావు, యకమా రంగారావు, యకమా కృష్ణమోహన్‌రావు. ముగ్గురు కుమార్తెలు సీతమ్మ, పెద్ద మహాలక్ష్మమ్మ, పుష్పావతమ్మ.

**యకమా ఫకీరయ్య, కనకరత్నంగార్ల ప్రథమ పుత్రుడు యకమా సుబ్బారావు. వీరు నూజీవీడుకు చెందిన గాజుర్లవారి అమ్మాయి పిచ్చమ్మతో వివాహము.** సుబ్బారావు గారు గుంటూరు నందు లారీలకు బాడీ నిర్మాణము గావించెడివారు. వీరికి ముగ్గురు కుమారులు ప్రసాద్, రత్నబాబు, శ్రీనివాసరావు. ఇద్దరు కుమార్తెలు లక్ష్మి, రత్న మంజరి.

యకమా సుబ్బారావు, పిచ్చమ్మ గార్ల ప్రథమ పుత్రుడు ప్రసాద్. వీరు తండ్రి దగ్గరనే కార్పెంటరీ పని చేసెడివారు. వీరు కదిరికి చెందిన జయమ్మ

గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు మల్లిఖార్జునరావు. కుమార్తె వీణ. వీరికి వివాహమైనది.

యకమా సుబ్బారావు, పిచ్చమ్మ గార్ల ద్వితీయ కుమారుడు రత్నబాబు. వీరు తండ్రిగారి వద్దనే కార్పెంటరీ పని చేయుచూ, కడపకు చెందిన బాబునూరి రామయ్య గారి కుమార్తె శారదతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు శోభారాణి, పావని. ఒక కుమారుడు.

ప్రధమ కుమార్తె శోభారాణికి కడపకు చెందిన బాబునూరి జనార్ధన్ గారితో వివాహము. వీరు ఆర్.టి.సి.నందు ఉద్యోగము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె. ఒక కుమారుడు పరమేశ్వరరావు (శివ). ద్వితీయ కుమార్తె పావనిని కంచికి చెందిన శ్రీరామచందర్ గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

యకమా సుబ్బారావు, పిచ్చమ్మ గార్ల తృతీయ కుమారుడు శ్రీనివాసరావు. వీరు కార్పెంటరీ పని చేయుచున్నారు. అనంతపురం జిల్లా, బుక్కపట్నం వారి అమ్మాయి నాగమణితో వివాహము. వీరికి ముగ్గురు కుమార్తెలు పద్మజ, శ్రావణి, గీతారాణి.

పెద్ద కుమార్తె పద్మజను గుంటూరుకు చెందిన రాముతో వివాహము. రాము ఆర్.టి.సి.లో ఉద్యోగము. గుంటూరు వీరి స్థిర నివాసము. ద్వితీయ కుమార్తె శ్రావణిని కడపకు చెందిన చిత్తారి బాబునూరి విజయకుమార్ గారితో వివాహము.

యకమా సుబ్బారావు గారి ప్రధమ కుమార్తె లక్ష్మి. ఈమెను నంద్యాలకు చెందిన చిత్తారి అమరావతి రామయ్యా గారితో వివాహము. వీరికి ఒక కుమార్తె హేమలత. వీరికి ఒక కుమార్తె.

యకమా సుబ్బారావు గారి ద్వితీయ కుమార్తె రత్నమంజరి. ఈమెను తూ.గో.జిల్లా, చాగల్లుకు చెందిన నామేపల్లి ఆచార్యులు గారి ప్రధమ పుత్రుడు సత్యనారాయణతో వివాహము. వీరికి ఒక కుమారుడు రవి.

**యకమా ఫకీరయ్య గారు వీరి ధర్మపత్ని కనకరత్నమ్మ గార్ల ద్వితీయ కుమారుడు యకమా రంగారావు.** వీరు తమ బావగారైన నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల ప్రధమ పుత్రిక తులశమ్మతో వివాహము. రంగారావు గారు కార్పెంటరీ పని యందు, లారీబాడీల నిర్మాణము యందు నిపుణులు. వీరికి సంతానము లేదు.

**Page No. 37**



**యకమా ఫకీరయ్య గారు వీరి ధర్మపత్ని కనకరత్నమ్మ గార్ల తృతీయ కుమారుడు కృష్ణమోహన్ రావు.** వీరు యస్.సి. రైల్వే నందు ఉద్యోగము. వీరు కర్నూలుకు చెందిన లలితమ్మగారి కుమార్తె రాజ్యలక్ష్మి గారితో వివాహము. కృష్ణమోహన్‌రావు గారికి నల్గురు కుమార్తెలు కనకరత్నం, శారద, విజయలక్ష్మి, అనిత. కుమారుడు శ్రీనివాసరావు.

యకమా కృష్ణమోహన్‌రావు గారి ప్రధమ కుమార్తె కనకరత్నంను తన అక్క,బావ గార్ల కుమారుడైన నందిగం పూర్ణశంకరరావుతో వివాహము. పూర్ణశంకరరావు గుంటూరు, డొంకరోడ్డులో ఫ్యాన్సీ షాపు నిర్వహించారు. వీరికి ఇద్దరు కుమారులు నరేంద్ర కుమార్, వంశీ. కుమార్తె దీప్తి.

నందిగం పూర్ణశంకరరావు పెద్ద కుమారుడు నరేంద్ర కుమార్‌కు గుంటూరుకు చెందిన మగతాల హనుమంతరావు, పుష్పావతి గార్ల ద్వితీయ కుమార్తె వెల్లాల దుర్గాదేవి, సత్యనారాయణ గార్ల ప్రధమ పుత్రిక భవానీతో వివాహము. వీరికి ఒక కుమారుడు విష్ణు. వారి కుటుంబ కలహాల వలన నందిగం భవానీ అకాల మరణము.

యకమా కృష్ణమోహన్‌రావు గారి ద్వితీయ కుమార్తె శారద. వీరు గుంటూరు ఉమెన్స్ కాలేజి నందు లెక్చరర్‌గా ఉద్యోగము చేయుచున్నారు.

యకమా కృష్ణమోహన్‌రావు గారి తృతీయ కుమార్తె విజయలక్ష్మి. వీరు హైదరాబాద్‌కు చెందిన దుర్గాప్రసాద్‌తో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

యకమా కృష్ణమోహన్‌రావు గారి చతుర్ధ కుమార్తె అనిత. వీరు బళ్ళారికి చెందిన అమరావతి నాగరాజు గారితో వివాహము.

యకమా కృష్ణమోహన్‌రావు గారి ఏకైక కుమారుడు శ్రీనివాసరావు. వీరు గవర్నమెంట్ టీచరుగా పనిచేయుచున్నారు. వీరు గద్వాల్ వాస్తవ్యులు చిత్తారి చుండూరి రత్తయ్యగారి కుమార్తె గీతతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె. గుంటూరు, రైలుపేట యందు స్థిర నివాసము.

**యకమా ఫకీరయ్య గారు వీరి ధర్మపత్ని కనకరత్నమ్మ గార్ల ప్రధమ కుమార్తె సీతమ్మ గారు.** వీరు ఏలూరుకు చెందిన వెల్లాల రామారావు గారితో వివాహము. వీరు ఏలూరు వెంకట్రామా & కో., నందు చాలా కాలము ఉద్యోగము చేసి తమ శేష జీవితము గుంటూరు, రైలుపేట యందు నివసించిరి. వీరికి సంతానము లేదు.

**యకమా ఫకీరయ్య గారు వీరి ధర్మపత్ని కనకరత్నమ్మ గార్ల ద్వితీయ కుమార్తె పెద్ద మహాలక్ష్మమ్మ గారు.** వీరు ప్రకాశం జిల్లా పల్లామల (ఘుడియపూడి)కి చెందిన నందిగం కోటయ్య గారితో వివాహము. వీరు గుంటూరు, సాంబశివపేట యందే కార్పెంటరీ పని చేయుచూ, సెయింట్ జోసఫ్ హాస్పిటల్‌కు కావలసిన చెక్క బల్లలు, ఇనుప మంచములు, ఊయలలు తయారుచేసి సప్లై చేసెడివారు. వీరికి ఆర్గురు కుమార్తెలు తులశమ్మ, పార్వతి, శాంతమ్మ, ఉమామహేశ్వరి (మయుడు), సావిత్రి, భారతీదేవి. కుమారులు పూర్ణశంకరరావు, కోటేశ్వరరావు, రాధాకృష్ణ.

**నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల పెద్ద కుమార్తె తులశమ్మ.** తన మేనమామగారైన యకమా రంగారావు గారితో వివాహము. వీరికి సంతానము లేదు.

**నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమార్తె పార్వతి.** వీరికి గుంటూరు, రైలుపేటకు చెందిన యకమా కోటేశ్వరరావు గారితో వివాహము. వీరు హార్మోనియంలు, డోలు, తబలాలు తయారుచేసెడివారు మరియు ఫోటో ఫ్రేమ్స్ కూడా తయారు చేసెడివారు. వీరికి ఇద్దరు కుమార్తెలు నాగమణి, దేవమణి. ముగ్గురు కుమారులు నాగరాజు, పండరీనాథ్, వెంకట సుబ్రమణ్యం.

**నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల మూడవ కుమార్తె శాంతమ్మ. వీరు హైదరాబాద్‌కు చెందిన పోగులగుంట్ల భాస్కరరావు గారితో వివాహము.** వీరు ఆర్.టి.సి. యందు ఉద్యోగము. వీరికి ఇద్దరు కుమారులు నరసింహారావు (బుజ్జి), శ్రీనివాసరావు. కుమార్తె శైలజ.

**పోగులగుంట్ల భాస్కరరావుగారి పెద్ద కుమారుడు నరసింహారావు (బుజ్జి) గుంటూరుకు చెందిన నామేపల్లి సాంబయ్యగారి కుమార్తె ఉమాదేవితో వివాహము.** తదుపరి ఉమాదేవి అకాల మరణం. తరువాత నరసింహారావు (బుజ్జి) కూడా మరణించారు. భాస్కరరావు ద్వితీయ కుమారుడు శ్రీనివాసరావు. వీరు మెడికల్ రంగంలో విజయవాడలో మేనేజర్‌గా పనిచేస్తున్నారు. వీరు చాగలమర్రికి చెందిన గురుమూర్తి, శ్రీదేవి గార్ల పుత్రిక నాగలక్ష్మితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు.

**పోగులగుంట్ల భాస్కరరావుగారి కుమార్తె శైలజ. వీరు గుంటూరుకు చెందిన నందిగం కోటయ్య గారి రెండవ కుమారుడు కోటేశ్వరరావు గారితో వివాహము.** వీరు గుంటూరు నందు మెడికల్ హోల్‌సేల్ షాపు నిర్వహిస్తున్నారు. వీరికి ఒక కుమారుడు రాఘవేంద్ర. ఇద్దరు కుమార్తెలు శిరీష, రాజరాజేశ్వరి.

**Page No. 38**



**నందిగం కోటేశ్వరరావు గారి ప్రథమ కుమార్తె శిరీషను గుంటూరుకు చెందిన కామరుషి అప్పారావుగారి ప్రథమ కుమారుడు నాగ సురేష్ గారితో వివాహమ.** వీరు గుంటూరులో వ్యాపార రంగములో నున్నారు. వీరికి ఒక కుమారుడు తారకనాగ మనోజ్.

**నందిగం కోటేశ్వరరావు గారి ద్వితీయ కుమార్తె రాజరాజేశ్వరి. వీరు నెల్లూరు వాస్తవ్యులు యకమా శివరామ వర్మ, పద్మావతి గార్ల ప్రథమ కుమారుడు ఉమాచరణ్‌వర్మతో వివాహము.** వీరు నెల్లూరులో మార్కెటింగ్ రంగం నందు జాబ్ చేయుచున్నారు. వీరికి ఒక కుమార్తె.

**నందిగం కోటేశ్వరరావు గారి ఏకైక కుమారుడు రాఘవేంద్ర కుమార్.** వీరు గుంటూరులో బ్యాంక్ నందు ఉద్యోగము.

**నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల నాల్గవ కుమార్తె ఉమామహేశ్వరి (మయుడు). వీరు గుంటూరుకు చెందిన యకమా వెంకట్రావుగారి కుమారుడు ఆంజనేయులు గారితో వివాహము.** ఆంజనేయులు గారు కార్పెంటరీ పని చేసెడివారు. వీరికి సంతానము లేదు.

**నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల ఐదవ కుమార్తె సావిత్రి.** కర్నూలు జిల్లా, నొస్సంకు చెందిన అమరావతి మనోహర్ గారితో వివాహము. మనోహర్ గారు నొస్సం గ్రామములో బంగారపు పని చేసెడివారు. వీరికి ఇద్దరు కుమారులు రాజగోపాల్ వర్మ, రమేష్. ఒక కుమార్తె లావణ్య.

అమరావతి మనోహర్, సావిత్రి గార్ల ప్రథమ కుమారుడు రాజగోపాల్‌వర్మ. వీరు ఢిల్లీ-రాజస్తాన్ బోర్డర్స్‌లో మైన్స్ నందు ఉద్యోగము చేయుచున్నారు. వీరు గుంటూరు, వల్లూరివారితోటకు చెందిన కీ॥శే॥ యకమా వెంకట సుబ్రమణ్యదాసు గారి ఏకైక కుమార్తె బాలభారతితో వివాహము. భాలభారతి స్కూల్ టీచర్‌గా పనిచేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు రమేష్, కుమార్తె సాయిప్రియ.

అమరావతి మనోహర్, సావిత్రి గార్ల ద్వితీయ కుమారుడు రమేష్‌వర్మ. వీరు చిన్న వయస్సు నందే మరణించిరి.

అమరావతి మనోహర్, సావిత్రి గార్ల ఏకైక పుత్రిక లావణ్య. వీరు కర్నూలుకు చెందిన చిత్తారి శేషయ్య, వసంతమ్మల ప్రథమ పుత్రుడు శ్యామ్‌సుందర్‌తో వివాహము. వీరికి ఒక కుమార్తె.

**నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల ఆరవ కుమార్తె భారతిదేవి.** వీరు కృష్ణా జిల్లా, నూజివీడుకు చెందిన వరాటి నర్సయ్య గారి తృతీయ కుమారుడు

వరాటి వెంకట సుబ్రమణ్యం గారితో వివాహము. వీరు బెంగుళూరు ఐ.టి.ఐ. ఆఫీసు నందు పనిచేసి ఉద్యోగ విరమణ చేసిరి. వీరికి ముగ్గురు కుమారులు నాగకృష్ణ, ఉమామహేశ్వర, జగదీష్.

వరాటి వెంకట సుబ్రమణ్యం, భారతీదేవి గార్ల ప్రధమ కుమారుడు వరాటి నాగకృష్ణ. వీరు హైదరాబాద్‌కు చెందిన పోగులగుంట్ల జగన్నాధవర్మ, జయమ్మ గార్ల పుత్రిక సరితతో వివాహము. నాగకృష్ణ గారు బెంగుళూరులో ప్రభుత్వ ఉ ద్యోగము చేయుచున్నారు. వీరికి ఒక కుమార్తె పూర్వజ. కుమారుడు అభిషేక్ వర్మ.

వరాటి వెంకట సుబ్రమణ్యం, భారతీదేవి గార్ల ద్వితీయ కుమారుడు వరాటి ఉమామహేశ్వర. వీరు బెంగుళూరు నందు టెక్‌మహేంద్ర యందు ఉద్యోగము. వీరు గుంటూరుకు చెందిన వీరభద్ర శేషయ్య, నాగమణిగార్ల ప్రధమ కుమార్తె వెంకట నాగ మాలతితో వివాహము. వెంకట నాగ మాలతి బెంగుళూరు నందు ప్రైవేట్ కాలేజి నందు లెక్చరర్‌గా జాబ్ చేయుచున్నారు. వీరికి ఒక కుమార్తె గోపిక. వీరి స్థిర నివాసం బెంగుళూరు.

వరాటి వెంకట సుబ్రమణ్యం, భారతీదేవి గార్ల తృతీయ కుమారుడు వరాటి జగదీష్. వీరు బెంగుళూరు నందు సాఫ్ట్‌వేర్ ఇండస్ట్రీ నందు ఉద్యోగము. వీరు బెంగుళూరుకు చెందిన ఎ.నారాయణరాజు, రత్నరాజు గార్ల ద్వితీయ కుమార్తె శోభతో వివాహము. వీరికి ఒక కుమారుడు హరితేజ. కుమార్తె చార్విభారతి.

**నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల ప్రధమ కుమారుడు నందిగం పూర్ణశంకరరావు.** వీరు గుంటూరుకు చెందిన యకమా కృష్ణమోహన్ గారి ప్రధమ కుమార్తె కనకరత్నం గారితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు నరేంద్ర కుమార్, వంశీకృష్ణ, కుమార్తె దీప్తి.

**నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమారుడు కోటేశ్వరరావు.** వీరు హైదరాబాద్‌కు చెందిన పోగులగుంట్ల భాస్కరరావు, శాంతమ్మ గార్ల కుమార్తె శైలజతో వివాహము. వీరికి ఒక కుమారుడు రాఘవేంద్ర, ఇద్దరు కుమార్తెలు శిరీష, రాజరాజేశ్వరి.

**నందిగం కోటయ్య, పెద్ద మహాలక్ష్మమ్మ గార్ల తృతీయ కుమారుడు రాధాకృష్ణ.** వీరు గుంటూరుకు చెందిన తమ అక్కా, బావగారు అయిన యకమా కోటేశ్వరరావు, పార్వతి గార్ల ప్రధమ పుత్రిక నాగమణితో వివాహము. వీరికి ఒక కుమారుడు

**Page No.**

**39**



లక్ష్మీ వినయ్ కుమార్. వీరు గుంటూరులో మెడికల్ షాపు నిర్వహిస్తున్నారు. నందిగం వినయ్‌కు నెల్లూరుకు చెందిన యకమా రవివర్మ, పార్వతిల రెండవ కుమార్తె రమణితో వివాహము.

**యకమా ఫకీరయ్య గారు వీరి ధర్మపత్ని కనకరత్నమ్మ గార్ల తృతీయ కుమార్తె పుష్పావతమ్మ గారు. వీరు నంద్యాలకు చెందిన మగతాల నారయణప్ప, వెంకటమ్మ గార్ల తృతీయ కుమారుడు హనుమంతరావు గారితో వివాహము.** వీరు గుంటూరు, సాలెపేటకు వలస వచ్చినారు. వీరు తమ బావగార్లు అయిన యకమా రంగారావు, సుబ్బారావు గారితో కలసి లారీల బాడీలకు నిర్మాణము చేయుచూ, తదుపరి టేకు, సన్‌గ్లాస్‌లతో బార్బర్‌షాపు కుర్చీలను (మంగలి కుర్చీలు) తయారుచేసి ఆంధ్ర దేశము, కర్ణాటక, ఒరిస్సా, మధ్యప్రదేశ్, తమిళనాడు రాష్ట్రములందు ప్రసిద్ధి గాంచిరి. మగతాల హనుమంతరావు గారి తదనంతరము వారి వృత్తిని తన పెద్ద కుమార్తె సత్యవతి గారి ద్వితీయ కుమారునికి అప్పగించిరి.

**మగతాల హనుమంతరావు, పుష్పావతి గార్లకు ఐదుగురు కుమార్తెలు వెంకట సత్యవతి, దుర్గాదేవి, శ్యామలాదేవి, ఇందిరాదేవి, విజయలక్ష్మి.**

మగతాల హనుమంతరావు, పుష్పావతి గార్ల పెద్ద కుమార్తె వెంకట సత్యవతికి ఇద్దరు కుమారులు రాఘవేంద్రరావు, బాలకృష్ణ. ఒక కుమార్తె బిందుమాధవి. అందరికీ వివాహములైనవి.

మగతాల హనుమంతరావు, పుష్పావతి గార్ల ద్వితీయ కుమార్తె దుర్గాదేవి. ఈమెకు నెల్లూరు జిల్లాకు చెందిన వెల్లాల నరసింహరాజు, శేషమ్మ గార్ల తృతీయ కుమారుడు సత్యనారాయణతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు భవాని, అవంతి. ప్రధమ కుమార్తె భవాని. ఈమెను గుంటూరు చెందిన నందిగం నరేంద్ర కుమార్‌తో వివాహము. వీరికి ఒక కుమారుడు విష్ణు. వారి కుటుంబ కలహాల వలన భవాని అకాల మరణం చెందినది. ద్వితీయ కుమార్తె అవంతి. ఈమె తన అమ్మమ్మ, తాతయ్య మగతాల హనుమంతరావు, పుష్పావతి గార్ల సహకారంతో గుంటూరు మెడికల్ కాలేజీలో యం.బి.బి.యస్. చదివారు. తరువాత వరంగల్, ఖాజీపేటకు చెందిన కీ॥శే॥ రాపర్తి సత్యనారాయణ, నిర్మల గార్ల ద్వితీయ కుమారుడు సుజిత్‌తో వివాహము. వీరు హైదరాబాద్ నందు డిలైట్ సాఫ్ట్‌వేర్ కంపెనీలో జాబ్ చేస్తున్నారు. హైదరాబాద్ వీరి స్థిర నివాసము.

మగతాల హనుమంతరావు, పుష్పావతి గార్ల తృతీయ కుమార్తె శ్యామలాదేవి. వీరు పోగులగుంట్ల రామదాసు, నాగలక్ష్మమ్మ గార్ల ఏకైక కుమారుడు నాగరాజు

గారితో వివాహము. శ్యామలాదేవి గారు హైదరాబాద్‌లో ఇండియన్ బ్యాంక్ నందు అసిస్టెంట్ మేనేజర్‌గా పనిచేయుచున్నారు. నాగరాజు గారు నిజామాబాద్ నందు గవర్నమెంట్ హైస్కూల్ టీచరుగా పనిచేసి రిటైర్డ్ అయ్యారు. వీరికి ఒక కుమార్తె అనూష. కుమారుడు సాయి వంశీ. వీరి కుమార్తె అనూషను వారి చెల్లి, బావగారైన టేకుమళ్ళ పురుషోత్తం, లక్ష్మి గార్ల రెండవ కుమారుడు భరత్ కుమార్‌తో వివాహము. వీరికి ఒక కుమార్తె ప్రఘ్నిక. భరత్ కుమార్ చెన్నై నందు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేయుచున్నారు. వీరి నివాసము చెన్నై.

మగతాల హనుమంతరావు, పుష్పావతి గార్ల నాల్గవ కుమార్తె ఇందిరాదేవి. ఈమెను చిలకలూరిపేటకు చెందిన యకమా సుబ్బరామాంజనేయులు, వెంకట సుబ్బమ్మ గార్ల ద్వితీయ కుమారుడు వెంకట నాగేశ్వరరావు (నాగరాజు) గారితో వివాహము. నాగరాజు గారు సింగరాయకొండ టుబాకో బోర్డు నందు ఆఫీసర్‌గా ఉద్యోగము చేయుచున్నారు. ఇందిరాదేవి గారు గుంటూరు, పేరేచర్లలో గవర్నమెంట్ హైస్కూల్‌నందు టీచరుగా ఉద్యోగము చేయుచున్నారు. వీరికి ఇద్దరు కుమారులు భవానీ శంకర్, భానుప్రకాష్.

మగతాల హనుమంతరావు, పుష్పావతి గార్ల ఐదవ కుమార్తె విజయలక్ష్మి. ఈమెను గుంటూరు, వల్లూరివారితోటకు చెందిన యకమా వెంకటస్వామి, పెదనాగలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమారుడు నాగేశ్వరరావుతో వివాహము. వీరు గుంటూరులో కంప్యూటర్ గ్రాఫిక్ డిజైనర్‌గా పనిచేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు రాజా ప్రశాంత్. కుమార్తె యామిని ప్రశాంతి. గుంటూరు వీరి స్థిర నివాసము.

*యకమా వెంకటస్వామి వారి సతీమణి సీతామహాలక్ష్మమ్మ గార్ల చతుర్థ కుమారుడు యకమా ఫకీరయ్య, కనకరత్నమ్మ గార్ల సంతాన వివరములు ఇంత వరకు తెలియజేయడమైనది.*

**(5) యకమా వెంకటస్వామి, సీతామహాలక్ష్మి గార్ల ఏకైక కుమార్తె మంగమ్మ.** వీరిని వెల్లాల వెంకట్రామయ్య, యజ్ఞమ్మల కుమారుడు రామకృష్ణయ్యతో వివాహము. వీరు దేవుని విగ్రహములు, రథములు, చెక్కుడు, నగిషీ పనుల యందు సిద్ధహస్తులు. వీరు నల్గురు సోదరులు తమ సోదరియైన మంగమ్మను బావ రామకృష్ణయ్యకు తమతోపాటు వసతి ఏర్పాటు చేసి గౌరవ మర్యాదలు కల్పించినారు. వీరికి ఒక కుమారుడు చిన వెంకయ్య. వీరు కూడా తండ్రి వలె పలు దేవాలయ పనులు, విగ్రహములు, రథములు చేయుట యందు నేర్పు గడించిరి. వీరికి

Page No. 40



నెల్లూరు వాస్తవ్యులు నందిగం వెంకన్న సోదరి మహాలక్ష్మమ్మతో (మాశమ్మ) వివాహము.

**వీరికి ఒక కుమారుడు వెల్లాల రఘురామకృష్ణయ్య.** వీరు కూడా తాత తండ్రులవలె వివిధ పనులలో నేర్పరులు. నేటికి కూడా వీరు అమ్మవారి విగ్రహములు, వాహనములు, చెక్కుడు, నగిషీ పనులు చేయుచున్నారు. వీరు తమ అక్కాబావగార్లైన చిలకలూరిపేట వాస్తవ్యులు యకమా పాపయ్య, మహాలక్ష్మమ్మ (ఎర్రెమ్మ) ల పెద్ద కుమార్తె సీతామహాలక్ష్మితో వివాహము. వీరికి ఒక కుమార్తె లక్ష్మి పద్మావతి. ఇద్దరు కుమారులు రమణ, కిషోర్ కుమార్.

*యకమా వెంకటస్వామి వారి సతీమణి సీతామహాలక్ష్మమ్మ గార్ల సంతాన వివరములు తెలియజేయడమైనది.*

-- o O o --

**అమరావతి వారు : అమరావతి పుల్లయ్య–నాగలక్ష్మమ్మ గార్లు : వీరు కర్నూలు జిల్లా, నొస్సం గ్రామ వాస్తవ్యులు. వీరికి ఇద్దరు కుమారులు సుబ్బయ్య, దాసయ్య. వీరి ఏకైక సోదరి తిమ్మక్క.** పుల్లయ్య గారు వడ్రంగిపని చేసెడివారు.

**అమరావతి పుల్లయ్య, నాగలక్ష్మమ్మల ప్రథమ పుత్రుడు సుబ్బయ్యకు కర్నూలు జిల్లా, కందుకూరి గ్రామవాస్తవ్యులు ముత్తలూరి పంతులయ్య సోదరి రామలక్ష్మమ్మతో వివాహము.** వీరికి ఒక కుమారుడు వెంకట రమణయ్య. వెంకట రమణయ్యకు రుద్రవరం వాస్తవ్యులు వీరభద్ర చిన్న శేషయ్య, తిమ్మక్కల ప్రథమ పుత్రిక సుబ్బమ్మతో వివాహము. వీరికి నలుగురు కుమార్తెలు రామలక్ష్మమ్మ, లక్ష్మిందేవి, నాగలక్ష్మమ్మ, శ్యామల. ఒక కుమారుడు మునిస్వామి.

అమరావతి వెంకట రమణయ్యగారి ప్రథమ పుత్రిక రామలక్ష్మమ్మను ముత్తలూరి పంతులయ్య తమ్ముడు రామయ్యతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు. అమరావతి వెంకట రమణయ్యగారి ద్వితీయ కుమార్తె లక్ష్మిందేవిని కడప వాస్తవ్యులతో వివాహము. వీరికి ఒక కుమార్తె, కుమారుడు. అమరావతి వెంకట రమణయ్యగారి తృతీయ కుమార్తె నాగలక్ష్మమ్మను రుద్రవరం గ్రామ వాస్తవ్యులు మాచరౌతు పెదనాగయ్య, సుబ్బమ్మల దత్త పుత్రుడు సుబ్బారావుతో వివాహము. వీరికి ముగ్గురు కుమార్తెలు మణి, కుమారి, సుజాత. అమరావతి వెంకట రమణయ్యగారి కనిష్ఠ పుత్రిక శ్యామల. ఈమెను కడప వాస్తవ్యులు చిత్తూరి నారాయణతో వివాహము.

అమరావతి వెంకట రమణయ్యగారి ఏకైక కుమారుడు మునిస్వామి. వీరు శిరివెళ్ళ వాస్తవ్యులు చిత్తారి సంజీవయ్య సోదరి సరస్వతితో వివాహము. వీరు చాలా సంవత్సరాలు అమ్మవారిని ఉపాసించి సిద్ధులు పొందిరి. అమ్మవారి భక్తులై అందరికీ గురువుగా ఉన్నారు. కర్నూలు జిల్లా, ఆళ్ళగడ్డలో తమ సొంత ఇంటినే దేవాలయంగా మార్చి భక్తులకు అండగా నిలబడ్డారు. వీరికి ఇద్దరు కుమారులు. పెద్ద కుమారుడు ప్రవీణ్ వర్మకు ధర్మవరం వాస్తవ్యులు సావిత్రి గారి మూడవ కుమార్తె గీతతో వివాహము. వీరికి ఇద్దరు పుత్రుడు పవన్, హర్షప్రవీణ్. వీరు తండ్రి తరువాత గురుస్థానం తీసుకొని దేవాలయ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. అమరావతి మునిస్వామి గారి రెండవ కుమారుడు సుబ్బారావుకు కర్నూలుకు చెందిన అమరావతి ధనుంజయ గారి కుమార్తె చంద్రికతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు. అమరావతి మునిస్వామిగారి ఏకైక కుమార్తె దేవిని వెలుగోడు వాస్తవ్యులు చిటివేలు శ్రీనివాసులు గారి పెద్ద కుమారుడు సురేంద్రతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

**అమరావతి సుబ్బయ్యగారి రెండవ వివాహము కంచికి చెందిన చిత్తారి చలమరాజు సోదరి మంగమ్మతో వివాహము.** గుంటూరు వలస వచ్చినారు. వీరు కర్నూలు జిల్లా, నొస్సం గ్రామము నుండి గుంటూరుకు వలస వచ్చిరి. వీరికి ముగ్గురు కుమారులు అమరావతి వరదరాజులు, సుబ్రమణ్యం, కృష్ణమూర్తి. ఇద్దరు కుమార్తెలు వెంకట సుబ్బులు, నాగలక్ష్మమ్మ.

**అమరావతి సుబ్బయ్య, మంగమ్మ గార్ల ప్రథమ పుత్రుడు వరదరాజులు గారు. వీరు నంద్యాల, నూనెపల్లికి చెందిన పానుగంటి కృష్ణప్ప, పుటమ్మ గార్ల కుమార్తె లక్ష్మిందేవమ్మ గారితో వివాహము.** వీరికి నలుగురు కుమార్తెలు ప్రసన్నమ్మ, (ప్రసాద్), కామాక్షమ్మ, నాగమల్లీశ్వరి, అంజలి. కుమారుడు సుబ్బారావు.

అమరావతి వరదరాజులుగారి ప్రథమకుమార్తె ప్రసన్నమ్మ (ప్రసాద్) ను విజయవాడకు చెందిన కామరుషి కృష్ణమూర్తి గారితో వివాహము. కృష్ణమూర్తి గారు విజయవాడలో పేయింటింగ్ వర్క్ చేసెడివారు. వీరికి ఒక కుమారుడు అప్పారావు (అనిల్ కుమార్), కుమార్తె పద్మ. కామరుషి అప్పారావు గారికి ఇద్దరు కుమార్తెలు రమ్యశ్రీ, జయశ్రీ. ఒక కుమారుడు మణికృష్ణ ప్రసాద్.

కామరుషి కృష్ణమూర్తి, ప్రసాద్ గార్ల కుమార్తె పద్మను భీమవరంకు చెందిన దామా శేషగిరిరావు గారి కుమారుడు సుబ్బారావుతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె మాలతి.



**అమరావతి వరదరాజులుగారి ద్వితీయ కుమార్తె కామాక్షమ్మను గుంటూరు, వల్లూరివారితోటకు చెందిన వీరభద్ర సాంబయ్య గారితో వివాహము.** వీరికి ముగ్గురు కుమార్తెలు శివనాగమణి, నాగ సునీత, రోజారమణి, కుమారుడు సురేష్‌ఖన్నా.

అమరావతి వరదరాజులుగారి తృతీయ కుమార్తె నాగమల్లీశ్వరి. వీరిని కడపకు చెందిన బాబూనూరి ప్రభాకర్ గారితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. అమరావతి వరదరాజులు గారి నాల్గవ పుత్రిక అంజమ్మ. వీరిని కడపకు చెందిన బాపనూని వేణుగోపాలరావుగారితో వివాహము. వీరికి ఒక కుమార్తె, ఇద్దరు కుమారులు. అమరావతి వరదరాజులు గారి పుత్రుడు సుబ్బారావు. వీరు గుంటూరుకు చెందిన వీరభద్ర సాంబయ్య గారి ద్వితీయ కుమార్తె నాగ సునీతతో వివాహము. వీరికి ఒక కుమార్తె నాగ వైష్ణవి, కుమారుడు వరుణ్‌రాజ్.

అమరావతి సుబ్బయ్య, మంగమ్మ గార్ల ద్వితీయ కుమారుడు సుబ్రమణ్యం. వీరు గుంటూరుకు చెందిన వీరభద్ర చిన శివనాగయ్య గారి శివనాగమ్మ (చంటి) సోదరితో వివాహము. ఈమె చిన్నవయస్సునందే మరణించిరి. తదుపరి ప్రకాశం జిల్లా కామరాజు సంజీవయ్య, నారయణమ్మగార్ల పెద్ద కుమార్తె సంజీవమ్మతో వివాహము. వీరికి ఒక కుమారుడు సుబ్బారావు. వీరు ఇండియన్ బ్యాంక్ నందు ఆఫీసర్‌గా పనిచేసి రిటైర్డ్ అయినారు. అమరావతి సుబ్బారావు గారికి వీరభద్ర చిన శివనాయ్య, చిన నాగలక్ష్మమ్మ గార్ల ఏకైక పుత్రిక శివనాగమ్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె శైలజ. ఇద్దరు కుమారులు నాగ సంజీవ్ కుమార్, నాగరాజు (రాజా). శివనాగమ్మ గారు చిన్న వయస్సు నందే మరణించిరి. తదుపరి సుబ్బారావు గారు నెల్లూరుకు చెందిన నందిగం కృష్ణప్ప గారి కుమార్తె అన్నపూర్ణతో వివాహము.

**అమరావతి సుబ్బారావుగారి ఏకైక పుత్రిక శైజలను తన స్వంత బావమరిది అయిన వీరభద్ర నాగరాజు గారితో వివాహము.** సుబ్బారావు గారి ప్రథమ పుత్రుడు నాగ సంజీవ్ కుమార్‌కు గద్వాల్‌కు చెందిన కాళంగి మాధవరావు, శకుంతల గార్ల కుమార్తె వీణతో వివాహము. వీరికి ఒక కుమార్తె వైష్ణవి, కుమారుడు విష్ణు. సుబ్బారావు గారి ద్వితీయ పుత్రుడు నాగరాజు (రాజా)కు నెల్లూరు జిల్లా, నాయుడుపేటకు చెందిన శ్రీనివాసులు గారి పుత్రిక స్వాతితో వివాహము. వీరికి ఒక కుమార్తె సాత్విక. వీరు చెన్నై నందు మెడికల్ ఫీల్డ్ నందు పనిచేయుచున్నారు.

**అమరావతి సుబ్బయ్య, మంగమ్మ గార్ల తృతీయ కుమారుడు కృష్ణమూర్తి గారు. వీరు గుంటూరుకు చెందిన యకమా అంజయ్య గారి ప్రథమ కుమార్తె**

**గౌరీపద్మావతితో వివాహము.** కృష్ణమూర్తిగారు కార్పెంటరీ పని చేసెడివారు. వీరికి మగ్గురు కుమారులు సుబ్బారావు, వెంకు, శేఖర్. ముగ్గురు కుమార్తెలు.

అమరావతి సుబ్బయ్య-మంగమ్మ గార్ల ప్రథమ కుమార్తె వెంకట సుబ్బులు. వీరిని ప్రకాశం జిల్లా, కురిచేడుకు చెందిన కాళహస్తి గురవయ్య గారితో వివాహము. వీరు శిల్పములు తయారు చేయుటలో నేర్పరులు. వీరు దేవతా విగ్రహములు, గాలిగోపురములు తయారు చేయుటలో సిద్ధహస్తులు. వీరికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు.

**అమరావతి సుబ్బయ్య, మంగమ్మ గార్ల ద్వితీయ పుత్రిక నాగలక్ష్మమ్మ. వీరిని హైదరాబాద్‌కు చెందిన పోగులగుంట్ల రామదాసు గారితో వివాహము.** వీరు ఆర్.సి.టి.లో ఉద్యోగము. వీరికి ఒక కుమారుడు నాగరాజు. నలుగురు కుమార్తెలు లలిత, లక్ష్మి, సాయిసుధ, పద్మ,

పోగులగుంట్ల రామదాసు, నాగలక్ష్మమ్మ గార్ల ఏకైక పుత్రుడు నాగరాజు గారు. వీరు గుంటూరు, సాలెపేటకు చెందిన మగతాల హనుమంతరావు గారి మూడవ కుమార్తె శ్యామలాదేవితో వివాహము. వీరికి ఒక కుమార్తె అనూష. కుమారుడు సాయి వంశీ. నాగరాజుగారి కుమార్తె అనూషను తన ద్వితీయ సోదరి & బావగారైన టేకుమళ్ళ లక్ష్మి, పురుషోత్తంగార్ల రెండవ కుమారుడు భరత్ కుమార్‌తో వివాహము. వీరికి ఒక కుమార్తె ప్రఘ్నిక.

పోగులగుంట్ల రామదాసు, నాగలక్ష్మమ్మ గార్ల ప్రథమ పుత్రిక లతితకు హైదరాబాద్‌కు చెందిన కృష్ణ గారితో వివాహము. వీరికి కుమార్తె శ్వేత, కుమారుడు రాఘువ. వీరికి వివాహములైనవి.

పోగులగుంట్ల రామదాసు, నాగలక్ష్మమ్మ గార్ల తృతీయ కుమార్తె సాయిసుధ. వీరు హైదరాబాద్ వాస్తవ్యులు డా॥ విజయేందర్ రెడ్డి గారితో వివాహము. వీరు హైదరాబాద్‌లో డాక్టర్లుగా ప్రాక్టీస్ చేస్తున్నారు. వీరికి ఒక కుమార్తె (గౌతమి) సోని, కుమారుడు కశ్యప్.

పోగులగుంట్ల రామదాసు, నాగలక్ష్మమ్మ గార్ల నాల్గవ కుమార్తె పద్మ. వీరు హైదరాబాద్‌కు చెందిన దేవీదాస్ గారితో వివాహము. వీరికి ఒక కుమార్తె మనీషా. కుమారుడు సాయి మనోజ్.

**అమరావతి పుల్లయ్య, నాగలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమారుడు దాసయ్య. వీరికి గుంటూరు వాస్తవ్యులు యకమా వెంకయ్య సుబ్బమ్మ గార్ల ప్రథమ పుత్రిక**



**ఆదెమ్మతో వివాహము.** వీరు నొస్సం నుండి గుంటూరుకు వలస వచ్చినారు. వీరు గృహ నిర్మాణాలు, కార్పెంటరీ పని చేసెడివారు. గారు వీరికి ముగ్గురు కుమార్తెలు పెద నాగలక్ష్మమ్మ, చిన నాగలక్ష్మమ్మ, వెంకట సుబ్బమ్మ.

పెద్ద కుమార్తె పెద నాగలక్ష్మమ్మను తన బావమరిది అయిన యకమా వెంకయ్య, సుబ్బమ్మ గార్ల ద్వితీయ కుమారుడు వెంకటస్వామితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు వెంకట సుబ్రమణ్యదాసు, నాగేశ్వరరావు. కుమార్తె నాగమణి.

రెండవ కుమార్తె చిన నాగలక్ష్మమ్మను రుద్రవరం వాస్తవ్యులు చిన శివశేషయ్య, తిమ్మక్కల ఏకైక పుత్రుడు శివనాగయ్యతో వివాహము. వీరికి ఒక కుమార్తె శివనాగమ్మ. ఇద్దరు కుమారులు శేషసాయిదాసు. నాగరాజు.

మూడవ కుమార్తె వెంకట సుబ్బమ్మను గుంటూరు జిల్లా, చిలకలూరిపేటకు చెందిన యకమా కోటయ్య, రత్తమ్మ గార్ల ఆరవ పుత్రుడు సుబ్బరామాంజనేయులు (సుబ్బారావు) గారితో వివాహము. వీరికి ఒక కుమార్తె కోటిరత్నం. ఇద్దరు కుమారులు వెంకట కోటేశ్వరరావు, వెంకట నాగేశ్వరరావు.

**అమరావతి పుల్లయ్య-నాగలక్ష్మమ్మ గార్ల ఏకైక సోదరి తిమ్మక్క.** వీరిని రుద్రవరం వాస్తవ్యులు వీరభద్ర శంకరయ్య, శివనాగమ్మల ద్వితీయ కుమారుడు చిన శేషయ్యతో వివాహము. వీరికి నల్గురు కుమార్తెలు పెద్ద సుబ్బమ్మ, చిన సుబ్బమ్మ, పెద శివనాగమ్మ, చిన శివనాగమ్మ. కుమారుడు చిన శివనాగయ్య.

పెద్దకుమార్తె సుబ్బమ్మను ఆళ్ళగడ్డ వాస్తవ్యులు అమరావతి వెంకట రమణయ్యతో వివాహము. వీరికి నల్గురు కుమార్తెలు, ఒక కుమారుడు. రెండవ కుమార్తె చిన సుబ్బమ్మను రుద్రవరం గ్రామ వాస్తవ్యులు మాచరౌతు చంటి నాగయ్యతో వివాహము. వీరికి ఒక కుమార్తె అంజనమ్మ. చిన్నవయస్సులోనే మరణించిరి. మూడవ కుమార్తె పెద్ద శివనాగమ్మను కర్నూలు వాస్తవ్యులు అమరావతి రామయ్యతో వివాహము. వీరికి ఒక కుమారుడు సోమసుందరం. వీరికి రాజమ్మతో వివాహం. వీరికి ఇద్దరు కుమార్తెలు. నాల్గవ కుమార్తె చిన శివనాగమ్మ (చంటి). ఈమెను గుంటూరుకు చెందిన అమరావతి సుబ్రమణ్యంతో వివాహము. ఈమె చిన్న వయస్సులోనే మరణించిరి.

కుమారుడు చిన శివనాగయ్యకు అమరావతి దాసయ్య, ఆదెమ్మ గార్ల రెండవ కుమార్తె చిన నాగలక్ష్మమ్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె. ఇద్దరు కుమారులు.

**వీరభద్ర వంశస్తులు : కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డ తాలూకా, రుద్రవరం నుండి గుంటూరుకు వలస వచ్చిరి.** దేశానికి స్వతంత్ర్యము రాక పూర్వము కర్నూలు జిల్లా, రుద్రవరం గ్రామ పరిసరాలలో బ్రిటీష్‌వారు వీరికి భూములు ఈనాముగా ఇచ్చినారు. ఆ భూములు సేద్యము చేసుకుంటూ, బంగారపు పనులు, దేవతా విగ్రహములు చేయుచూ జీవనము సాగించిరి. రుద్రవరం గ్రామమున వీరభద్ర పెద్ద శివనాగయ్య గారి చేత జమ్ములమ్మ దేవత విగ్రహము చేయబడినది. ఈ జమ్ములమ్మ గ్రామదేవత విగ్రహముకు చిన్న గుడి నిర్మించి పూజలు, కొలుపులు నేటికీ చేయుచున్నారు.

**వీరభద్ర శంకరయ్య, శివనాగమ్మలకు ఇద్దరు కుమారులు పెద్ద శేషయ్య, చిన్న శేషయ్య.** పెద్దశేషయ్యకు ఆ గ్రామవాస్తవ్యులు మాచరౌతు సుబ్బయ్య-నాగమ్మల పెద్దకుమార్తె సుబ్బమ్మతో (తిక్క సుబ్బమ్మ) వివాహము. పెద్ద శేషయ్య గారు బ్రిటీష్‌వారి భవనములకు రంగు పనులు చేసారు. వీరికి ఒక కుమార్తె పెద్ద శివనాగమ్మ, కుమారుడు పెద్ద శివనాగయ్య. కుమార్తె పెద్ద శివనాగమ్మను తన బావమరిది మాచరౌతు నాగయ్య (నడిపి నాగయ్య)తో వివాహము. వీరికి సంతానం లేదు. కుమారుడు పెద్ద శివనాగయ్యకు గుంటూరు వాస్తవ్యులు యకమా వెంకయ్య, సుబ్బమ్మ గార్ల రెండవ కుమార్తె నారాయణమ్మతో వివాహము. వీరు కొంత కాలం రుద్రవరంలో బంగారు పనులు చేయుచుండెడివారు. తరువాత కొంత కాలమునకు తన సంతానముతో గుంటూరుకు వలస వచ్చిరి. వీరికి ఒక కుమార్తె అనసూయ. తన బావమరిది యకమా ఆంజనేయులుతో వివాహము. వీరికి ఒక కుమార్తె, ముగ్గురు కుమారులు.

**వీరభద్ర పెద్ద శివనాగయ్య, నారాయణమ్మలకు నలుగురు కుమారులు. పెద్ద కుమారుడు సాంబయ్యకు గుంటూరు వాస్తవ్యులు అమరావతి వరదరాజులు - లక్ష్మిందేవిగార్ల రెండవ కుమార్తె కామాక్షితో వివాహము.** వీరికి ముగ్గురు కుమార్తెలు. పెద్ద కుమార్తె శివనాగమణిని తన అక్కయైన యకమా అనసూయ, ఆంజనేయులు గార్ల రెండవ కుమారుడు వెంకట నారాయణతో వివాహము. వీరికి ఒక కుమార్తె నాగ భవ్య (జ్యోతి), కుమారుడు భార్గవ్ అవినాష్ (చిన్న). రెండవ కుమార్తె నాగ సునీతను తన బావమరిది సుబ్బారావుతో వివాహము. వీరికి ఒక కుమార్తె వైష్ణవి, కుమారుడు వరుణ్‌తేజ్. మూడవ కుమార్తె రోజారమణిని ప్రొద్దుటూరు వాస్తవ్యులు అమరావతి రామకృష్ణయ్య దత్త పుత్రుడు రామచంద్రుడుతో వివాహము. వీరికి ఒక కుమార్తె శ్వేతామృత, కుమారుడు కృష్ణ పవన్. వీరభద్ర సాంబయ్యగారి





ఏకైక కుమారుడు సురేష్‌ఖన్నాకు యకమా నాగరాజు, లీల గార్ల కుమార్తె పార్వతితో వివాహము. వీరికి ఒక కుమార్తె మానస శ్రీజ, కుమారుడు సాయితేజ.

**వీరభద్ర పెద్ద శివనాగయ్య, నారాయణమ్మల రెండవ కుమారుడు శంకర్రావుకు తన అక్క కుమార్తె పద్మావతితో వివాహము.** వీరికి ఇద్దరు కుమారులు శివమోహన్, కిరణ్ కుమార్. కుమార్తె నాగశాంతి. పెద్ద కుమారుడు శివమోహన్‌కు మాచరౌతు నాగేంద్ర, శశికళావతమ్మ గార్ల పెద్ద కుమార్తె నిర్మలతో వివాహము. వీరికి ఒక కుమారుడు మధుసాయి మనోజ్, కుమార్తె తన్మయి. రెండవ కుమారుడు కిరణ్ కుమార్‌కు వరాటి రాధాకృష్ణ, మణిమాల గార్ల పెద్ద కుమార్తె రేణుకతో వివాహము. కుమార్తె నాగశాంతికి నొస్సం వాస్తవ్యులు మాచరౌతు సుబ్రమణ్యం, రాజ్యలక్ష్మిగార్ల రెండవ కుమారుడు రామ్మోహన్ వర్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె సుమప్రియ.

**వీరభద్ర పెద్ద శివనాగయ్య, నారాయణమ్మల మూడవ కుమారుడు శేషయ్యకు తన మేనమామ వెంకటస్వామి, నాగలక్ష్మమ్మల కుమార్తె నాగమణితో వివాహము.** వీరికి ఇద్దరు కుమార్తెలు వెంకట నాగ మాలతి, బాలసుధారాణి. పెద్ద కుమార్తె వెంకట నాగ మాలతిను బెంగుళూరు వాస్తవ్యులు వరాటి సుబ్రమణ్యం, భారతి గార్ల రెండవ కుమారుడు ఉమామహేశ్వరతో వివాహము. వీరికి ఒక కుమార్తె గోపిక. రెండవ కుమార్తె బాలసుధారాణిని తన మేనమామయైన యకమా వెంకట సుబ్రమణ్యదాసు, విజయమ్మల ద్వితీయ కుమారుడు ఫణికుమార్‌తో వివాహము. వీరికి ఒక కుమారుడు సాయి కృష్ణ జయంత్ వర్మ.

**వీరభద్ర పెద్ద శివనాగయ్య, నారాయణమ్మల నాల్గవ కుమారుడు నాగయ్యకు యకమా వెంకట మధుసూదనరావు, సుబ్బమ్మ గార్ల ప్రథమ పుత్రిక శివకుమారితో వివాహము.** వీరికి ఇద్దరు కుమార్తెలు శైలజ, నాగలక్ష్మి. కుమారుడు శ్రీనివాస్ (వాసు). పెద్ద కుమార్తె శైలజను వెలుగోడు వాస్తవ్యులు చిటివేలు నరసింహప్ప, జయమ్మ గార్ల ఏకైక కుమారుడు మధుసూదనరావుతో వివాహము. వీరికి ఒక కుమారుడు అక్షిత్ వర్మ. ఒక కుమార్తె సాహితిలక్ష్మి. రెండవ కుమార్తె నాగలక్ష్మిని మార్కాపురం వాస్తవ్యులు చిటివేలు పాండురంగారావు, సరస్వతమ్మ గార్ల ద్వితీయ కుమారుడు రంగవర్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు మహిత్‌సాయి, నిఖిత్‌వర్మ. కుమారుడు శ్రీనివాస్ (వాసు)కు ప్రొద్దుటూరు వాస్తవ్యులు బడబాగ్ని సూర్యనారాయణరాజుగారి పుత్రిక సుజాతతో వివాహము. వీరికి ఒక కుమారుడు సాయితేజ్.

**వీరభద్ర శంకరయ్య, శివనాగమ్మల కుమారుడు చిన్న శేషయ్య. వీరికి నొస్సం వాస్తవ్యులు అమరావతి పుల్లయ్య–నాగలక్ష్మమ్మల కుమార్తె తిమక్కతో వివాహము.** వీరికి నలుగురు కుమార్తెలు పెద్ద సుబ్బమ్మ, చిన్న సుబ్బమ్మ, పెద్ద శివనాగమ్మ, చిన్న శివనాగమ్మ. కుమారుడు చిన్న శివనాగయ్య.

వీరభద్ర చిన్న శేషయ్య, తిమ్మక్కల పెద్ద కుమార్తె పెద్ద సుబ్బమ్మను ఆళ్ళగడ్డ వాస్తవ్యులు అమరావతి సుబ్బయ–రామలక్ష్మమ్మల పెద్ద కుమారుడు వెంకట రమణయ్యతో వివాహము. వీరికి నలుగురు కుమార్తెలు రామలక్ష్మమ్మ, లక్ష్మిందేవి, నాగలక్ష్మమ్మ, శ్యామల. కుమారుడు మునిస్వామి (గురుస్వామి).

వీరభద్ర చిన్న శేషయ్య, తిమ్మక్కల చిన్న కుమార్తె చిన్న సుబ్బమ్మను రుద్రవరం గ్రామ వాస్తవ్యులు మాచరౌతు చంటి నాగయ్యతో వివాహము. వీరికి ఒక కుమార్తె అంజనమ్మ. చిన్న వయస్సునందే మరణించిరి.

వీరభద్ర చిన్న శేషయ్య, తిమ్మక్కల మూడవ కుమార్తె పెద్ద శివనాగమ్మను కర్నూలు వాస్తవ్యులు అమరావతి రామయ్యతో వివాహము. వీరికి ఒక కుమారుడు సోమసుందరం. వీరికి కర్నూలు వాస్తవ్యులు కాంగ్రెస్ రామయ్య, పద్మావతమ్మల పుత్రిక రాజమ్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు అరుణ, లత.

వీరభద్ర చిన్న శేషయ్య, తిమ్మక్కల నాల్గవ కుమార్తె. చిన్న శివనాగమ్మ (చంటి). గుంటూరు వాస్తవ్యులు అమరావతి సుబ్రమణ్యంతో వివాహము. ఈమె చిన్న వయస్సు నందే మరణించిరి.

**వీరభద్ర చిన్న శేషయ్య, తిమ్మక్కల ఏకైక కుమారుడు చిన్న శివనాగయ్య. వీరికి గుంటూరు వాస్తవ్యులు అమరావతి దాసయ్య, ఆదెమ్మల ద్వితీయ కుమార్తె చిన్న నాగలక్ష్మమ్మతో వివాహము.** వీరికి ఒక కుమార్తె శివనాగమ్మ. ఈమెను అమరావతి సుబ్బారావుతో వివాహము. వీరికి ఒక కుమార్తె శైలజ. ఇద్దరు కుమారులు నాగ సంజీవ్ కుమార్, నాగరాజు (రాజా).

వీరభద్ర చిన్న శివనాగయ్య, చిన్న నాగలక్ష్మమ్మల ప్రథమ పుత్రుడు శేషసాయిదాసుకు కర్నూలు వాస్తవ్యులు అమరావతి సోమసుందరం, రాజమ్మల ప్రథమ పుత్రిక అరుణతో వివాహము. వీరికి ఒక కుమార్తె సింధూర.

వీరభద్ర చిన్న శివనాగయ్య, చిన్న నాగలక్ష్మమ్మల ద్వితీయ పుత్రుడు నాగరాజు. వీరికి తన అక్క, బావగార్లు అమరావతి శివనాగమ్మ, సుబ్బారావు గార్ల ఏకైక పుత్రిక శైలజలతో వివాహము.

Page No.
44



**ముత్తలూరి వంశస్తులు : కర్నూలు జిల్లా, ఆళ్ళగడ్డ మండలం, కోట కందుకూరు గ్రామస్తులు చిత్తారి ముత్తలూరి పంతులయ్య, రామయ్య, రామలక్ష్మమ్మ, రామసుబ్బమ్మ (ఎర్రగుట్ల) వీరు అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు. వీరి తల్లిదండ్రుల పేర్లు తెలియలేదు.** వీరు కోట కందుకూరు నందు భూములు కల్గి వ్యవసాయం, వడ్రంగము, కమ్మరిపని, వ్యవసాయపు పనిముట్లు చేయుచూ జీవనము సాగించిరి.

**చిత్తారి ముత్తలూరి పంతులయ్య గారి భార్య నాగమ్మ. వీరికి నలుగురు కుమారులు శ్రీరాములు, శ్రీనివాసులు, రామసుబ్బయ్య, రామలక్ష్మయ్య.**

**చిత్తారి ముత్తలూరి పంతులయ్య, నాగమ్మల పెద్ద కుమారుడు శ్రీరాములు గారి భార్య సరోజిని.** వీరికి ముగ్గురు కుమార్తెలు లక్ష్మినరసమ్మ, పద్మావతి, భాగ్యలక్ష్మి. కుమారుడు సత్యనారాయణ.

చిత్తారి ముత్తలూరి సత్యనారాయణకు రుద్రవరం గ్రామ వాస్తవ్యులు శ్రీ మాచరౌతు నాగేంద్రవర్మ, శశికళ గార్ల రెండవ కుమార్తె భారతితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు నీరజ, రేణుక. కుమారుడు జయేంద్ర.

**చిత్తారి ముత్తలూరి పంతులయ్య, నాగమ్మల ద్వితీయ కుమారుడు శ్రీనివాసులు, భార్య శకుంతల.** వీరికి ఇద్దరు కుమారులు. ఇద్దరు కుమార్తెలు. ఇద్దరు కుమారులకు రుద్రవరం గ్రామ వాస్తవ్యులు మాచరౌతు నాగరాజు, భాగమ్మల కుమార్తెలు మంజుల, నాగేశ్వరిలతో వివాహము.

**చిత్తారి ముత్తలూరి పంతులయ్య, నాగమ్మల తృతీయ కుమారుడు రామసుబ్బయ్యకు రుద్రవరం గ్రామ వాస్తవ్యులు మాచరౌతు చంటి నాగయ్య, రంగమ్మల కుమార్తె నాగరత్నమ్మ (అమణ్ణి)తో వివాహము.** వీరు వివాహానంతరము కందుకూరు నుండి రుద్రవరంకు వలస వచ్చారు. వీరికి ఐదుగురు కుమార్తెలు ఆదిలక్ష్మమ్మ, రమాదేవి, రాధ, సావిత్రి, రాణి. అందరికీ వివాహములైనవి.

**చిత్తారి ముత్తలూరి పంతులయ్య, నాగమ్మల చతుర్ధ కుమారుడు రామలక్ష్మయ్య. వీరి భార్య రామసుబ్బమ్మ (రామక్క).** వీరికి ఇద్దరు కుమారులు. ఇద్దరు కుమార్తెలు.

**చిత్తారి ముత్తలూరి రామయ్యకు ఆళ్ళగడ్డ వాస్తవ్యులు అమరావతి వెంకట రమణయ్య, సుబ్బమ్మల పెద్ద కుమార్తె రామలక్ష్మమ్మతో వివాహము.** వీరికి ఒక కుమార్తె రామసుబ్బమ్మ. ఇద్దరు కుమారులు రామసుబ్బయ్య, రామకృష్ణయ్య.

ముత్తలూరి రామయ్య, రామలక్ష్మమ్మల ఏకైక కుమార్తె రామసుబ్బమ్మను

రుద్రవరం వాస్తవ్యులు మాచరౌతు చంటి నాగయ్య, రంగమ్మల పెద్ద కుమారుడు నాగభూషణంతో వివాహము. వీరికి ఒక కుమార్తె రత్న. కుమారుడు ప్రసాద్.

కుమార్తె రత్నను ముత్తలూరి రామయ్య రామలక్ష్మమ్మల రెండవ కుమారుడు రామకృష్ణయ్యతో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు. ముత్తలూరి రామయ్య, రామలక్ష్మమ్మల పెద్ద కుమారుడు రామసుబ్బయ్య, భార్య లీలావతి. వీరికి ముగ్గురు కుమారులు. ఒక కుమార్తె.

**కర్నూలు జిల్లా, ఆళ్ళగడ్డ మండలం, కోట కందుకూరు గ్రామస్తులు చిత్తారి ముత్తలూరి పంతులయ్య, రామయ్యల ప్రథమ సోదరి రామలక్ష్మమ్మను నొస్సం వాస్తవ్యులు అమరావతి సుబ్బయ్యతో వివాహము.** వీరికి ఒక కుమారుడు వెంకట రమణయ్య (ఆళ్ళగడ్డ).

**ముత్తలూరి పంతులయ్య, రామయ్యల ద్వితీయ సోదరి రామసుబ్బమ్మ (ఎర్రగుంట్ల) ను హైదరాబాద్ వాస్తవ్యులు చిత్తారి నరసింహారావుతో వివాహము.** వీరు హైదరాబాద్ నవాబ్ గారి దివాణంలో చిత్రకారునిగా పనిచేసినారు. వీరికి నల్గురు కుమార్తెలు.

**మాచరౌతు వంశస్తులు : వీరి స్థిర నివాసం కర్నూలు జిల్లా, రుద్రవరం. మాచరౌతు సుబ్బయ్య, నాగమ్మలకు ముగ్గురు కుమారులు పెదనాగయ్య, నడిపి నాగయ్య, చంటి నాగయ్య. ఇద్దరు కుమార్తెలు తిక్క సుబ్బమ్మ, జమ్ములమ్మ.** వీరు బ్రిటీషువారి హాయములో ఈనాంగా భూములు పొంది బంగారు పనులు, రాళ్ళు పొదిగి నగలు చేయుట యందు నిష్ణాతులు.

మాచరౌతు సుబ్బయ్య, నాగమ్మల పెద్ద కుమారుడు పెద్ద నాగయ్య, భార్య సుబ్బమ్మ. వీరి దత్త పుత్రుడు సుబ్బారావుకు ఆళ్ళగడ్డ వెంకట రమణయ్య, సుబ్బమ్మల మూడవ కుమార్తె నాగలక్ష్మమ్మతో వివాహము. వీరికి ముగ్గురు కుమార్తెలు. నాగమణి, కుమారి, సుజాత. అందరికీ వివాహములైనవి. మాచరౌతు సుబ్బయ్య, నాగమ్మల రెండవ కుమారుడు నడిపి నాగయ్య. వీరికి తన అక్కాబావగార్లైన వీరభద్ర పెద్ద శేషయ్య, తిక్క సుబ్బమ్మల కుమార్తె శివనాగమ్మతో వివాహము. శివనాగమ్మ గారు ఆనాడు రుద్రవరం గ్రామ పంచాయితీలో మెంబర్‌గా ఉండి సేవలు అందించి యున్నారు. వీరికి సంతానము లేదు. మాచరౌతు సుబ్బయ్య, నాగమ్మల మూడవ కుమారుడు చంటి నాగయ్య. వీరికి మొదట చిన్న శేషయ్య, తిమ్మక్కల రెండవ కుమార్తె చిన్న సుబ్బమ్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె





అంజనమ్మ. వీరు చిన్న వయస్సులోనే మరణించిరి. రెండవ వివాహము బనగానపల్లెకు చెందిన మీనాక్షమ్మతో వివాహము. వీరికి ఒక కుమారుడు సుబ్బారావు. వీరు పెద నాగయ్య, సుబ్బమ్మలకు దత్తు వెళ్ళారు. వీరి భార్య ఆళ్ళగడ్డకు చెందిన నాగలక్ష్మమ్మ. వీరికి ముగ్గురు కుమార్తెలు. మీనాక్షమ్మగారు మరణించారు. చంటి నాగయ్య మూడవ భార్య రంగమ్మ. వీరికి ముగ్గురు కుమారులు నాగభూషణం, నాగరాజు, నాగేంద్రం. కుమార్తె నాగరత్నమ్మ (అమ్మణ్ణమ్మ).

మాచరౌతు చంటి నాగయ్య, రంగమ్మల పెద్ద కుమారుడు నాగభూషణం వర్మ. వీరికి కందుకూరు ముత్తలూరు రామయ్య, రామలక్ష్మమ్మల కుమార్తె రామసుబ్బమ్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు. ఒక కుమారుడు ప్రసాద్ వర్మ, కుమార్తె రత్న. మాచరౌతు ప్రసాద్ వర్మ భార్య హేమలత. వీరికి ఒక కుమార్తె హేమ మాధురి. కుమారుడు కమల్‌వర్మ. మాచరౌతు నాగభూషణం వర్మ కుమార్తె రత్నకు తన బావమరిది ముత్తలూరి రామకృష్ణయ్యతో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు.

మాచరౌతు చంటి నాగయ్య, రంగమ్మల రెండవ కుమారుడు నాగరాజువర్మ. వీరి భార్య భాగ్యమ్మ. వీరికి నలుగురు కుమార్తెలు మంజుల, నాగేశ్వరి, సుశీల. కుమారుడు మధు. కుమార్తెలు మంజుల, నాగేశ్వరిలను కందుకూరు వాస్తవ్యులు ముత్తలూరు శ్రీనివాసులుగారి కుమారులతో వివాహము. మూడవ కుమార్తె సుశీలను హోస్పేటకు చెందిన చిట్టివర్మ గారితో వివాహము.

మాచరౌతు చంటి నాగయ్య, రంగమ్మల మూడవ కుమారుడు నాగేంద్రం వర్మ. వీరు కడప జిల్లా, చాగలమర్రి వాస్తవ్యులు శశికళావతమ్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు. పెద్ద కుమార్తెను నిర్మలను గుంటూరు వాస్తవ్యులు వీరభద్ర శంకర్రావు, పద్మావతిల పెద్ద కుమారుడు శివమోహన్‌రావుతో వివాహము. వీరికి ఒక కుమారుడు మధుసాయిమనోజ్. కుమార్తె తన్మయి. మాచరౌతు నాగేంద్రం వర్మ. గారి రెండవ కుమార్తె భారతిని కందుకూరి వాస్తవ్యులు ముత్తలూరి శ్రీరాములు, సరోజిని గార్ల ఏకైక కుమారుడు సత్యనారాయణతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు నీరజ, రేణుక. కుమారుడు జయేంద్ర వర్మ.

మాచరౌతు చంటి నాగయ్య, రంగమ్మల ఏకైక కుమార్తె నాగరత్నమ్మ (అమ్మణ్ణమ్మ). మూత్తలూరి రామసుబ్బయ్యతో వివాహము. వీరు వివాహానంతరము కందుకూరు నుండి రుద్రవరం వలస వచ్చారు. వీరికి ఐదుగురు కుమార్తెలు ఆదిలక్ష్మమ్మ, రమాదేవి, రాధా, సావిత్రి, రాణి.

మాచరౌతు సుబ్బయ్య, నాగమ్మ గార్ల పెద్ద కుమార్తె తిక్క సుబ్బమ్మ. వీరిని రుద్రవరం వాస్తవ్యులు వీరభద్ర పెద్ద శేషయ్యతో వివాహము. వీరికి ఒక కుమార్తె శివనాగమ్మ. కుమారుడు శివనాగమ్మ. కుమార్తె శివనాగమ్మను మాచరౌతు నడిపి నాగయ్యతో వివాహము. వీరికి సంతానము లేదు.

మాచరౌతు సుబ్బయ్య, నాగమ్మ గార్ల ఏకైక కుమారుడు పెద్ద శివనాగయ్యను గుంటూరు వాస్తవ్యులు యకమా వెంకయ్య, సుబ్బమ్మ గార్ల రెండవ పుత్రిక నారాయణమ్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె అనసూయమ్మ. నల్గురు కుమారులు సాంబయ్య, శంకర్రావు, శేషయ్య, నాగయ్య.

మాచరౌతు సుబ్బమ్మ, నాగమ్మల రెండవ కుమార్తె జమ్ములమ్మను నంద్యాల వాస్తవ్యులు అమరావతి శేషప్పతో వివాహము. వీరికి నల్గురు కుమార్తెలు ఎల్లమ్మ, సుబ్బలక్ష్మమ్మ, లక్ష్మిందేవి, నాగత్నమ్మ. పెద్దకుమార్తె ఎల్లమ్మను కర్నూలు వాస్తవ్యులు మాచరౌతు సుబ్బారాయుడుతో వివాహము. వీరికి ఒక కుమారుడు డా॥ కృష్ణమూర్తి. ఒక కుమార్తె. రెండవ కుమార్తె సుబ్బలక్ష్మమ్మ ఎలిమెంటరీ స్కూల్ టీచర్‌గా పనిచేశారు. మూడవ కుమార్తె లక్ష్మిందేవి సంగీతంలో డిప్లమో చేసి టీచర్‌గా పనిచేశారు. మూడవ కుమార్తె నాగరత్నమ్మ బి.ఇడి. టీచర్‌గా పనిచేశారు. వీరికి గుంటూరు వాస్తవ్యులు డా॥ హరనాథ్‌బాబు గారితో వివాహము. వీరు రాజాను దత్త పుత్రునిగా స్వీకరించి హైదరాబాద్ వాస్తవ్యులు చిత్తారి నర్సింహరావు, సుబ్బమ్మ (ఎర్రగుంట్ల) గార్ల పుత్రిక సుధతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు చక్రవర్తి. ముగ్గురు డాక్టరుగా స్థిరపడ్డారు.

**మాచరౌతువారు (నొస్సం) : వీరు శిరివెళ్ళ తాలూకా, మాచరౌతు సుబ్బన్న వెంకటమ్మ గార్లకు ఇద్దరు కుమారులు సుబ్బరాయుడు, శేషన్న. పెద్ద కుమారుడు సుబ్బరాయుడుకు నొస్సం వాస్తవ్యులు అమరావతి వెంకటస్వామి, తిరుపతమ్మల పుత్రిక రంగమ్మతో వివాహము. వీరికి ఐదుగురు కుమారులు సుబ్రమణ్యం, కృష్ణుడు, శేఖర్, వెంకటేశ్వర్లు, వెంకటరమణ. కుమార్తె సరస్వతి.**

మాచరౌతు సుబ్బరాయుడు, రంగమ్మల పెద్ద కుమారుడు సుబ్రమణ్యం. వీరు పాఠశాల అధ్యాపకులు. వీరు అమరావతి చిన రంగయ్య, సుబ్బలక్ష్మమ్మ గార్ల పెద్ద కుమార్తె రాజ్యలక్ష్మితో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు సురేష్ వర్మ, రామ్మోహన్ వర్మ, కిరణ్‌కుమార్ వర్మ.

మాచరౌతు సుబ్రమణ్యం, రాజ్యలక్ష్మిల పెద్ద కుమారుడు సురేష్ వర్మకు నంద్యాల వాస్తవ్యులు సునీతతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు నిర్మల్,

Page No.
46



జయంత్. మాచరౌతు సుబ్రమణ్యం, రాజ్యలక్ష్మిల రెండవ కుమారుడు రామ్మోహన్ వర్మకు గుంటూరు వాస్తవ్యులు వీరభద్ర శంకర్రావు, పద్మావతిల ఏకైక పుత్రిక రమాశాంతితో వివాహము. వీరికి ఒక కుమార్తె సుమప్రియ. మాచరౌతు సుబ్రమణ్యం, రాజ్యలక్ష్మిల మూడవ కుమారుడు కిరణ్‌కుమార్ వర్మకు అమరావతి శివుడు, ధనమ్మ గార్ల పుత్రిక ప్రణీతతో వివాహము. వీరికి ఒక కుమారుడు. మాచరౌతు సుబ్బరాయుడు, రంగమ్మ గార్ల రెండవ కుమారుడు కృష్ణుడును నూనెపల్లి వాస్తవ్యులు పానుగంటి తిరుపాలు కుమార్తె కాంతమ్మతో వివాహము. వీరికి ఒక కుమారుడు సుబ్బరంగయ్య. వీరు ప్రస్తుతం మిలటరీలో పనిచేయుచున్నారు. వీరికి ఇద్దరు కుమారులు. మాచరౌతు సుబ్బరాయుడు, రంగమ్మ గార్ల మూడవ కుమారుడు శేఖర్‌కు చాగలమర్రి వాస్తవ్యులు లక్ష్మిఅలివేలుతో వివాహము. వీరికి ఒక కుమార్తె సుధ. కుమారుడు శివమనోహర్. మాచరౌతు సుబ్బరాయుడు, రంగమ్మ గార్ల నాల్గవ కుమారుడు వెంకటేశ్వర్లుకు అమరావతి రామచంద్రయ్యగారి ద్వితీయ కుమార్తె రమాదేవితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు శ్రీధర్, జ్ఞాని. మాచరౌతు సుబ్బరాయుడు, రంగమ్మ గార్ల ఐదవ కుమారుడు వెంకట రమణకు అమరావతి గోవిందరాజులు, సరస్వతి గార్ల పుత్రిక రాధతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు రవితేజ, సుధీర్. మాచరౌతు సుబ్బరాయుడు, రంగమ్మ గార్ల కుమార్తె సరస్వతమ్మను అమరాతి వెంకటస్వామి, తిరుపతమ్మల రెండవ కుమారుడు గోవిందరాజులుతో వివాహము. వీరికి ఒక కుమార్తె రాధ. ఈమెకు మాచరౌతు వెంకట రమణయ్యతో వివాహము. కుమారుడు రాజాకు లావణ్యతో వివాహము. వీరికి ఒక కుమార్తె భువన. కుమారుడు నరేంద్ర.

**చిత్తారి అమరావతివారు :** కర్నూలు జిల్లా, నొస్సం గ్రామములో చిత్తారి అమరావతి రంగయ్య గారు వ్యవసాయ భూములు కల్గి, పాడి పంటలు కల్గి, బంగారంతో నగిషీ పనులు చేయుచూ జీవనం సాగించిరి. **అమరావతి రంగయ్య గారికి నల్గులు కుమారులు. అమరావతి వెంకయ్య, అమరావతి చిన్న వెంకయ్య, అమరావతి వెంకటస్వామి (నారాపురం), గోవిందప్ప.**

అమరావతి రంగయ్యగారి పెద్ద కుమారుడు వెంకయ్య. వారి వివరాలు తెలియరాలేదు. అమరావతి రంగయ్యగారి చిన్న కుమారుడు చిన్న వెంకయ్య. భార్య వెంకమ్మ. వీరికి ఒక కుమారుడు నారాయణ.

అమరావతి రంగయ్య గారి మూడవ కుమారుడు వెంకటస్వామి (నారాపురం). వీరి భార్య తిరుపతమ్మ. వీరికి ముగ్గురు కుమారులు చిన రంగయ్య, గోవిందరాజులు, రామచంద్రయ్య. ఒక కుమార్తె రంగమ్మ.

అమరావతి వెంకటస్వామి, తిరుపతమ్మ గార్ల పెద్ద కుమారుడు చిన రంగయ్య. వీరికి నొస్సం వాస్తవ్యులు యాదగిరి తిమ్మయ్య, సుబ్బమ్మ గార్ల రెండవ కుమార్తె సుబ్బలక్ష్మమ్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు రవి, జనార్ధన్. ముగ్గురు కుమార్తెలు రాజ్యలక్ష్మి, వరాలు, వాణి. అమరావతి చిన రంగయ్య గారి పెద్ద కుమారుడు రవి. తాత, అమ్మమ్మలు యాదగిరి తిమ్మయ్య, సుబ్బమ్మలకు దత్తుగా వెళ్ళారు. వీరికి నెల్లూరు వాస్తవ్యులు యకమా రమణయ్య, సుబ్బమ్మ గార్ల రెండవ కుమార్తె జ్యోతితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తె రమ్య, ఉమ. అమరావతి చిన రంగయ్య, సుబ్బలక్ష్మమ్మల రెండవ కుమారుడు జనార్ధన్‌కు నంద్యాలకు చెందిన మాధవితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు. చైతన్య, కీర్తి.

**అమరావతి చిన్న రంగయ్య, సుబ్బలక్ష్మమ్మల పెద్ద కుమార్తె రాజ్యలక్ష్మిని మాచరౌతు సుబ్బరాయుడు, రంగమ్మల పెద్ద కుమారుడు సుబ్రమణ్యంతో వివాహము.** వీరికి ముగ్గురు కుమారులు సురేష్‌వర్మ, రామ్మోహన్‌వర్మ, కిరణ్‌కుమార్‌వర్మ. అమరావతి చిన్న రంగయ్య, సుబ్బలక్ష్మమ్మల రెండవ కుమార్తె వరాలును నంద్యాల వాస్తవ్యులతో వివాహము. అమరావతి చిన్న రంగయ్య, సుబ్బలక్ష్మమ్మల మూడవ కుమార్తెను గుంటూరు వాస్తవ్యులు యకమా ఆంజనేయులు, అనసూయమ్మ గార్ల మూడవ కుమారుడు శ్రీనివాసరావుతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు రవితేజ, ఆనంద్.

అమరావతి వెంకటస్వామి, తిరుపతమ్మల రెండవ కుమారుడు గోవిందరాజులుకు అక్కా, బావగారైన మాచరౌతు సుబ్బరాయుడు రంగమ్మ గార్ల ఏకైక కుమార్తె సరస్వతమ్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె రాధ, కుమారుడు రాజా.

అమరావతి వెంకటస్వామి, తిరుపతమ్మల నాల్గవ కుమారుడు రామచంద్రయ్యకు వెలుగోడు వాస్తవ్యులు చిటివేలు ఓబులం, సుబ్బలక్ష్మమ్మల కుమార్తెతో వివాహము. వీరు పాఠశాలలో డ్రిల్ మాస్టర్. వీరికి ఇద్దరు కుమార్తెలు కళ్యాణి, రమాదేవి. ఒక కుమారుడు రామ్‌కుమార్. కళ్యాణికి చిటివేలు రఘుతో వివాహము. వీరికి ఒక కుమార్తె లిఖిత. కుమారుడు నీరజ్. రెండవ కుమార్తె రమాదేవికి మాచరౌతు వెంకటేశ్వర్లుతో వివాహము వీరికి ఇద్దరు కుమారులు శ్రీధర్, జ్ఞాని. ఏకైక కుమారుడు రామ్‌కుమార్‌కు శ్యామలతో వివాహము. కుమార్తె వర్ష, కుమారుడు రాణా. అమరావతి రామచంద్రయ్యగారి రెండవ భార్య రత్నమ్మ.





అమరావతి వెంకటస్వామి, తిరుపతమ్మల ఏకైక పుత్రిక రంగమ్మని శిరివెళ్ళ వాస్తవ్యులు మాచతు సుబ్బరాయుడుతో వివాహము. వీరికి ఐదుగురు కుమారులు సుబ్రమణ్యం, కృష్ణుడు, శేఖర్, వెంకటేశ్వర్లు, వెంకటరమణ. ఏకైక పుత్రిక సరస్వతి. ఏకైక పుత్రిక సరస్వతిని తన బావమరిది గోవిందరాజులుతో వివాహము. వీరికి ఒక కుమార్తె రాధ. రాధను మాచరౌతు వెంకటరమణతో వివాహము. కుమారుడు రాజా. మాచరౌతు వెంకటరమణ, రాధకు ఇద్దరు కుమారులు రవితేజ, సుధీర్. అమరావతి గోవిందరాజులు, సరస్వతిల ఏకైక పుత్రుడు రాజాను లావణ్యాతో వివాహము. వీరికి ఒక కుమార్తె భువన, కుమారుడు నరేంద్ర.

**అమరావతి రంగయ్య గారి నాల్గవ కుమారుడు గోవిందప్ప. వీరికి కాల్వబుగ్గ ఉద్దంటి లక్ష్మయ్య, వెంకమ్మల పుత్రిక లక్ష్మిందేవితో వివాహము. వీరికి నల్గురు కుమారులు రామకృష్ణుడు వర్మ, మనోహర్ వర్మ, పాండురంగవర్మ, శివయ్య వర్మ. ఐదుగురు కుమార్తెలు ధర్మావతమ్మ, ఆదెమ్మ, జయమ్మ, విజయమ్మ, రాజేశ్వరి.**

అమరావతి గొవిందప్ప, లక్ష్మిందేవిగార్ల పెద్ద కుమారుడు రామకృష్ణవర్మకు గుంటూరు వాస్తవ్యులు నందిగం రోశియ్య, కోటమ్మ గార్ల నాల్గవ కుమార్తె రామతులశమ్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు గోపీనాధ్‌వర్మ, రఘునాధ్‌వర్మ. ఇద్దరు కుమార్తెలు రమాదేవి, హరిప్రియ. పెద్ద కుమారుడు గోపీనాధ్‌వర్మను ఆదోని వాస్తవ్యులు చిత్తారి గిరిగారి కుమార్తె లక్ష్మితో వివాహము. వీరికి ఒక కుమార్తె రాఘవ, కుమారుడు సూర్య. అమరావతి రామకృష్ణవర్మ రెండవ కుమారుడు రఘునాధ్‌వర్మకు నెల్లూరు వాస్తవ్యులు వెల్లాల సుధాకర్ లక్ష్మి గార్ల రెండవ కుమారుడు పద్మావతితో వివాహము. అమరావతి రామకృష్ణవర్మ పెద్ద కుమార్తె రమాదేవిని బళ్ళారి వాస్తవ్యులు వీరభద్రుని ప్రభాకర్‌తో వివాహము. వీరికి ఒక కుమార్తె శ్వేత. కుమారుడు వంశీ. అమరావతి రామకృష్ణవర్మ రెండవ కుమార్తె హరిప్రియను కర్నూలు వాస్తవ్యులు చిత్తారి గిడ్డయ్యగారి రెండవ కుమారుడు గిరితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు.

అమరావతి గొవిందప్ప, లక్ష్మిందేవిగార్ల రెండవ కుమారుడు మనోహర్ వర్మకు గుంటూరు వాస్తవ్యులు నందిగం కోటయ్య, మహాలక్ష్మమ్మల ఐదవ కుమార్తె సావిత్రితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు రాజగోపాల్‌వర్మ, రమేష్‌వర్మ. కుమార్తె లావణ్య. పెద్ద కుమారుడు రాజగోపాల్ వర్మకు గుంటూరు వాస్తవ్యులు యకమా సుబ్రమణ్యం, విజయమ్మల ఏకైక పుత్రిక బాలభారతితో వివాహము.

వీరికి ఒక కుమారుడు రమేష్ వర్మ. కుమార్తె సాయి జాగృతి. అమరావతి మనోహర్ వర్మ రెండవ కుమారుడు రమేష్ వర్మ చిన్న వయస్సులోనే మరణించారు. కుమార్తె లావణ్యను నంద్యాల వాస్తవ్యులు చిత్తారి శేషయ్య, వసంతమ్మల కుమారుడు శ్యామసుందర్‌తో వివాహము. వీరికి ఒక కుమార్తె ఉష.

అమరావతి గొవిందప్ప, లక్ష్మిందేవిగార్ల మూడవ కుమారుడు పాండురంగ వర్మకు వెలుగోడు వాస్తవ్యులు చిటివేలు ఓబులం, సుబ్బలక్ష్మమ్మల పుత్రిక శమంతమ్మతో వివాహం. వీరికి ఒక కుమారుడు రాఘవేంద్ర. ఇద్దరు కుమార్తెలు రాధ, రజని. వీరికి వివాహములైనవి.

అమరావతి గొవిందప్ప, లక్ష్మిందేవిగార్ల నాల్గవ కుమారుడు శివయ్యవర్మకు నంద్యాల వాస్తవ్యులు చిత్తారి కిష్టప్ప కుమార్తె ధనమ్మతో వివాహము. వీరు చాలా కాలం మిలటరీలో పనిచేసియున్నారు. వీరికి ఒక కుమార్తె ప్రణీత. ఇద్దరు కుమారులు.

అమరావతి గొవిందప్ప, లక్ష్మిందేవిగార్ల పెద్ద కుమార్తె ధర్మావతిని నంద్యాల వాస్తవ్యులు మాచరౌతు సుబ్బయ్య, లలితమ్మల కుమారుడు డాక్టర్ కృష్ణమూర్తితో వివాహము. వీరికి నల్గురు కుమార్తెలు మహేశ్వరి, ప్రమీల, సుజాత, శ్రీదేవి. ఒక కుమారుడు సురేష్ వర్మ.

అమరావతి గొవిందప్ప, లక్ష్మిందేవిగార్ల రెండవ కుమార్తె ఆదెమ్మను తన బావమరిదియైన ఉద్దంటి లక్ష్మయ్య, వెంకమ్మల కుమారుడు కృష్ణమూర్తితో వివాహము. వీరు కర్నూలులో రిజిస్ట్రార్‌గా సేవలందించి రిటైర్డ్ అయ్యారు. వీరికి సంతానము లేదు. పెక్కు ఆలయాలకు దానధర్మములు చేసియున్నారు.

అమరావతి గొవిందప్ప, లక్ష్మిందేవిగార్ల మూడవ కుమార్తె జయమ్మను హైదరాబాద్ వాస్తవ్యులు పోగులగుంట్ల వెంకట్రావు, ఈశ్వరమ్మల పెద్ద కుమారుడు జగన్నాధవర్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె సరిత. ఇద్దరు కుమారులు వంశీ, సిద్దార్థ.

అమరావతి గొవిందప్ప, లక్ష్మిందేవిగార్ల నాల్గవ కుమార్తె విజయమ్మను గుంటూరు వాస్తవ్యులు యకమా వెంకటస్వామి, నాగలక్ష్మమ్మల పెద్ద కుమారుడు సుబ్రమణ్యదాసుతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు నాగసురేష్, ఫణికుమార్. కుమార్తె బాలభారతి.

అమరావతి గొవిందప్ప, లక్ష్మిందేవిగార్ల ఐదవ కుమార్తె రాజరాజేశ్వరిని నెల్లూరు వాస్తవ్యులు యకమా రమణయ్య, సుబ్బమ్మ గార్ల పెద్ద కుమారుడు

**Page No. 48**



వెంకటేశ్వర్లుతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు లావణ్య, లక్ష్మి. కుమారుడు సాయి.

**కర్నూలు జిల్లా, నొస్సం గ్రామములో యాదగిరి తిమ్మయ్య, భార్య సుబ్బమ్మతో నివసించియున్నారు. వీరికి భూములు, తోటలు ఆదాయ వనరులు. వీరికి ఇద్దరు కుమార్తెలు వెంకట లక్ష్మమ్మ, సుబ్బలక్ష్మమ్మ.** పెద్ద కుమార్తెను అమరావతి పెద రంగయ్యతో వివాహము. వీరికి ముగ్గురు కుమార్తెలు రుక్మిణి, సులోచన, దేవి. రెండవ కుమార్తె సుబ్బలక్ష్మమ్మను అమరావతి చిన్న రంగయ్యతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు రవి, జనార్ధన్. ముగ్గురు కుమార్తెలు రాజ్యలక్ష్మి, వరాలు, వాణి.

అమరావతి పెద రంగయ్య, అమరావతి సుబ్బరాయుడు అన్నదమ్ములు. పెద రంగయ్య భార్య వెంకట లక్ష్మమ్మ. అమరావతి సుబ్బరాయుడు డ్రాయింగ్ టీచరుగా చేసి రిటైర్ అయ్యారు. వీరి భార్య అనంతమ్మ. వీరికి ఇద్దరు కుమారులు రామయ్య, లక్ష్మయ్య.

**వరాటి వారు : వీరు నూజివీడు సంస్థానములో పలురకాల పనులు, చెక్కతో నగిషీలు, కళాకృతులు, బొబ్బిలి వీణలు తయారీలో సిద్ధహస్తులు. వరాటి వీరయ్య, సుబ్బమ్మ గార్లకు ఇద్దరు కుమారులు నర్సయ్య, గోపయ్య. పెద్ద కుమారుడు నర్సయ్యకు నెల్లూరు వాస్తవ్యులు నందిగం వెంకన్న సోదరి నరసమ్మ గారితో వివాహము. వీరికి ఏడుగురు కుమారులు వీరయ్య, సుబ్బారావు, సుబ్రమణ్యం, రామ్మోహన్, కృష్ణ, రాధాకృష్ణ, ప్రసాద్. ఇద్దరు కుమార్తెలు శీతారావమ్మ, శ్రీదేవి.** వీరు అందరూ విద్యావంతులు. గవర్నమెంట్ ఉద్యోగములుచేసి రిటైర్ అయి ఉన్నారు.

వరాటి నర్సయ్య, నరసమ్మల పెద్ద కుమారుడు వరాటి వీరయ్య తహసిల్దారుగా చేసి ఉన్నారు. నంద్యాల వాస్తవ్యులు చిత్తారి తహసిల్దారు సుబ్బన్న గారి కుమార్తె పద్మావతితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. స్థిర నివాసము ఏలూరు.

వరాటి నర్సయ్య నరసమ్మల రెండవ కుమారుడు సుబ్బారావు. వీరు ఎండోమెంట్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేశారు. ఏలూరు వాస్తవ్యులు నాంపల్లి సూర్యం గారి కుమారుడు పెదరామారావుగారి రెండవ కుమార్తె రత్నాబాయితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు లక్ష్మి, దుర్గ. ఇద్దరు కుమారులు. వీరి స్థిర నివాసము విజయవాడ.

వరాటి నర్సయ్య నరసమ్మల మూడవ కుమారుడు సుబ్రమణ్యం. వీరు బెంగుళూరు నందు ఐ.టి.ఐ. ఇండస్ట్రీలో ఉద్యోగం చేసి రిటైర్ అయ్యారు. గుంటూరు వాస్తవ్యులు నందిగం కోటయ్య, మహాలక్ష్మమ్మల ఆరవ పుత్రిక భారతితో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు నాగకృష్ణ, ఉమామహేశ్వర, జగదీష్. వీరి స్థిర నివాసము బెంగుళూరు. వరాటి సుబ్రమణ్యం, భారతి గార్ల పెద్ద కుమారునికి హైదరాబాద్ వాస్తవ్యులు పోగులగుంట్ల జగన్నాథవర్మ, జయమ్మల ఏకైక పుత్రిక సరితతో వివాహము. వీరికి ఒక కుమార్తె పూర్వజ. కుమారుడు సాయి అభిషేక్.

వరాటి సుబ్రమణ్యం, భారతి గార్ల రెండవ కుమారుడు ఉమామహేశ్వర. గుంటూరు వాస్తవ్యులు వీరభద్ర శేషయ్య, నాగమణి గార్ల ప్రథమ పుత్రిక వెంకట నాగ మాలతితో వివాహము. వీరికి ఒక కుమార్తె గోపిక.

వరాటి సుబ్రమణ్యం, భారతి గార్ల మూడవ కుమారుడు జగదీష్. వీరికి బెంగుళూరు వాస్తవ్యులు నారాయణరాజు, రత్నమ్మల రెండవ కుమార్తె శోభారాణితో వివాహము. వీరికి ఒక కుమారుడు హరితేజ. కుమార్తె ఛార్వి భారతి.

వరాటి నర్సయ్య నరసమ్మల నాల్గవ కుమారుడు రామ్మోహన్. బి.హెచ్.ఇ.ఎల్.లో పనిచేసి రిటైర్ అయ్యారు. నెల్లూరు జిల్లా, బుచ్చిరెడ్డిపాలెం వాస్తవ్యులు నందిగం పొట్టియ్య, బుజ్జమ్మల కుమార్తె విజయతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు శంకర్, కిరణ్ కుమార్. వీరి స్థిర నివాసం హైదరాబాద్.

వరాటి నర్సయ్య, నరసమ్మల ఐదవ కుమారుడు కృష్ణ. టి.డబ్ల్యూ.డి. డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం చేసి రిటైర్ అయ్యారు. ఏలూరు వాస్తవ్యులు నాంపల్లి సూర్యం కుమారుడు పెదరామారావు గారి మూడవ కుమార్తె తులసీబాయితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు రాము, శ్యాము. వీరి స్థిర నివాసం విజయవాడ.

వరాటి నర్సయ్య, నరసమ్మల ఆరవ కుమారుడు రాధాకృష్ణ. హిందీ టీచర్‌గాచేసి రిటైర్ అయ్యారు. కర్నూలు జిల్లా, జమ్ములమడుగు వాస్తవ్యులు చిటివేలు ఆంజనేయులు, సుబ్బలక్ష్మమ్మ గార్ల నాల్గవ కుమార్తె మణిమాలతో వివాహము. వీరు హిందీ టీచరుగా పనిచేయుచున్నారు. వీరికి ఇద్దరు కుమార్తెలు రేణుకారాణి, రేవతిరాణి. పెద్ద కుమార్తె రేణుకను గుంటూరు వాస్తవ్యులు వీరభద్ర శంకర్రావు, పద్మావతిల రెండవ కుమారుడు కిరణ్ కుమార్‌తో వివాహము. రెండవ కుమార్తె రేవతిరాణిని హైదరాబాద్ వాస్తవ్యులు సముద్రాల నరేంద్రగారి కుమారుడు శ్రీకాంత్‌తో వివాహము. వీరి స్థిర నివాసము బెంగుళూరు.

**Page No.**
**49**



వరాటి నర్సయ్య, నరసమ్మల ఏడవ కుమారుడు ప్రసాద్. వీరు ప్రభుత్వ బ్యాంకు ఉద్యోగి. వీరి భార్య శ్రీ. వీరికి ఒక కుమారుడు సాయికిరణ్. కుమార్తె సునంద. వీరి స్థిర నివాసం నూజివీడు.

వరాటి నర్సయ్య, నరసమ్మల పెద్ద కుమార్తె శీతారావమ్మను నంద్యాల వాస్తవ్యులు పాణెం శివమారుతితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

వరాటి నర్సయ్య, నరసమ్మల రెండవ కుమార్తె శ్రీదేవిని కర్నూలు జిల్లా, చాగలమర్రి వాస్తవ్యులు అమరావతి గురుప్రసాద్ గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు సుబ్రమణ్యం. ఒక కుమార్తె నాగలక్ష్మి.

**నామేపల్లి శ్రీరాములు గారు, వీరి ధర్మపత్ని కస్తూరి గారు. వీరు తూర్పు గోదావరి నుండి గుంటూరుకు వలస వచ్చిరి.** వీరికి ఇద్దరు కుమారులు అంజనేయులు, వెంకటేశ్వరరావు. ఇద్దరు కుమార్తెలు ఉమామహేశ్వరి, శివకుమారి.

నామేపల్లి శ్రీరాములు, కస్తూరి గార్ల పెద్ద కుమారుడు ఆంజనేయులు గారు. వీరు గుంటూరులో కార్పెంటరీ పని చేసెడివారు. వీరు నూజివీడుకు చెందిన పేరురి పాండురంగారావు గారి సోదరితో వివాహము. నామేపల్లి అంజనేయులు గారికి ఇద్దరు తోబుట్టువులు. తన పెద్ద చెల్లెలు ఉమామహేశ్వరిని తమిళనాడు, అంబరం వాస్తవ్యులు శ్రీరాములు రాజుతో వివాహము. మహాలక్ష్మిగారి చిన్న వయస్సునందే మరణించిరి. వీరికి ఒక కుమారుడు.

నామేపల్లి ఆంజనేయులుగారి ద్వితీయ సోదరి శివకుమారి. ఈమెను ఏలూరుకు చెందిన నందిగం గోపాల్‌గారితో వివాహము. వారికి ముగ్గురు కుమార్తెలు. అందరికీ వివాహము లైనవి. నామేపల్లి అంజనేయులు గారు వారి పెద్ద మేనకోడలు గారి సంరక్షణలో ఉన్నారు.

నామేపల్లి శ్రీరాములు, కస్తూరి గార్ల చిన్న కుమారుడు వెంకటేశ్వరరావు. వీరు గుంటూరులో కార్పెంటరీ పని చేసెడివారు. వెంకటేశ్వరరావు గారు నూజీవీడు వాస్తవ్యులు వెల్లాల చెంచురామ పాపయ్య గారి అమ్మాయి సీతామహాలక్ష్మితో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు అశోక్ కుమార్, రాంకుమార్, పవన్ కుమార్.

నామేపల్లి వెంకటేశ్వరరావు, సీతామహాలక్ష్మి గార్ల ప్రథమ పుత్రుడు అశోక్ కుమార్ గారు గుంటూరుకు చెందిన నందిగం సూర్య ప్రకాశరావు గారి కుమార్తెతో వివాహము. అశోక్ కుమార్ గారు ఎల్.ఐ.సి. ఏజెంట్‌గా పనిచేయచున్నారు. వీరికి

ఒక కుమారుడు సాయిరాం కుమార్. కుమార్తె భార్గవి. ఈమెను రాజంపేట వాస్తవ్యులు గణితం వెంకట సుబ్బరాజు, సుబ్బమ్మ గార్ల కుమారుడు చంద్రశేఖర్‌తో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు.

నామేపల్లి వెంకటేశ్వరరావు, సీతామహాలక్ష్మి గార్ల ద్వితీయ పుత్రుడు రాం కుమార్ గారు. వీరు అకౌంటెంట్‌గా పనిచేయుచున్నారు. వీరు నూజివీడు చెందిన వెల్లాల వెంకయ్య గారి ప్రధమ కుమార్తె కుమారితో వివాహము. వీరికి ఒక ఇద్దరు కుమార్తెలు రేవతి, మాలతి.

నూజివీడుకు చెందిన వెంకయ్య గారి ద్వితీయ కుమారుడు సీతారామారావు గారితో రేవతికి వివాహము. వీరు కలప అడితి సామిల్‌ను నడుపుతున్నారు. వీరికి ఒక కుమార్తె, కుమారుడు.

నామేపల్లి వెంకటేశ్వరరావు, సీతామహాలక్ష్మి గార్ల తృతీయ పుత్రుడు పవన్ కుమార్. వీరు అకౌంటెంట్‌గా పనిచేయుచున్నారు. వీరు నెల్లూరు జిల్లాకు నాగేశ్వరితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు.

**గాజర్ల బాబు :** వీరు నూజివీడుకు చెందిన గాజర్ల బాపిరాజు, పెద్ద ఆదెమ్మగార్ల కుమారుడు. గాజర్ల బాబుకు ఇద్దరు సోదరులు కలరు. చిన్న వయస్సునందే మరణించిరి. గాజర్ల బాబు గారు చిలకలూరిపేటకు చెందిన యకమా చిన్న చిన్న నరసింహంగారి కుమార్తె లక్ష్మితో వివాహము. వీరు గుంటూరు నందే కార్పెంటరీ వర్క్ చేస్తున్నారు వీరికి ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమారులు. వీరి ప్రధమ కుమారుడు బాపిరాజు (బాబి). వీరు గుంటూరుకు చెందిన వారి అమ్మాయి సాంబులుతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె. వీరు గుంటూరు నందే కిరాణా వ్యాపారము. గాజర్ల బాబు గారి ద్వితీయ కుమారుడు నరేంద్ర. వీరు తమ అక్కగారి కుమార్తె రూపాదేవితో వివాహము. వీరికి ఒక పాప.

గాజర్ల బాబు గారి ప్రధమ కుమార్తె అనూరాధ. వీరు విజయవాడకు చెందిన ఫణికుమార్‌గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

గాజర్ల బాబు గారి ద్వితీయ కుమార్తె నాగేశ్వరి. వీరు కడపజిల్లా, గాలివీడుకు చెందిన చెందూరి విజయరామయ్యగారితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె. గుంటూరు నందే నివాసము.

**మాచర్ల వెంకట సుబ్బయ్య :** వీరు ప్రకాశంజిల్లా, కురిచేడుకు చెందిన మాచర్ల ఆదెయ్య, బాలకోటమ్మగార్ల ప్రధమ కుమారుడు. వీరు కృష్ణా జిల్లా,

Page No.

50



విజయవాడకు చెందిన వెల్లాల వెంకయ్యగారి ప్రధమ కుమార్తె దుర్గాదేవితో వివాహము. వీరు గుంటూరు నందు ప్రముఖ హాస్పటల్ నందు కాంపౌండర్‌గా పనిచేశారు. వీరికి నల్గురు కుమార్తెలు.

మాచర్ల వెంకట సుబ్బయ్యగారి ప్రధమ కుమార్తె పార్వతిని విజయవాడకు చెందిన వెల్లాల శేషగిరిరావు-అనసూయగార్ల ప్రధమ కుమారుడు మల్లిఖార్జునరావు గారితో వివాహము. విజయవాడ వీరి స్థిరనివాసము.

మాచర్ల వెంకట సుబ్బయ్యగారి ద్వితీయ కుమార్తె పద్మజ. వీరు గుంటూరు జిల్లా, చిలకలూరిపేటకు చెందిన యకమా శంకరరావుగారి ప్రధమ కుమారుడు శ్రీనివాసరావుతో వివాహము. వీరు స్టేట్ బ్యాంక్ నందు ఉద్యోగము. చిన్న వయస్సునందే అకాల మరణము చెందిరి. తదపరి వీరి ఉద్యోగము వీరి భార్య పద్మజగారు నిర్వహించుచున్నారు. వీరికి ఒక కుమారుడు. గుంటూరు వీరి స్థిర నివాసము.

మాచర్ల వెంకట సుబ్బయ్య గారి తృతీయ కుమార్తె వాణి. వీరు నూజీవీడుకు చెందిన వెల్లాల త్యాగరాజు గారి కుమారుడు ప్రసాద్ గారితో వివాహము. వీరు గుంటూరు నందే బిజినెస్ నందు స్థిరపడినారు. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

మాచర్ల వెంకట సుబ్బయ్యగారి కనిష్ఠ పుత్రిక అమరేశ్వరి. ఈమెను కృష్ణా జిల్లా, నూజీవీడుకు చెందిన వరాటి సుబ్బారావుగారి కుమారుడు శ్రీనివాస్‌తో వివాహము. వీరు విజయవాడ కనకదుర్గా దేవస్థానము నందు ఉద్యోగము చేయుచున్నారు.

**మాచర్ల చంద్రమౌళి :** వీరు ప్రకాశంజిల్లా, కురిచేడుకు చెందిన మాచర్ల ఆదెయ్య, బాలకోటమ్మగార్ల ద్వితీయ కుమారుడు. వీరు విజయవాడకు చెందిన వెల్లాల వెంకయ్య గారి తృతీయ కుమార్తె సులోచనతో వివాహము. నెల్లూరు జిల్లాలో హైస్కూల్ టీచరుగా పనిచేసి రిటైర్డ్ అయ్యారు. వీరికి ఒక కుమారుడు యుగంధర్. ఒక కుమార్తె సుజాత. వీరి కుమారుడు యుగంధర్ వరంగల్ నందు ఎన్.ఐ.ఐ.టి.నందు ప్రొఫెసర్‌గా పనిచేయుచున్నారు. చంద్రమౌళి గారి కుమార్తె సుజాతను హైదరాబాద్‌కు చెందిన నందిగం చెంచెయ్యగారి ప్రధమ కుమారునితో వివాహము. హైదరాబాద్ స్థిర నివాసము.

**మాచర్ల నాగేశ్వరరావు :** వీరు ప్రకాశంజిల్లా, కురిచేడుకు చెందిన మాచర్ల ఆదెయ్య, బాలకోటమ్మగార్ల తృతీయ కుమారుడు. వీరు ప్రకాశం జిల్లాలో

హెడ్‌మాస్టర్‌గా రిటైర్డ్ అయ్యారు. వీరు విజయవాడకు చెందిన వెల్లాల వెంకయ్యగారి కుమార్తె కుసుమాంబతో వివాహము. వీరికి ఇరువురు కుమార్తెలు, ఒక కుమారుడు శివకుమార్. వీరు తిరుపతి నందు సైంటిస్ట్‌గా గవర్నమెంట్ జాబ్ చేయుచున్నారు.

**మాచర్ల వెంకటేశ్వర్లు :** వీరు ప్రకాశంజిల్లా, కురిచేడుకు చెందిన మాచర్ల ఆదెయ్య, బాలకోటమ్మగార్ల చతుర్ధ కుమారుడు. వీరు కృష్ణా జిల్లా, నూజివీడుకు చెందిన వరాటి రాఘవయ్య గారి ద్వితీయ కుమార్తె రమాదేవితో వివాహము. వీరికి ఇరువురు కుమార్తెలు.

**కామరుషి అప్పారావు : వీరి స్వస్థలము విజయవాడ. వీరి తండ్రిగారి పేరు కామరుషి (బందరు) సుబ్బారావు గారు. వీరి భార్య గౌరీ మనోహరమ్మ. వీరికి ఏడుగురు కుమారులు. ఒక కుమార్తె. కామరుషి అప్పారావు, వీర కనకరాజు, జోగేంద్రరావు, చంద్ర శేఖరరావు, మోహనరావు, ఉమా మహేశ్వరరావు, పరమేశ్వరరావు. కుమార్తె తులసీదేవి.**

కామరుషి అప్పారావు గారు గుంటూరు కొత్తపేటకు చెందిన వెల్లాల సుబ్రమణ్యం, వెంకటలక్ష్మమ్మ గార్ల ద్వితీయ కుమార్తె మీనాదేవితో వివాహము. వీరు పట్టాభిపురం హైస్కూల్ నందు డ్రాయింగ్ టీచర్‌గా పనిచేసి రిటైర్డ్ అయ్యారు. వీరికి ఇద్దరు కుమారులు. ప్రథముడు నాగ సురేష్ గారు. వీరు గుంటూరు సాంబశివపేటకు చెందిన నందిగం కోటేశ్వరరావు గారి ప్రథమ పుత్రిక శిరీషతో వివాహము. వీరు సొంతముగా వ్యాపారము చేయుచున్నారు. వీరికి తారక నాగ మనోజ్ మగ సంతానము. అప్పారావుగారి ద్వితీయ కుమారుడు హరి నాగ వేంకట సుబ్రమణ్యం. వీరు నరసరావుపేట దగ్గర గవర్నమెంట్ పాఠశాల యందు టీచరుగా పనిచేయుచున్నారు. వీరికి ఒక కుమార్తె మేఘనా ఫణీశ్రీ, కుమారుడు జ్ఞాన వేంకట ఫణీంద్ర.

కామరుషి అప్పారావు గారి ప్రథమ సోదరుడు వీర కనకరాజు గారు. వీరు హైదరాబాద్‌కు చెందిన ముద్దు కృష్ణమరాజుగారి కుమార్తె నాగలక్ష్మితో వివాహము. వారికి ఒక కుమారుడు, కుమార్తె.

కామరుషి అప్పారావుగారి ద్వితీయ సోదరుడు కామరుషి జోగేంద్రరావు గారు. వీరు వరిగొండకు చెందిన అమ్మాయితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

అప్పారావు గారి తృతీయ సోదరుడు గుంటూరుకు చెందిన కామరుషి చంద్రశేఖర్ గారు. వీరికి వెల్లాల వెంకటేశ్వర్లు, పాపాయమ్మ గార్ల కుమార్తె రాజేశ్వరితో

Page No.
51



వివాహము. వీరికి ఒక కుమారుడు, ఒక కుమార్తె.

నాల్గవ సోదరుడు గుంటూరుకు చెందిన కామరుషి మోహనరావు గారు. వీరు కాళహస్తి ఆదెయ్యగారి కుమార్తె సుశీలతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె కలరు. వీరి కుమార్తెను బందరు వాస్తవ్యులు కాళహస్తి వారితో సంబంధము.

ఐదవ సోదరుడు కామరుషి ఉమామహేశ్వరరావు గారు. తమ అక్క బావలు అయిన తులసి, నాంపల్లి సత్యనారాయణగార్ల ప్రథమ కుమార్తె ఉమాదేవి, వరాటి మహేష్‌తో వివాహము. నూజివీడు నందు కిరాణా షాపు నిర్వహించుచున్నారు. వీరికి ఒక్కడే కుమారుడు పేరు లాల్ మనోహర్ రాజు.

కామరుషి అప్పారావు గారి ఆరవ సోదరుడు కామరుషి పరమేశ్వరరావు గారు. గుంటూరుకు చెందిన యకమా సుబ్బరాజుగారి ప్రథమ కుమార్తె రమాదేవితో వివాహము. వీరు విజయవాడ నందే ఫ్యాన్సీ షాపు నిర్వహించు చున్నారు. వీరికి ఒక కుమారుడు పేరు హేమంత్.

కామరుషి అప్పారావు గారి ఏకైక సోదరి తులసీదేవిని నూజివీడు వాస్తవ్యులు నాంపల్లి చిన్నరామారావు గారి ఏకైక కుమారుడు సత్యనారాయణ గారితో వివాహము. వీరికి ఇరువురు కుమారులు శంకర్, రాము. ఇరువురు కుమార్తెలు ఉమాదేవి, సుజాత. వీరు కృష్ణా జిల్లా, నూజివీడు నందు స్థిర నివాసము.

**పైకోట సుబ్రమణ్యం :** వీరు కడప జిల్లా రాజంపేటకు చెందినవారు. వీరు కరిచేడుకు చెందిన వెల్లాలవెంకట సుబ్బయ్యగారి సోదరి లక్ష్మినరసమ్మ గారితో వివాహము. వివాహానంతరము వీరు గుంటూరులో స్థిరపడిరి. వీరికి ముగ్గురు కుమారులు, నల్గురు కుమార్తెలు. వీరు దేవాలయ వాహనాల పనులు చేసెడివారు. వీరి ప్రథమ కుమార్తెను విశాఖపట్నంకు చెందిన వారితో వివాహము. వీరి ద్వితీయ కుమార్తె సుబ్బమ్మను వెల్లాల వెంకట సుబ్బయ్యగారితో వివాహము. వీరు కడప జిల్లా ప్రొద్దుటూరు నందు దేవాలయముల పనులు చేయుచూ పేరు గడించిరి. వీరికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. పెద్ద కుమారుడు వెల్లాల చలపతిరావుకు గుంటూరుకు చెందిన యకమా అంజయ్యగారి కుమార్తె రంగనాయకమ్మ (బుల్లెమ్మాయి)తో వివాహము. వీరికి ముగ్గురు కుమారులు.

తృతీయ కుమార్తె రవణమ్మ. ఈమెను రాజంపేట మండలం, మిట్టపల్లికి చెందిన వెల్లాల చెలమరాజుగారితో వివాహము. వీరు టైలరింగ్ వృత్తిలో స్థిరపడిరి. నాల్గవ కుమార్తె సావిత్రమ్మను నూజివీడుకు చెందిన వ్యాసరౌతు వెంకటప్పయ్య

గారితో వివాహము. వీరు వివాహానంతరము గుంటూరు నందు కార్పెంటరీ పని నందు స్థిరపడిరి. వీరికి ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు.

పైకోట సుబ్రమణ్యంగారి ప్రధమ కుమారుడు సుబ్బయ్య. వీరు గుంటూరు జిల్లా నాదెండ్లకు చెందిన ఉద్దంటి కోటయ్య, శేషమ్మగారి రెండవ కుమార్తెతో వివాహము. వీరికి ఒక కుమార్తె, కుమారుడు.

పైకోట సుబ్రమణ్యం గారి ద్వితీయ కుమారుడు వెంకటేశ్వర్లు. వీరు కురిచేడుకు చెందిన తన మేనమామగారైన వెల్లాల వెంకట సుబ్బయ్య గారి కుమార్తె సుబ్బమ్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. వీరు గుంటూరు నందే కార్పెంటరీ పని యందు స్థిరపడిరి.

పైకోట సుబ్రమణ్యం గారి తృతీయ కుమారుడు రామమూర్తి. వీరు నెల్లూరుకు చెందిన బాపనూరి వారి అమ్మాయి సూర్యకళతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. వీరి పెద్దకుమారుడు సుబ్రమణ్యం. వీరు ప్రొద్దుటూరుకు చెందిన విశ్వనాథం గారి అమ్మాయితో వివాహము. వీరు ఎలక్ట్రికల్ పని చేసెడివారు. రెండవ కుమారుడు ఆదినారాయణ. వీరు కురిచేడుకు చెందిన రత్నకుమారితో వివాహము. వీరు గుంటూరు నందే కార్పెంటరీ పని చేయుచున్నారు.

పైకోట రామమూర్తిగారి ప్రధమ కుమార్తె లీల. ఈమెకు నెల్లూరుకు చెందిన సురేష్‌తో వివాహము. ద్వితీయ కుమార్తె జ్యోతి. ఈమెను నెల్లూరుకు చెందిన నందిగం రాధయ్యగారి గారి తమ్ముడు సురేష్‌తో వివాహము. తృతీయ కుమార్తె దేవిని నెల్లూరుకు చెందిన బాపనూరి బాబు గారితో వివాహము.

**ఉద్దంటి సీతారామయ్య :** వీరు గుంటూరు జిల్లా, నాదెండ్లకు చెందిన ఉద్దంటి కోటయ్య, శేషమ్మ గార్ల ఏకైక కుమారుడు. వీరు కురిచేడుకు చెందిన కాళహస్తి నారాయణగారి కుమార్తెతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు. వీరు గుంటూరు నందే స్థిర నివాసము. వీరి ప్రధమ కుమార్తె శ్రావణిని గుంటూరుకు చెందిన యకమా వెంకటరత్నంగారి ప్రధమ కుమారుడు నరేంద్రతో వివాహము. వీరికి ఒక కుమారుడు, ఒక కుమార్తె. రెండవ కుమార్తె వెంకట నాగలక్ష్మిని కడపకు చెందిన చిత్తారి ప్రభాకర్ గారితో వివాహము.

**వెల్లాల వెంకట నర్సయ్య :** వీరు కడప జిల్లా, మిట్టపల్లి గ్రామ వాస్తవ్యులు వెల్లాల చెలమరాజు, రమణమ్మగార్ల ప్రధమ కుమారుడు. వీరు కురిచేడుకు చెందిన

Page No. 52



కాళహస్తి నారాయణగారి ప్రధమ కుమార్తెతో వివాహము. వీరికి ఒక కుమారుడు, ముగ్గురు కుమార్తెలు.

**కాళహస్తి నారాయణ :** వీరు ప్రకాశం జిల్లా, కురిచేడు గ్రామ కాపురస్తులు. వీరు దేవాలయముల వాహనముల పనులు చేసెడివారు. వీరికి నలుగురు కుమార్తెలు. ఒక కుమారుడు. వీరి ఏకైక కుమారుడు శ్రీనివాసరావు. వీరు నంద్యాలకు చెందిన బొప్పర్ల వెంకటేష్ వర్మగారి కుమార్తె సుజాతతో వివాహము. వీరు గుంటూరు నందే కార్పెంటరీ పని చేయుచున్నారు.

కాళహస్తి నారాయణ గారి ప్రధమ కుమార్తె లక్ష్మమ్మను గుంటూరుకు చెందిన వల్లూరివారితోట కాపురస్తులు వెల్లాల వెంకట నర్సయ్యగారితో వివాహము. రెండవ కుమార్తె రాజ్యలక్ష్మిని గుంటూరుకు చెందిన ఉద్దంటి సీతారామయ్య గారితో వివాహము. మూడవ కుమార్తె సుజాతను కడపకు చెందిన రాజమ్మ, నరసింహం గార్ల కుమారుడు సుందరంతో వివాహము. నాల్గవ కుమార్తె సుబ్బరత్నంను కడపకు చెందిన అమరావతి నాగరాజు గారితో వివాహము.

**నందిగం రాఘవయ్య :** వీరు నెల్లూరు జిల్లాకు చెందినవారు. వీరు ఆధ్యాత్మిక విషయములలో ఆరితేరినవారు. వీరు నెల్లూరుకు చెందిన అల్లూరి రామస్వామి గారి సోదరి జాలమ్మ గారితో వివాహము. వీరు గుంటూరు నందే నివాసము. వీరికి ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. నందిగం రాఘవవయ్య గారి ఏకైక సోదరి పాణ్యం రాఘవమ్మ గారు.

**నందిగం రాఘవయ్య గారి ప్రధమ కుమారుడు సుబ్బయ్య. వీరు ప్రకాశం, కురిచేడుకు చెందిన కాళహస్తి సుబ్బయ్యగారి కుమార్తె మహాలక్ష్మమ్మతో వివాహము.** వీరు గుంటూరు నందే బిల్డింగ్ & షోరూమ్స్ ఫర్నీచర్ తయారీలో నిపుణులు. వీరికి జిల్లాలో మంచి పేరు కలదు. వీరికి ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు.

సుబ్బయ్యగారి ప్రధమ కుమారుడు శ్రీనివాసరావు. తండ్రిగారి వద్దనే కార్పెంటరీ పని చేయుచున్నారు. వీరు కాళహస్తి ఆదెయ్య, విశాలాక్షమ్మ గార్ల కుమార్తె నాగమణితో వివాహము. వీరికి ఒక కుమార్తె పార్వతి. ఈమెను మలకపాటి ప్రభాకర్ గారి కుమారుడు సతీష్‌తో వివాహము. గుంటూరు నందే స్థిర నివాసము.

నందిగం సుబ్బయ్య గారి ద్వితీయ కుమారుడు సుబ్రమణ్యం. వీరు తమ అక్క, బావగార్లు అయిన వెల్లాల దుర్గారావు గారి కుమార్తె మాలతితో వివాహము. వీరు గుంటూరు నందే స్థిర నివాసమం.

నందిగం సుబ్బయ్య గారి తృతీయ కుమారుడు రాజారావు. వీరు ఖమ్మంమెట్టుకు చెందిన వీరయ్యగారి కుమార్తె జయతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె. వీరు గుంటూరు నందే కార్పెంటరీ పని చేసెడివారు.

నందిగం సుబ్బయ్య గారి ప్రథమ కుమార్తె ప్రమీలాదేవి. వీరు గుంటూరు వల్లూరివారితోటకు చెందిన వెల్లాల దుర్గారావు గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె. వీరు గుంటూరు జిల్లా ప్రత్తిపాడు మండలం, కొల్లిపర గ్రామము నందు స్థిర నివాసము.

నందిగం సుబ్బయ్య గారి ద్వితీయ కుమార్తె నాగమణి. వీరు ఏలూరుకు చెందిన ముత్యాల వెంకటేశ్వర్లుగారి కుమారుడు ప్రకాష్‌తో వివాహము. వీరు ఆర్.టి.సి.నందు ఉద్యోగము. వీరికి ఒక కుమారుడు, ఒక కుమార్తె.

నందిగం సుబ్బయ్య గారి తృతీయ కుమార్తె రాగమంజరి. ఈమెను నెల్లూరుకు చెందిన నల్లగొండ ఆదినారాయణరాజుగారి కుమార్తె శ్రీనివాసరాజు గారితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు.

**నందిగం రాఘవయ్య గారి ద్వితీయ కుమారుడు సూర్యప్రకాశరావు (సూరయ్య). వీరు హైదరాబాద్‌కు చెందిన పోగులగుంట నరసింహారావు, నాగరత్నమ్మల కుమార్తె సరోజినిదేవితో వివాహము.** వీరు గుంటూరులో బిల్డింగ్ కార్పెంటరీ వర్క్ నందు సిద్ధహస్తులు. వీరికి నల్గురు కుమారులు. ఇద్దరు కుమార్తెలు.

నందిగం సూరయ్య గారి ప్రథమ కుమారుడు సత్యనారాయణ. హైదరాబాద్‌కు చెందిన పోగులగుంటవారి అమ్మాయితో వివాహము. ద్వితీయ కుమారుడు వెంకటరమణ. ఎలక్ట్రికల్ పనులు చేసెడివారు. గుంటూరు నందు స్థిర నివాసము. వీరు చిలకలూరిపేటకు చెందిన కాళహస్తి పాండురంగారావు గారి కుమార్తె మాధవీలతతో వివాహము. వీరికి ఒక కుమారుడు.

నందిగం సూరయ్యగారి తృతీయ కుమారుడు శ్రీనివాసరావు. కర్నూలు, శిరివెళ్ళకు చెందిన చిత్తారి సంజీవయ్య గారి కుమార్తెతో వివాహము. సూరయ్య గారి నాల్గవ కుమారుడు శ్రావణ్ కుమార్. వీరు మిలటరీ నందు జాబ్‌చేసి తదుపరి విజయవాడకు చెందిన వెల్లాల శేషగిరిరావు, అనసూయమ్మ గార్ల పుత్రిక భ్రమరాంబతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె. గుంటూరు స్థిర నివాసము.

నందిగం సూరయ్య గారి ప్రథమ కుమార్తె వెంకటలక్ష్మి. ఈమెను నంద్యాలకు చెందిన చిత్తారి కృష్ణమూర్తి గారి కుమారుడు పెద్దబాబుతో వివాహము.





నందిగం సూరయ్య గారి ద్వితీయ కుమార్తె అరుంధతి. వీరు గుంటూరుకు చెందిన నామేపల్లి వెంకటేశ్వరరావు, సీతామహాలక్ష్మమ్మ కుమారుడు అశోక్‌కుమార్ గారితో వివాహము. వీరు ఎల్.ఐ.సి. ఏజెంట్‌గా పనిచేస్తున్నారు. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

**నందిగం రాఘవయ్య గారి మూడవ కుమారుడు మాధవయ్య.** వీరు నెల్లూరు జిల్లా కావలి యందు ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేశారు. వీరు తన మామగారైన వెల్లాల వెంకటరత్నం, రంగనాయకమ్మల కుమార్తె బుజ్జమ్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె, ఒక కుమారుడు. కావలి నందే స్థిర నివాసము.

**నందిగం రాఘవయ్య గారి ప్రథమ పుత్రిక రంగనాయకమ్మను నెల్లూరు చెందిన వెల్లాల వెంకటరత్నం గారితో వివాహము.** వీరు పోస్టల్ డిపార్ట్‌మెంట్ నందు ఉద్యోగము. వీరికి ఒక కుమార్తె, ఇద్దరు కుమారులు.

**నందిగం రాఘవయ్య గారి రెండవ కుమార్తె సావిత్రమ్మ. ఈమెను కృష్ణా జిల్లా కొండపల్లిఖిల్లాకు చెందిన మలకపాటి గోపయ్య కుమారుడు రామారావుతో వివాహము.** వీరికి ఒక కుమారుడు మలకపాటి ప్రభాకరరావు. వీరు కృష్ణా జిల్లా, విజయవాడకు చెందిన వెల్లాల వెంకయ్య గారి రెండవ కుమార్తె భారతితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు. గుంటూరు నందు స్థిర నివాసము.

వీరి పెద్ద కుమార్తె నాగవల్లిని నెల్లూరుకు చెందిన రవి సుధాకర్ గారితో వివాహము. చిన్న కుమార్తె సుజాతను గుంటూరుకు చెందిన వెంకట రత్నగిరితో వివాహము.

**నందిగం రాఘవయ్య గారి మూడవ కుమార్తె అనసూయమ్మ. ఈమెను కృష్ణా జిల్లా, విజయవాడకు చెందిన వెల్లాల వెంకయ్య గారి ప్రథమ కుమారుడు శేషగిరిరావు గారితో వివాహము.** వీరు రైల్వే డిపార్ట్‌మెంట్‌లో పనిచేశారు. వీరికి ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె.

**కనిగిరి పుల్లయ్య :** వీరు నూజీవీడుకు చెందిన వెంకట నారాయణ, బాపనమ్మ గార్ల కుమారుడు. వీరు లారీలు, ట్రాక్టర్ల బాడీ కార్పెంటరీ వర్క్ నిర్మాణములో నిపుణులు. వీరు గోదావరి జిల్లా చాగల్లుకు చెందిన నామేపల్లి ఆచారి గారి ప్రథమ పుత్రిక నాగమణితో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు.

వీరి ప్రథమ కుమారుడు శ్రీనివాసరావు. వీరు చాగల్లుకు చెందిన నామేపల్లి మల్లిఖార్జునరావు కుమార్తె నాగ వెంకట శివతేజతో వివాహము. వీరికి ఒక

కుమారుడు, కుమార్తె. వీరు గుంటూరునందు ఉడ్ కార్వింగ్ చేయుచున్నారు. రెండవ కుమారుడు కిషోర్. కురిచేడుకు చెందిన సాంబయ్యగారి కుమార్తెతో వివాహము. వీరు కూడా ఉడ్‌కార్వింగ్ నందు నిపుణులు. వీరికి ఇద్దరు కుమార్తెలు. గుంటూరు వీరి స్థిరనివాసము.

కనిగిరి పుల్లయ్య గారి ప్రధమ కుమార్తె నాగేశ్వరమ్మ. ఈమెను నామేపల్లి ఆచారిగారి కుమారుడు శ్రీనివాస్‌తో వివాహము. వీరు గుంటూరులో కార్పెంటరీ పని చేయుచున్నారు. వీరికి ముగ్గురు కుమారులు. పుల్లయ్యగారి ద్వితీయ కుమార్తె నాగలక్ష్మి. ఈమెను భీమవరంకు చెందిన దామా శేషగిరిరావు గారి కుమారుడు నాగేశ్వరరావుతో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు. నాగేశ్వరరావు గుంటూరు నందే టైలరింగ్ వృతిలో ఉన్నారు.

కనిగిరి పుల్లయ్యగారి బావమరది అయిన నామేపల్లి సుబ్బారావు గుంటూరుకు చెందిన వెల్లాల చిన సుబ్రమణ్యంగారి కుమార్తెతో వివాహము. గుంటూరు నందు నివాసము. వీరికి ఒక కుమార్తె.

**వెల్లాల పార్వతమ్మ గారు :** వీరు గుంటూరుకు చెందిన నామేపల్లి శ్రీరాములుగారి భార్య అయిన కస్తూరిగారికి స్వయాన చెల్లెలు. వీరికి ఇద్దరు కుమారులు పెద్ద సుబ్రమణ్యం, చిన్న సుబ్రమణ్యం, కుమార్తె వెంకట సుబ్బమ్మ.

వెల్లాల పెద్ద సుబ్రమణ్యం గారు కృష్ణా జిల్లా నూజివీడుకు చెందిన వరాటి గోపయ్యగారి కుమార్తె సుబ్బమ్మతో వివాహము. వీరికి నల్గురు కుమారులు, నల్గురు కుమార్తెలు.

వీరి ప్రధమ కుమారుడు సాయిబాబా, గుంటూరు, చేబ్రోలుకు చెందిన నరసింహారావుగారికి దత్తత వెళ్ళినారు. రెండవ కుమారుడు శ్రీనివాసరావు. వీరు ఖమ్మంకు చెందిన సీతారామయ్యగారి కుమార్తె అనూరాధతో వివాహము. వీరికి ఒక కుమారుడు.

వెల్లాల పెద్ద సుబ్రమణ్యం గారి మూడవ కుమారుడు రాజేంద్రప్రసాద్. వీరు తమ బావగారైన అమరావతి సుబ్బారావు, ఝాన్సీలతల కుమార్తె సత్యపావనితో వివాహము. వీరికి ఒక కుమార్తె రమ్యశ్రీ. వీరు గుంటూరు నందే నివాసము.

నాల్గవ కుమారుడు విజయసారథి. వీరు పోలవరంకు చెందిన దామా సుబ్బారావుగారి కుమార్తె ఉదయజ్యోతితో వివాహము. వీరు గుంటూరు నందు కాటన్‌సీడ్స్ వ్యాపారం. వీరికి ఇద్దరు కుమార్తెలు.



వెల్లాల పెద్ద సుబ్రమణ్యంగారి ప్రధమ పుత్రిక ఝాన్సీలత. ఈమెను గుంటూరుకు చెందిన అమరావతి కృష్ణమూర్తిగారి కుమారుడు సుబ్బారావుతో వివాహము. వీరికి ఒక కుమార్తె సత్యపావని.

వెల్లాల పెద్ద సుబ్రమణ్యంగారి రెండవ కుమార్తె రాధామాధవి. వీరు నెల్లూరుకు చెందిన సనత్‌కుమార్‌గారితో వివాహము. వీరికి ఒక కుమార్తె, ఒక కుమారుడు.

వెల్లాల పెద్ద సుబ్రమణ్యంగారి మూడవ కుమార్తె వరలక్ష్మి. వీరు గోదావరి జిల్లా, తాడేపల్లి గూడెంకు చెందిన రేకపల్లి నాగరాజు గారితో వివాహము. వీరు ఆటోమోబైల్ వర్క్ షాపు నడుపుచున్నారు.

వెల్లాల పెద్ద సుబ్రమణ్యంగారి నాల్గవ కుమార్తె విజయదుర్గ. వీరు గుంటూరుకుచెందిన యకమా కృష్ణారావు గారి రెండవ కుమారుడు యకమా కోటేశ్వరరావుతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

వెల్లాల పార్వతమ్మగారి రెండవ కుమారుడు చిన్న సుబ్రమణ్యం. గుంటూరు జిల్లా, సొలసకు చెందిన కోటేశ్వరమ్మగారితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు. చిన్న సుబ్రమణ్యం గారు కాఫీపొడి వ్యాపారం చేసెడివారు.

వెల్లాల పార్వతమ్మగారి కుమార్తె వెంకట సుబ్బమ్మ. వీరిని గుంటూరు, చేబ్రోలుకు చెందిన నరసింహారావుతో వివాహము. వీరు కాఫీపొడి వ్యాపారం. వీరు గుంటూరుకు చెందిన వెల్లాల పెద్ద సుబ్రమణ్యంగారి కుమారుడు సాయిబాబాను దత్తత తీసుకున్నారు. చేబ్రోలు వీరి స్థిరనివాసం.

**కనిగిరి సుబ్బారాయుడు గారు :** వీరికి నెల్లూరు వాస్తవ్యులు నందిగం వెంకన్నగారి సోదరి సుబ్బమ్మ గారితో వివాహము. వీరు దేవాలయ వాహనాలు, పులి బొమ్మలు వేషాల బొమ్మలు చేయుటలో మరియు హార్మోనియం వాద్య పరికరాలను రిపేరు చేయుటలో నిపుణులు. వీరు మాచర్ల, తర్లుపాడు మాచర్ల దేవస్థాన రథాలు వీరి ఆధ్వర్యంలోనే తయారు చేయబడ్డాయి. వీరికి ఇద్దరు కుమారులు అప్పయ్య, జానకిరామయ్య. ఒక కుమార్తె కుసుమాంబ.

**ప్రధమ కుమారుడు కనిగిరి అప్పయ్య.** వీరు తెనాలి పోస్టల్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేసిరి. వీరికి గుంటూరు వాస్తవ్యులు నందిగం రోశయ్య, కోటమ్మ గార్ల రెండవ కుమార్తె లక్ష్మమ్మతో వివాహము. వీరికి ఒక కుమారుడు హరనాథ్.

వీరు సిండికేట్ బ్యాంక్ ఆఫీసర్‌గా పనిచేసి రిటైర్డ్ అయ్యారు. వీరికి నంద్యాల వాస్తవ్యులు చిత్తారి మాచరౌతు కృష్ణమూర్తి, ధర్మవతమ్మల ప్రధమ పుత్రిక

మహేశ్వరితో వివాహము. వీరికి ఇద్దరు కుమార్తెలు లక్ష్మీప్రసన్న, సంయుక్త.

కనిగిరి అప్పయ్యగారి భార్య లక్ష్మమ్మగారు చిన్న వయస్సు నందే మరణించిరి. తదనంతరం లక్ష్మమ్మగారి సోదరి పద్మావతితో వివాహము. అప్పయ్య, పద్మావతి గార్లకు ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు.

కనిగిరి అప్పయ్యగారి పెద్ద కుమారుడు దుర్గామల్లేశ్వరరరావు పోస్టల్ డిపార్ట్‌మెంట్ ఉద్యోగం. వీరికి కర్నూలు వాస్తవ్యులు వీరభద్ర గిడ్డయ్య గారి కుమార్తె పుష్పతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు. వీరి నివాసము గుడివాడ.

కనిగిరి అప్పయ్య గారి రెండవ కుమారుడు కామేశ్వరరావు. వీరు ఆల్ ఇండియా రేడియో, విజయవాడ నందు పనిచేయుచున్నారు. వీరికి కర్నూలు వాస్తవ్యులు అమరావతి సోమసుందరం, రాజమ్మ గార్ల ద్వితీయ పుత్రిక లతతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

అప్పయ్యగారి మూడవ కుమారుడు భవానీ శంకర్. వీరు యం.బి.బి.యస్. డాక్టర్‌గా విజయవాడలో పనిచేయుచున్నారు. వీరికి హైదరాబాద్ వాస్తవ్యులు నరసింహారావు గారి అమ్మాయి మంజులతో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

కనిగిరి అప్పయ్య గారి ప్రథమ కుమార్తె లక్ష్మి సౌభాగ్యవల్లి. వీరు గుంటూరు, సిండికేట్ బ్యాంక్ నందు ఆఫీసర్‌గా పనిచేయుచున్నారు. వీరికి గుంటూరు వాస్తవ్యులు కాళహస్తి ఆదెయ్య, విశాలాక్షమ్మ గార్ల ప్రథమ పుత్రుడు దుర్గాప్రసాద్ గార్లతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె.

కనిగిరి అప్పయ్య గారి ద్వితీయ కుమార్తె వెంకట రమణ. వీరు వరంగల్ సిండికేట్ బ్యాంక్ నందు పనిచేయుచున్నారు. వరంగల్ వాస్తవ్యులు వాడపల్లి రమేష్‌బాబుతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె.

కనిగిరి అప్పయ్యగారి మూడవ కుమార్తె కోటిరత్నం. వీరు యం.బి.బి.యస్. చదివి మెడికల్ ఆఫీసర్‌గా ఖమ్మంనందు పనిచేయుచున్నారు. ఖమ్మం వాస్తవ్యులు శిరికొండ సుధాకర్‌తో వివాహము. వీరు బ్యాంక్ ఫీల్డ్ ఆఫీసర్‌గా ఖమ్మంనందు పనిచేయుచున్నారు.

కనిగిరి సుబ్బారాయుడు గారి ద్వితీయ కుమారుడు జానకిరామయ్య. వీరు హైదరాబాద్‌లో పోస్టల్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేశారు. వీరు నెల్లూరు జిల్లా, బుచ్చిరెడ్డి పాలెం వాస్తవ్యులు నందిగం పోలయ్యగారి కుమార్తె జయమ్మతో వివాహం. వీరికి

**Page No. 55**



ఒక కుమారుడు రాంప్రసాద్. నల్గురు కుమార్తెలు లలిత కుమారి, ఇందిరాదేవి, సుబ్బలక్ష్మి, భారతీదేవి.

కనిగిరి సుబ్బారాయుడు గారి కుమార్తె కుసుమాంబను భీమవరం వాస్తవ్యులు దాం బాపిరాజుతో వివాహము. వీరికి ముగ్గురు కుమార్తెలు. వీరు ఆర్.టి.సి. నందు పనిచేసియున్నారు. వీరికి ఇద్దరు కుమారులు.

**పోగులగుంట నరసింహారావు – నాగరత్నమ్మ గార్లు :** వీరు హైదరాబాద్, నిజాం సంస్థానములో పనిచేసియున్నారు. వీరి భార్య నాగరత్నమ్మ. వీరికి ఐదుగురు కుమారులు వాసుదేవరావు, ప్రకాశరావు, వెంకట్రావు, రామదాసు, భాస్కరరావు. ఇద్దరు కుమార్తెలు రాంబాయమ్మ, సరోజిని.

**పోగులగుంట నరసింహారావు గారి మూడవ కుమారుడు వెంకట్రావుకు కర్నూలు వాస్తవ్యులు ఈశ్వరమ్మతో వివాహము.** వీరికి ఒక కుమార్తె జగన్నాయకమ్మ. ఐదుగురు కుమారులు జగన్నాధవర్మ, విఠల్‌వర్మ, గోపాల్‌వర్మ, వెంకటరమణ, మహేంద్రవర్మ.

పోగులగుంట వెంకట్రావు గారి కుమార్తె జగన్నాయకమ్మను జమ్ములమడుగు వాస్తవ్యులు చిత్తారి పురుషోత్తంతో వివాహము. వీరికి ఒక కుమార్తె, కుమారుడు.

పోగులగుంట వెంకట్రావు గారి పెద్ద కుమారుడు జగన్నాధవర్మ ఇండియన్ ఎయిల్‌లైన్స్‌లో పనిచేసియున్నారు. వీరు కర్నూలు జిల్లా, నొస్సం వాస్తవ్యులు అమరావతి గోవిందప్ప, లక్ష్మిందేవిగార్ల కుమార్తె జయమ్మతో వివాహము. వీరికి ఒక కుమార్తె సరిత, ఇద్దరు కుమారులు వంశీ, సిద్ధార్థ.

పోగులగుంట వెంకట్రావుగారి రెండవ కుమారుడు విఠల్‌వర్మ. వీరు హైదరాబాద్‌లో కాంట్రాక్ట్ వర్క్స్ చేసియున్నారు. వీరికి హైదరాబాద్ వాస్తవ్యులు చిత్తారి ముద్దుకృష్ణ గారి కుమార్తె గోదాదేవితో వివాహము. వీరికి ఒక కుమార్తె, కుమారుడు.

పోగులగుంట వెంకట్రావుగారి మూడవ కుమారుడు గోపాల్‌వర్మ. సెంట్రల్ బ్యాంక్ నందు పనిచేసియున్నారు. వీరికి కర్నూలు వాస్తవ్యులు అమరావతి వేణు వర్మ గారి కుమార్తె సుధామణితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

పోగులగుంట వెంకట్రావుగారి నాల్గవ కుమారుడు వెంకటరమణ. వీరి భార్య రాధ. వీరికి ఇద్దరు కుమారులు.

పోగులగుంట వెంకట్రావుగారి ఐదవ కుమారుడు మహేంద్రవర్మ. వీరు

హైదరబాద్ నందు బిల్డింగ్ కాంట్రాక్ట్ పనులు చేసియున్నారు. వీరి భార్య శోభ. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

**పోగులగుంట నరసింహారావు గారి నాల్గవ కుమారుడు రామదాస్‌వర్మ.** వీరు ఆర్.టి.సి.నందు పనిచేసియున్నారు. వీరు గుంటూరు వాస్తవ్యులు అమరావతి సుబ్బయ్య, మంగమ్మ గార్ల కుమార్తె నాగలక్ష్మమ్మతో వివాహము. వీరికి ఒక కుమారుడు నాగరాజు. నల్గురు కుమార్తెలు లలిత, లక్ష్మి, సుధ, పద్మ.

**పోగులగుంట రామదాస్ వర్మ గారి కుమారుడు నాగరాజు గారు** నిజామాబాద్ నందు స్కూల్ హెడ్‌మాస్టర్‌గా పనిచేసి రిటైర్డ్ అయ్యారు. వీరు మ్యూజికల్ ఇనుస్ట్రుమెంట్ ప్లేయర్. వీరు గుంటూరు వాస్తవ్యులు మగతాల హనుమంతరావు, పుష్పావతమ్మగార్ల కుమార్తె శ్యామలాదేవితో వివాహము. శ్యామలాదేవి గారు ఇండియన్ బ్యాంక్ నందు పనిచేయుచున్నారు. వీరికి ఒక కుమార్తె అనూష. కుమారుడు వంశీ.

**పోగులగుంట నరసింహారావు గారి ఐదవ కుమారుడు భాస్కరరావు.** వీరు ఆర్.టి.సి.నందు పనిచేసియున్నారు. వీరికి గుంటూరు వాస్తవ్యులు నందిగం కోటయ్య, మహాలక్ష్మమ్మ గార్ల శాంతమ్మతో వివాహము. వీరికి ఇద్దరు కుమారులు. ఒక కుమార్తె.

**పోగులగుంట నరసింహారావు గారి పెద్ద కుమార్తె రాంబాయమ్మ.** వీరు గుంటూరు వాస్తవ్యులు పాణ్యెం రామకోటయ్యతో వివాహము. వీరు గుంటూరు జిల్లా కోర్టు అమీన్‌గా పనిచేసియున్నారు. వీరికి ఒక కుమారుడు పార్ధసారథి, ఇద్దరు కమార్తెలు బాలామణి, పార్వతి.

కుమారుడు పార్ధసారథి రైల్వే కోర్టునందు జడ్జిగా పనిచేసియున్నారు. వీరు నూజివీడు వాస్తవ్యులు వరాటి గోపయ్య కుమార్తె లింగమ్మతో వివాహము. వీరికి ముగ్గురు కుమార్తెలు.

**పోగులగుంట నరసింహారావు గారి రెండవ కుమార్తె సరోజిని.** ఈమెను గుంటూరు వాస్తవ్యులు నందిగం రాఘవయ్య, జాలమ్మల కుమారుడు సూరయ్యతో వివాహం. వీరు గుంటూరు నందు కార్పెంటరీ పని చేసెడివారు. వీరికి ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు.

**పానుగంటి రామచంద్రయ్య గారు :** వీరు కడప వాస్తవ్యులు. వీరు కడపకు చెందిన బాపనూరి రామయ్యగారి కుమార్తె శారదతో వివాహము. వీరికి





ఒక కుమారుడు నాగేంద్ర. వీరు గుంటూరు నందు ఉడ్‌కార్వింగ్ నందు నిపుణులు. వీరికి నెల్లూరుకు చెందిన బాపనూరి ప్రభాకర్‌గారి కుమార్తె కళ్యాణితో వివాహము. వీరికి ఒక కుమార్తె. గుంటూరు వీరి స్థిరనివాసము.

**కాళహస్తి శ్రీనివాసరావు (వ్యాసరౌతు వెంకటప్పయ్య, సావిత్రమ్మగార్ల ప్రథమ అల్లుడు) :** వీరు నెల్లూరు జిల్లాకు చెందినవారు. వీరు గుంటూరు వాస్తవ్యులు వ్యాసరౌతు వెంకటప్పయ్య గారి ప్రథమ కుమార్తె చౌడేశ్వరితో వివాహము. వీరు గుంటూరు నందే కార్పెంటరీ పని చేసెడివారు. వీరికి ఇద్దరు కుమారులు రవి, శివనాగరాజు.

ప్రథమ కుమారుడు రవికి నెల్లూరు జిల్లా, కనిగిరివారి అమ్మాయి సులోచనతో వివాహము. రవి గుంటూరు నందు కార్పెంటరీ పని చేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు. రెండవ కుమారుడు శివనాగరాజు. వీరు గోదావరి జిల్లా, చాగల్లుకు చెందిన యకమా కృష్ణంరాజుగారి కుమార్తె రాజీతో వివాహము. వీరు ఎలక్ట్రికల్ పని చేయుచున్నారు. వీరికి ఒక కుమారుడు, కుమార్తె.

**వ్యాసరౌతు వెంకటప్పయ్య గారు :** వీరు కృష్ణా జిల్లా నూజివీడుకు చెందినవారు. వీరు ప్రకాశం జిల్లా కురిచేడుకు చెందిన పైకోట సుబ్రమణ్యంగారి నాల్గవ కుమార్తె సావిత్రమ్మతో వివాహము. తదుపరి వీరు గుంటూరు నందు స్థిర నివాసము. వీరికి ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు.

ప్రథమ కుమారుడు శ్రీనివాసరావు, ద్వితీయ కుమారుడు కుమారస్వామి. గుంటూరు నందే కార్పెంటరీ పని చేయుచున్నారు.

**యకమా సుబ్బరాజు గారు :** వీరు గుంటూరు జిల్లా, చిలకలూరిపేటకు చెందిన యకమా చిన్న నరసింహంగారి కుమారుడు. వీరు గుంటూరు నందే కార్పెంటరీ పని చేయుదురు. గోదావరి జిల్లా, చాగల్లుకు చెందిన నామేపల్లి ఆచార్యులు గారి కుమార్తె లక్ష్మితో వివాహము. వీరికి కుమార్తె, కుమారుడు.

యకమా సుబ్బరాజుగారి సోదరుడు కృష్ణంరాజుగారు. చాగల్లు నందు నివాసము. కార్పెంటరీపని చేయుచున్నారు. వీరికి ముగ్గురు కుమార్తెలు.

**బండి పాండురంగారావు గారు :** వీరు నెల్లూరు జిల్లాకు చెందినవారు. వీరు విజయవాడ యస్.సి.రైల్వే నందు పనిచేసి రిటైర్డ్ అయ్యారు. వీరికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. గుంటూరు స్థిర నివాసము.

**చిత్తారి మాచరౌతువారు : చిత్తారి మాచరౌతు పాపన్న వర్మ గారు.** వీరు కర్నూలు జిల్లా, నంద్యాల పట్టణవాసులు. వీరి ప్రధాన వృత్తి వ్యవసాయము. వీరి కుమారుడు **నాగన్నవర్మ వీరి ధర్మపత్ని నాగమ్మ గార్లు.** వీరికి ఇద్దరు కుమార్లు. **చిత్తారి మాచరౌతు సుబ్బయ్య వర్మ వీరి ధర్మపత్ని లలితమ్మ గారు. రెండవ కుమారుడు నారాయణ వర్మ వీరి సతీమణి భోగమ్మ గారు.**

చిత్తారి మాచరౌతు నాగన్న వర్మ బ్రిటిష్ గవర్నమెంట్ వారి కాలములో రైల్వే డిపార్ట్‌మెంట్ వారికి గుంటూరు–గుంటకల్ రైలు మార్గము నందు 'చెలమ, బొగద' అని పిలువబడుతున్న నల్లమల అడవి ప్రాంతములో కొంత భాగము రైల్వే ట్రాక్ కాంట్రాక్ట్ తీసుకొని పని నిర్మాణము పూర్తి చేసి ప్రఖ్యాతి గాంచిరి.

చిత్తారి మాచరౌతు సుబ్బయ్య వర్మ గారికి ఇద్దరు కుమారులు. లక్ష్మీనారాయణ, డా॥ కృష్ణమూర్తి.

చిత్తారి మాచరౌతు లక్ష్మీనారాయణ వర్మ గారికి సరోజమ్మ గారితో వివాహము. వీరు ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ నందు రెవెన్యూశాఖలోనూ తదుపరి కో–ఆపరేటివ్ సబ్‌రిజిస్ట్రార్‌గా విధులు నిర్వహించి రిటైర్డ్ అయ్యారు. వీరు నంద్యాలలోగల శ్రీ నిమిషాంబాదేవి ఆలయమునకు స్థలదాత. వీరికి ఒక కుమారుడు చిత్తారి మాచరౌతు ప్రసాద్ వర్మ, కుమార్తె భవాని.

చిత్తారి మాచరౌతు ప్రసాద్ వర్మ గారు గుంటూరుకు చెందిన పేరూరి గోపాలరావు గారి ద్వితీయ పుత్రిక శ్రీలక్ష్మితో వివాహము. కుమార్తె భవానీని గోపాలరావు గారి కుమారుడు రఘునందన్‌తో వివాహము.

చిత్తారి మాచరౌతు ప్రసాద్ వర్మ గారికి ఇద్దరు కుమారులు చిత్తారి మాచరౌతు జడలసాయి సంతోష్‌వర్మ, చిత్తారి మాచరౌతు రాఘవేంద్రవర్మ. వీరి నివాసము గుంటూరు. ప్రసాద్ వర్మ గారు నంద్యాల నిమిషాంబాదేవి ఆలయమునకు తన తల్లిదండ్రుల పేరు మీద అమ్మవారి విగ్రహమును నిర్మాణము చేయించినారు.

చిత్తారి మాచరౌతు సుబ్బయ్య వర్మగారి ద్వితీయ కుమారుడు డా॥ కృష్ణమూర్తి. వీరికి నొస్సం గ్రామమునకు చెందిన అమరావతి రామకృష్ణగారి సోదరి ధర్మావతి గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు, ఐదుగురు కుమార్తెలు.

**పాణ్యం రామకోటయ్య గారు :** వీరు 1965 వరకు గుంటూరు జిల్లా కోర్టు నందు అమీనాగా విధులు నిర్వహించారు. వీరి ధర్మపత్ని రాంబాయమ్మ గారు. వీరు పోగులగుంటవారి ఆడపడుచు. వీరికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు.

Page No. 57



వీరి ప్రథమ కుమార్తె బాలామణి గారు. వీరు భీమవరమునకు చెందిన నందిగం లక్ష్మీనారాయణగారితో వివాహము. వీరు ఆర్.టి.సి.నందు ఉద్యోగము. వీరికి ముగ్గురు కుమారులు. మొదటి కుమారుడు శ్రీనివాస్ గాజర్లవారి అమ్మాయి లక్ష్మితో వివాహము. రెండవ కుమారుడు కోదండహరి నాంపల్లివారి ఆడపడుచు శ్రీదేవితో వివాహము. మూడవ కుమారుడు హరిదత్త హైదరాబాద్ వాస్తవ్యులు లక్ష్మీనారాయణ గారి కుమార్తె మాధవితో వివాహము. వీరు ఆర్.టి.సి. నందు ఉద్యోగము. వీరికి ఒక కుమార్తె లావణ్య. కుమారుడు చంద్రశేఖర్.

కుమార్తె లావణ్యను గుంటూరు వాస్తవ్యులు యకమా నాగరాజు గారి కుమారుడు ఫణీంద్రకుమార్‌తో వివాహము. వీరికి ఒక కుమారుడు కోమల నాగ వెంకట కార్తీక్.

పాణ్యం రామకోటయ్య గారి ద్వితీయ కుమార్తె పార్వతి. వీరి పూనాకు చెందిన వారితో వివాహము.

పాణ్యం రామకోటయ్యగారి కుమారుడు పార్థసారథి. వీరు రైల్వేశాఖ నందు కోర్టు మెజిస్ట్రేట్‌గా ఉద్యోగము నిర్వహించినారు. వీరికి ముగ్గురు కుమార్తెలు.

**మలకపాటి ప్రభాకర్ గారు :** వీరు కొండపల్లికి గ్రామమునకు చెందిన మలకపాటి రామారావు, సావిత్రమ్మల ఏకైక కుమారుడు. వీరు కృష్ణా జిల్లా, విజయవాడకు చెందిన వెల్లాల వెంకయ్య గారి రెండవ కుమార్తె భారతీదేవితో వివాహము. గుంటూరు స్థిరనివాసము. వీరికి ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు.

వీరి ప్రథమ కుమార్తె నాగవల్లి. వీరు నెల్లూరుకు చెందిన రవి సుధాకర్ గారితో వివాహము. వీరికి ఒక కుమారుడు, కుమార్తె. ప్రభాకర్‌గారి ద్వితీయ కుమార్తె సుజాత. గుంటూరుకు చెందిన రత్నగిరి గారితో వివాహము.

ప్రభాకర్‌గారి కుమారుడు సతీష్ కుమార్. నందిగం శ్రీనివాసరావు గారి ఏకైక కుమార్తె పార్వతితో వివాహము. వీరికి ఒక కుమారుడు, ఒక కుమార్తె. గుంటూరు స్థిర నివాసము.

-- o O o --

శ్రీ మిమిషాంభాపరమేశ్వర్యైనమః

# గోత్రకాండము

శ్రీ ముక్తర్షి వంశోద్భవులైన ఆర్యక్షత్రియ చిత్రకారుల
గోత్ర, ప్రవర, సూత్ర శాఖల ప్రకరణము

### (1) శాండిల్యసగోత్రము

(1) వీరభద్రునివారు (2) పానుగంటివారు (3) కామరౌతువారు (4) ఆలూరివారు (5) పాణెంవారు (6) ముత్యాలవారు. ఈ ఆరింఢ్ల వారిది శాండిల్యస గోత్రము - ఇందుకు ప్రవర ॥ *వైభ, చ్యవన, శతమర్షణ, రేభ, రైభ, శాండిల్య, సప్తార్షేయ, ప్రవరాన్విత, శాండిల్యస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

### (2) సువర్ణసగోత్రము

(1) మాచర్లవారు (2) నిలుగొండవారు. ఈ రెండింఢ్ల వారిది సువర్ణస గోత్రము - ఇందుకు ప్రవర ॥ *సావర్ణ, సువర్ణ, సవర్ణ త్రయార్షేయ, ప్రవరాన్విత, సువర్ణస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

### (3) కౌండిన్యసగోత్రము

(1) వజ్రాంగివారు (2) సకలాతివారు (3) జానంవారు (4) బాదామివారు (5) ఖండివారు. ఈ అయిదింఢ్లవారిది కౌండిన్యస గోత్రము - ఇందుకు ప్రవర ॥ *వాశిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య, త్రయార్షేయ, ప్రవరాన్విత, కౌండిన్యస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

### (4) హరితసగోత్రము

(1) మద్దెలవారు (2) గొడుగులేటివారు (3) గుడ్లూరివారు (4) చెరుకుపల్లెవారు (5) గుత్తివారు. ఈ ఐదింఢ్లవారిది హరితస గోత్రము - ఇందుకు ప్రవర ॥ *హరిత, అంబరీష, యవ్వనాశ్వ, త్రయార్షేయ ప్రవరాన్విత హరితస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

### (5) ఆత్రేయసగోత్రము

(1) సొల్లాపురంవారు (2) పైడిపల్లెవారు (3) వ్యాసరౌతువారు (4) బూరుగులవారు (5) అమరావతివారు. ఈ ఐదింఢ్లవారిది ఆత్రేయస గోత్రము - ఇందుకు ప్రవర ॥ *ఆత్రేయార్చ, నానస, శాపాశ్వ, త్రయార్షేయ ప్రవరాన్విత, ఆత్రేయస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*



### (6) భారద్వాజసగోత్రము

(1) వెల్లాలవారు (2) చిటివేలివారు (3) దామా వారు (4) చంద్రగిరివారు (5) ధరణికోటివారు (6) కొండవీటివారు (7) కంభాలవారు (8) ఆలమూరివారు (9) శూలం వారు (10) దేవరకొండవారు (11) పల్లకీవారు (12) మాచరౌతువారు. ఈ పన్నెండింఢ్లవారిది భారద్వాజస గోత్రము - ఇందుకు ప్రవర ॥ *ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ త్రయార్షేయ ప్రవరాన్విత, భారద్వాజస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

### (7) గార్గ్యసగోత్రము

(1) శంఖుపాలవారు (2) వోరుగంటివారు (3) వెన్నూరివారు. ఈ మూడింఢ్లవారిది గార్గ్యస గోత్రము - ఇందుకు ప్రవర ॥ *మౌద్గల్య, గార్గ్య, గౌతమ, త్రయార్షేయ ప్రవరాన్విత, గార్గేయస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

### (8) అంగీరసగోత్రము

(1) పెనుగొండవారు (2) కోళాలవారు (3) కూటాగూళ్లవారు (4) చప్పల్లివారు (5) యాదగిరివారు (6) ముసలిమడుగువారు (7) కోటకొండవారు (8) గొడుగులగుంటవారు (9) వీరబాయివారు (10) ముత్తుమూరివారు (11) బావురివారు. ఈ పదకొండు యింఢ్లవారిది అంగీరస గోత్రము - ఇందుకు ప్రవర॥ *అంగీరస, అంబరీష, కాకుస్త త్రయార్షేయ ప్రవరాన్విత అంగీరస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

### (9) వసిష్ఠసగోత్రము

(1) ఊటుకూరివారు (2) ధనలాకోటివారు (3) శిఖరంవారు (4) మాఘంవారు (5) నందిగంవారు (6) బోనగిరివారు. ఈ ఆరింఢ్లవారిది వసిష్ఠస గోత్రము - ఇందుకు ప్రవర ॥ *వసిష్ట, మైత్రావరుణ, కౌండిన్య, త్రయార్షేయ ప్రవరాన్విత, వసిష్ఠస గోత్రః అపస్తంభసూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

### (10) దూర్వాసగోత్రము

(1) కాళంగివారు (2) సంబెళ్ళవారు (3) బండారువారు (4) గొడుగులవారు (5) విరూపాక్షంవారు (6) శిద్ధాపురంవారు (7) కడితాలవారు. ఈ ఏడింఢ్లవారిది

దూర్వాస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *దూర్వాస, స్వదత్త, దత్తాత్రేయ, త్రయార్షేయ ప్రవరాన్విత, దూర్వాస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(11) గౌతమసగోత్రము**

(1) యాదగిరివారు (2) ముసలిమడుగువారు (3) కడుమూరివారు (4) కోటకొండవారు (5) పోగులగుంటవారు (6) బోనగిరివారు (7) వీరబోయివారు (8) కందుకూరివారు (9) ముత్తులూరివారు (10) బావూరివారు. ఈ పదిండ్లవారిది గౌతమస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *అంగీరస, ఆయాస్య, గౌతమ. త్రయార్షేయ ప్రవరాన్విత, గౌతమస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(12) హరీషసగోత్రము**

(1) అనగొందివారు (2) యిక్కెరివారు (3) కంచావారు. ఈ మూడిండ్లవారిది హరీషస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *హరిష, అంబరీష, కాకుస్థ, త్రయార్షేయ, ప్రవరాన్విత, హరీషస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(13) శ్రీవత్ససగోత్రము**

(1) ధట్టీవారు (2) కందనూరివారు (3) మల్లలూరివారు (4) కమ్మకూరివారు (5) పెళకుర్తివారు (6) వుద్దంటివారు. ఈ ఆరిండ్లవారిది శ్రీవత్సవ గోత్రము – ఇందుకు ప్రవర ॥ *భార్గవ, చ్యవన, ఆప్లవ, ఔరవ, జమదగ్ని, పంచార్షేయ ప్రవరాన్విత శ్రీవత్సస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(14) కాశ్యపసగోత్రము**

(1) మాతంగంవారు (2) టేకుమళ్ళవారు (3) బాబురౌతువారు (4) యిరపరుపూరివారు (5) పెనుబాలవారు (6) దాసంపల్లెవారు (7) బురదగుంటవారు (8) కంభంమెట్టువారు (9) యకమావారు (10) నామేపల్లెవారు (11) నానగిరివారు (12) కనిగిరివారు (13) వరాటివారు. ఈ పదమూడు ఇండ్లవారిది కాశ్యపస గోత్రము–ఇందుకు ప్రవర ॥ *కాశ్యప, వత్సార, నైధృభ, రేభ, శండిల, శాండిల్య, సప్తార్షేయ ప్రవరాన్విత కాశ్యపస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(15) సాంఖ్యాయనసగోత్రము**

(1) అమరాపురంవారు (2) పబ్బతివారు. ఈ రెండిండ్ల వారిది సాంఖ్యాయనస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *విశ్వామిత్ర, త్రైదేవరాతల ఔధల,*

Page No. 59



*చతురార్షేయ ప్రవరాన్విత, సాంఖ్యాయనస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(16) కౌశికసగోత్రము**

(1) మగతాలవారు (2) మిట్టయింటివారు (3) మండీవారు (4) శంభరౌతువారు (5) పుట్రౌతువారు (6) అద్దంకివారు. ఈ ఆరిండ్లవారిది కౌశికస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *వైశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక, త్రయార్షేయ ప్రవరాన్విత, కౌశికస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(17) జమదగ్నిసగోత్రము**

(1) గుట్రౌతువారు (2) దర్శనంవారు (3) చీణావారు. ఈ మూడిండ్లవారిది జమదగ్నిస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *జమదగ్ని, గార్గేయ, గౌతమ, త్రయార్షేయ ప్రవరాన్విత జమదగ్నిస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(18) కుశలసగోత్రము**

(1) మద్దగిరివారు (2) వేంకటగిరివారు (3) ముళువాయివారు. ఈ మూడిండ్ల వారిది కుశలస గోత్రము–ఇందుకు ప్రవర॥ *కౌశల, గోముఖ, బ్రహ్మ, త్రయార్షేయ ప్రవరాన్విత, కువలస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(19) మౌద్గల్యసగోత్రము**

(1) పాకాలవారు (2) కలవకంటివారు (3) పాలమట్టివారు (4) పొన్నూరివారు (5) కోశంవారు. ఈ ఐదిండ్ల వారిది మౌద్గల్యస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *మౌద్గల్య, బార్హస్పత్య, యవ్వనాశ్వ, త్రయార్షేయ ప్రవరాన్విత, మౌద్గల్యస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(20) పరాశరగోత్రము**

(1) మాల్యవంతంవారు (2) మాతంగంవారు (3) మంత్రమూర్తివారు (4) మాణిక్యంవారు (5) మధురాపురివారు (6) చిత్రకూటంవారు. ఈ ఆరిండ్ల వారిది పరాశరస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *పరాశర్య, శుక, భారద్వాజ, వాశిష్ఠ, జమదగ్ని, వ్యాస, అంబరీష, సప్తార్షేయ ప్రవరాన్విత, పరాశర గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(21) విశ్వామిత్రస గోత్రము**

(1) బదరీనారాయణవారు (2) బ్రహ్మరౌతువారు (3) ద్రోణగిరివారు (4) శేషగిరివారు (5) నందికేశ్వరంవారు (6) సోమరౌతువారు (7) వజ్రకవచంవారు

(8) మేరుశిఖరంవారు (9) వింధ్యగిరివారు (10) వీరమోహినివారు (11) శృంగేరివారు (12) నందిగ్రామంవారు (13) నాగగిరివారు (14) ఉదయగిరివారు (15) అరుణాచలంవారు. ఈ పదునైదు ఇండ్ల వారిది విశ్వామిత్రస గోత్రము – ఇందుకు ప్రవర *॥ వైశ్వామిత్ర, మైత్రేయ, యవ్వనాశ్వ, కౌశిక, ఆత్రేయ, పంచార్షేయ, ప్రవరాన్విత, విశ్వామిత్రస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(22) సనందనసగోత్రము**

(1) కోకిలాక్షంవారు (2) కోదండంవారు (3) చక్రతీర్థంవారు (4) కుంభకోణంవారు (5) మానుపల్లెవారు (6) కంభంవారు (7) దామంచర్లవారు (8) పగడాలవారు (9) భద్రాచలంవారు (10) అస్తగిరివారు (11) పద్మాలవారు (12) హరిద్వారంవారు (13) మండలేశ్వరంవారు (14) క్షీరసాగరంవారు (15) దామోదరంవారు (16) చెరుకూరివారు (17) కాళహస్తివారు (18) కంచెర్లవారు (19) కనకంవారు (20) త్రేతాగ్నులవారు (21) విశ్వనాధపురంవారు (22) పలుకూరివారు (23) బ్రహ్మాదండివారు (24) దండువారు (25) శ్రీకరంవారు (26) చిత్రాంగికోటివారు (27) భారద్వాజంవారు (28) చింతావారు (29) హోమగిరివారు (30) మలయాచలంవారు (31) రాజమహేంద్రంవారు (32) రాఘవవారు. ఈ ముప్పదిరెండిండ్లవారిది సనందనస గోత్రము – ఇందుకు ప్రవర *॥ సనక, సనందన, సనత్కుమార, మౌద్గలయ్య, మాండవ్య, పంచార్షేయ ప్రవరాన్విత, సనందనస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(23) రోమశసగోత్రము**

(1) సూర్యకాంతంవారు (2) కామకోటిఆవరు (3) కంజాక్షంవారు (4) రజితగిరివారు (5) దుర్గంవారు (6) బళ్ళారివారు (7) జంబుకేశ్వరంవారు (8) మాణిభద్రంవారు (9) చంద్రకాంతంవారు (10) జగన్నాధంవారు (11) జంభంవారు (12) ద్వారకాపురంవారు (13) సూర్యగిరివారు (14) చింతామణివారు. ఈ పదునాలుగు ఇండ్లవారిది రోమశస గోత్రము – ఇందుకు ప్రవర *॥ రోమశ, ధౌమ్య, శుక, శౌనక, శాండిల్య, పంచార్షేయ, ప్రవరాన్విత, రోమశస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(24) అగస్త్యసగోత్రము**

(1) చండశాసనంవారు (2) చంద్రమౌళివారు. ఈ రెండిండ్ల వారిది అగస్త్యస గోత్రము – ఇందుకు ప్రవర *॥ అగస్త్య, అంబరీష, హరిత, త్రయార్షేయ ప్రవరాన్విత, అగస్త్యస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**Page No.**

**60**



**(25) ధౌమ్యసగోత్రము**

(1) పోకూరివారు (2) శ్రీరంగంవారు (3) కంఠవీణెవారు. ఈ మూడిండ్ల వారిది ధౌమ్యస గోత్రము – ఇందుకు ప్రవర *॥ ధౌమ్య, భార్గవ, చ్యవన, త్రయార్షేయ ప్రవరాన్విత, ధౌమ్యస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(26) మౌసలసగోత్రము**

(1) నిత్యానందంవారు (2) ప్రభావతిపురంవారు (3) తుళజాపురంవారు (4) కామగిరిపీఠంవారు. ఈ నాలుగిండ్లవారిది మౌసలస గోత్రము – ఇందుకు ప్రవర *॥ మౌద్గల్య, వాలఖిల్య, వాశిష్ఠ, త్రయార్షేయ, ప్రవరాన్విత, మౌసలస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(27) నారదమునిసగోత్రము**

(1) ప్రసన్నంవారు (2) అంజనంవారు (3) కామరూపంవారు. ఈ మూడిండ్ల వారిది నారదమునిస గోత్రము – ఇందుకు ప్రవర *॥ నారద, శుక, వ్యాస, త్రయార్షేయ, ప్రవరాన్విత, నారదమునిస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(28) కపిలసగోత్రము**

(1) వేదగిరివారు (2) చీమకుర్తివారు. ఈ రెండిండ్లవారిది కపిలస గోత్రము – ఇందుకు ప్రవర *॥ కౌశిక, కపిల, దత్తాత్రేయ, త్రయార్షేయ ప్రవరాన్విత, కపిలస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(29) వ్యాసమునిసగోత్రము**

(1) రామేశ్వరంవారు (2) లంజకోటవారు (3) కార్ముకంవారు. ఈ మూడిండ్ల వారిది వ్యాసమునిస గోత్రము – ఇందుకు ప్రవర *॥ వ్యాస, దుర్వాస, అంబరీష, సాంఖ్యాయన, సనందన, పంచార్షేయ, ప్రవరాన్విత, వ్యాసమునిస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(30) వైశంపాయనసగోత్రము**

(1) మీనమడుగువారు (2) ఛత్రంవారు (3) సత్యపురంవారు (4) చాగలకొండవారు (5) ధర్మపురంవారు. ఈ ఐదిండ్లవారిది వైశంపాయనస గోత్రము – ఇందుకు ప్రవర *॥ జైముని, ధౌమ్య, జమదగ్ని త్రయార్షేయ, ప్రవరాన్విత, వైశంపాయన గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(31) చ్యవనసగోత్రము**

(1) సత్రంవారు (2) అద్యక్షంవారు (3) మర్మంవారు (4) చిదబరంవారు (5) పుష్పగిరివారు (6) పురాణంవారు. ఈ ఆరిండ్లవారిది చ్యవనస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *చ్యవన, యవ్వనాశ్వ, కాకుత్స, త్రయార్షేయ, ప్రవరాన్విత, చ్యవనస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

**(32) దత్తాత్రేయసగోత్రము**

(1) శరభేశ్వరంవారు (2) సుభద్రంవారు (3) గంధకంవారు (4) కల్యాణంవారు (5) తోరణంవారు (6) కేదారేశ్వరంవారు (7) ఖాద్రివారు (8) మైసూరివారు (9) టంగుటూరివారు (10) సుకుమారంవారు (11) బొబ్బిలివారు (12) భువనగిరివారు (13) పుండరీకంవారు (14) రథరౌతువారు (15) రత్నంవారు (16) దీపనంవారు (17) హేమాక్షికంవారు (18) నిధిదర్శనంవారు (19) ధూర్జటివారు (20) కొత్తపట్నంవారు (21) ధనకోటివారు (22) వాకాటివారు (23) అల్లూరివారు (24) సంగంవారు (25) సాగరంవారు (26) నగరంవారు (27) మాచరంవారు (28) ధర్మంవారు (29) చాగంటివారు (30) మాగంటివారు (31) ముక్కంటివారు (32) కటకమడుగువారు (33) పంజరంవారు (34) తిరోధానం వారు (35) గొబ్బివారు (36) చామరంవారు (37) రాజంవారు (38) పసుమర్తివారు (39) నందవరంవారు (40) నాగపల్లివారు (41) వజ్రాంగికోటివారు (42) వారుణీణాపురంవారు (43) గగనంవారు (44) జ్ఞానమూర్తివారు (45) హిమగిరివారు (46) మీనకేతనంవారు (47) అయోధ్యాపురంవారు (48) ఇంద్రాక్షివారు (49) ఆనందంవారు (50) కరుంగుడివారు. ఈ ఏబది ఇండ్లవారిది దత్తాత్రేయస గోత్రము – ఇందుకు ప్రవర ॥ *దుర్వాస, భార్గవ, జమదగ్ని, మైత్రేయ, భరద్వాజ, సప్తార్షేయ, ప్రవరాన్విత దత్తాత్రేయస గోత్రః, అపస్తంభ సూత్రః, యజుశ్శాఖాధ్యాయనమః ॥*

-- o O o --

**Page No. 61**



# చరిత్రలో మనవారు :

**(1)** హిందూ వర్ణ వ్యవస్థలో "సోమవంశ ఆర్యక్షత్రియులు" రెండవ వర్ణానికి చెందినవారు. సోమ అనగా చంద్రుడు అని అర్థం అనగా చంద్రవంశ క్షత్రియులని, చంద్రవంశ యోధులని 'భాగవత పురాణము' నందు వ్రాయబడినది.

మెస్సర్స్ వావిలాల రామస్వామి & సన్స్, మద్రాసు వారు 1951లో 'శ్రీ దుర్గా సహస్రనామ స్తోత్రం' పుస్తకమునందు శ్రీ నిమిషాంబా అమ్మవారి శక్తితో శశిబిందు (మహాశక్తి) రూపంలో జానుమండల రాక్షసుని సంహారము గుర్చి వ్రాయబడినది.

శ్రీ జానుమంచి శేషాద్రిశర్మ 1922వ సం॥లో బ్రహ్మాండ పురాణము తెలుగు అనువాదములో వర్ణ వైభవ కాండము నందు మహాశక్తి రూపంలోని నిమిషాంబా దేవి జానుమండల రాక్షస సంహారమును గుర్చి వర్ణించారు.

అమ్మవారి కృప వలన సోమవంశ ఆర్యక్షత్రియ వంశములో 16 మంది గొప్ప రాజులు ఉద్భవించారు. వారు గయ, అంబరీష, శశిబిందు, అంగ, పృథు, మారుతి, సుహోత్ర, పరశురామ, శ్రీరామ, భరత, దిలీప, నృగ, రంతిదేవ, యయాతి, మాంధాత & భగీరథ. మహారాష్ట్ర, రాజస్తాన్, గుజరాత్, కర్ణాటక, ఒరిస్సా (ఓఢ్ర), తెలంగాణా, ఆంధ్రప్రదేశ్‌లలో రాజ్యములను పాలించారు.

తరువాతి కాలంలో గోల్డ్‌స్మిత్‌లుగా, కార్పెంటర్లుగా, టైలర్లుగా, ఉడ్ & మెటల్ కార్వింగ్ పనులయందు, శిల్పాలు తయారు చేయుటనందు, బొబ్బిలి వీణలు తయారు చేయుటలో, మట్టితో విగ్రహాలు, ప్రాచీన సేకరణలైన తాళాలు, గడియారములు రిపేరు చేయుటయందు మంచి పనితనము చూపారు. ప్రస్తుతం గత అర్ధ శతాబ్దము నుండి చదువులో ముందంజలో ఉండి ప్రభుత్వ ఉద్యోగములు చేయుచూ, అనేక ప్రభుత్వ పదవులను నిర్వహిస్తున్నారు.

మన ఆర్యక్షత్రియ సంఘాలు పూనే, కోల్హాపూర్, బెంగుళూరు, మైసూరు, ఔరంగాబాద్, గుల్బర్గా, హైదరాబాద్, కర్నూలు, కడప, నెల్లూరు మొ॥గు ప్రాంతములందు గలవు.

– ***సోమవంశ ఆర్యక్షత్రియ సమాజ్,*** పూనె & హైదరాబాద్
*వెబ్‌సైట్ నుండి సేకరించడమైనది.*

**(2) గంజిఫా ప్లేయింగ్ కార్డ్స్** తయారు చేయటలో నేర్పరులు. ఈ పేక ముక్కల ఆట మొగల్స్ కాలం నుండి వాడుకలో ఉంది. పలచనిచెక్క, రావి మర్రి ఆకులు, దళసరి వస్త్రంలను ఉపయోగించుకొని వాటి మీద అందమైన పేయింటింగ్స్ నేర్పుగా, ఓర్పుగా వేసేవారు. ఆ రోజులలో రాజులు, సంస్థానాధీశులు విలాసంగా ఈ ఆటలను ఆడేవారు.

**(3)** కొన్ని ప్రాంతాలలో మన కమ్యూనిటీవారిని కళాత్మకపనులకు అనగా దేవాలయములు సుందరముగా నిర్మించుటలోనూ చేతులతోనే అద్భుత కళాఖండాలు సృష్టించులోనూ, చిత్రమైన పనులు మరియు పేయింటింగ్స్ వేయుట వలన **చిత్తారివారు** అని; గుర్రాలకు జంతుచర్మపు జీనుపై డిజైన్లు రూపొందించుటలో సిద్ధహస్తులవడం వలన **జీనిగర్‌వారు** అనీ; చెక్కపైన, ఆభరణములపైన, దేవాలయ శిల్పాలు, వస్త్రములపై చేతితో సృజనాత్మకముగా కలంకారీ డిజైన్లు మొదలగువాటిని రూపొందించు వలన వారిని **నకాషీవారు** అని పిలిచేవారు.

**(4) వెల్లాల ఇంటి పేరు వారు :** క్రీ.శ.458–480 మధ్య కాలంలో త్రిలోచన పల్లవునితో విజయాదిత్య చాళుక్యుడు పోరాడి ఓడినట్లు చరిత్ర. గర్భవతియైన భార్య కడపజిల్లా, ముదివేము అగ్రహారంలో విష్ణుశర్మ అను బ్రాహ్మణుని ఇంట తలదాచుకొన్నది. ఆమె కుమారుడు విష్ణువర్ధనుడు. చాళుక్య వంశములో ఈ పేరు అనేక మంది రాజులు ధరించారు. చాళుక్య నామం, చళుకి, చల్కి, సలుకి అను ద్రావిడ నామ రూపాంతరమే. **ప్రముఖ చరిత్ర పరిశోధకులు కీ.శే. కొమర్రాజు లక్ష్మణరావు గారు పరిశోధనచేసి 'దివాకరం' అను తమిళ భాషాకోశంలో చాళుక్య వెండార్ అను పదానికి 'వెల్లాల కుల ముఖ్యులు' అను అర్థం. ఈ వెల్లాల తెగవారు కర్షకులు.** వీరి ప్రాచీన నివాస స్థలం రాయలసీమ. వీరు ప్రారంభంలో కర్షకులు. క్షాత్రధర్మం అవలంభించి క్షత్రియులుగా పల్లవ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడి తాత్కాలికంగా ఓడి, ఉత్తరదిశగా వెళ్ళి, మహారాష్ట్ర దేశంలో బాదామి వద్ద, సత్యాశ్రయ ప్రథమ పులకేసి నాయకత్వాన రాజ్యం స్థాపించారు. వారు తిరిగి ఆంధ్రదేశాన్ని జయించి, ఒక శాఖవారు ఆంధ్రదేశంలో స్థిరపడ్డారు.

– ***ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర,*** *(పేజి 78–79), 'విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్'*
*రచయిత : ఏటుకూరు బలరామమూర్తి, ఎం.ఎ.,*

**(5)** 'ముక్తర్షి చరిత్రము' అను ప్రాచీన గ్రంథమును అనుసరించి అనంతపురం వాస్తవ్యులు, అర్యక్షత్రియులగు శ్రీయుత చిటివేలి పెద్ద రంగప్ప

**Page No. 62**



కుమారులు లక్ష్మీనారాయణచే సంస్కృతమున ప్రచురింపబడెను. ఈ గ్రంథమును చిత్తారి ఉద్దంటి వసంతయ్య గారి కుమారుడు రామకృష్ణయ్య గారు ఈ గ్రంథమును ఆంధ్రీకరింపవలెనని నాకు ఇచ్చిరి.

ఈ 'ముక్తర్షి చరిత్రము' నిక్కమనుటకు కాంచీపురమున ఏకాంబరేశ్వరుని గుడిలో ద్రవిడ భాషలో శాసనమున్నది. దానిని ఆంధ్రీకరించిన పత్రిక నాకు దొరకినది. ఆ శాసనము ఆయూరి కరణము స్వామి పిళ్ళ గారు వ్రాసినట్లున్నది. ఈ శాసనము 130 ఏళ్ళ క్రిందటిది. "శాలివాహన శకము 1724 దుర్మతి నామ సం॥ము ఆశ్వీజ శుద్ధ సోమవారం" ఈ శాసనము వ్రాయించుటకు కారణము మత వైషమ్యములని యూహింపవలెను. ఈ శాసనమున మౌక్తిక పురాణ విషయములు, వీరి సంతతి 'సోమ వంశ శౌర్య క్షత్రియులని' శాసనము నొక్కి వక్కాణించుచున్నది.

– ***'మౌక్తిక పురాణము',*** *గ్రంథ ప్రకాశకులు : ఉద్దంటి రామకృష్ణ వర్మ, నంద్యాల; గ్రంథకర్త : బ్రహ్మశ్రీ వేలమూరి జానకిరామమూర్తి గారు; ప్రచురణ : సుమారు 1940 ప్రాంతము.*

-- o O o --

## మా మనవి

*గుంటూరు, ఒంగోలు, కోస్తాంధ్ర ప్రాంతాలకు చెందిన మన ఆర్యవంశ క్షత్రియులు సుమారు 170 సం॥లకు పైగా చరిత్ర కలిగి ఉన్నారు. ఆ రోజుల నుండి వారి స్థితిగతులు, ఆచార, వ్యవహారాలు వారి తీరుతెన్నులు, మా పెద్దల వలన విని ఉన్నాము. కొన్ని చిత్రాలు మా అమ్మమ్మగారైన కీ॥శే॥ యకమా నాగలక్ష్మమ్మ గారు (యకమా వెంకటస్వామిగారి ధర్మపత్ని) జాగ్రత్త చేసి యున్నారు. వాటి వలన మన పూర్వీకుల వివరాలు 6, 7 తరముల వరకు తెలియవచ్చినవి. తరువాతి భావి తరముల వారికి ఈ వివరములు అందించవలసినదిగా కోరుతున్నాము. మన పిల్లలకు ఈ విలువైన మన పూర్వ తరాల చరిత్రను ఈ పుస్తకము ద్వారా తెలియజేయాలని కోరుతున్నాము.*

ఇట్లు

***వరాటి వెంకట నాగ మాలతి ఉమామహేశ్వర***
*బెంగుళూరు.*

***యకమా బాలసుధా ఫణికుమార్***
*చెన్నై.*